జూన్ 2015
రూ. 15/-

# చతుర

★ ఇందిరా సౌందర రాజన్
తమిళ నవల



★ తెలుగు కథ



★ నవలావలోకనం





# ఈనాడు కథల పోటీ

మీ అభిమాన దినపత్రిక 'ఈనాడు' కథల పోటీని నిర్వహిస్తోంది. రచయితలకూ రచయిత్రులకూ ఇదే ఆహ్వానం

ప్రథమ బహుమతి రూ.15,000

తృతీయ బహుమతి రూ.5,000

ద్వితీయ బహుమతి రూ.10,000

8 విశేష బహుమతులు (ఒక్కొక్కటి) రూ. 2,500



రూ. 50,000 విలువైన బహుమతులు

**నిబంధనలు:**

- కథ ఫుల్‌స్కేప్ సైజులో 7 పేజీలకు మించకుండా ఉండాలి. పేజీకి కాస్త అటూ ఇటుగా 25 లైన్లు ఉండాలి. కాగితానికి ఒకవైపే రాయాలి.
- కథల రాతప్రతుల్లో ఎక్కడా రచయిత/రచయిత్రి పేరుకానీ, చిరునామా కానీ రాయకూడదు. విడిగా మరో కాగితం మీద కథపేరు, రచయిత/రచయిత్రి పేరు, పూర్తి చిరునామా, కథ సొంతమే తప్ప అనువాదం/అనుసరణ/కాపీ కాదనీ అముద్రితమనీ హామీపత్రం రాసి కథకు జతపరచాలి.
- ఎంపికైన కథలు ఈనాడు ఆదివారం అనుబంధంలో ప్రచురితమవుతాయి. బహుమతి పొందని కథలను సాధారణ ప్రచురణకు స్వీకరించే అధికారం పోటీ నిర్వాహకులకు ఉంటుంది.
- ఉత్తమ కథల ఎంపికలో నిర్వాహకులదే తుది నిర్ణయం.
- ఎంపిక కాని కథలను తిప్పి పంపడం సాధ్యపడదు.

కథలు కేవలం సమస్యల్ని ఏకరువు పెట్టేవిగాకాక మానవ జీవితంలోని ప్రేమానుబంధాలకు అద్దంపట్టేలా ఉండాలి. అందమైన అనుభవాలనూ మధురమైన అనుభూతుల్నీ గిలిగింతలు పెట్టే హాస్యాన్నీ పాఠకులకు పంచుతూ వారి హృదయాలను మీటగలగాలి. యువతను ఆకట్టుకునే ఇతివృత్తాలకూ వారి జీవితాలను చుట్టుకుని ఆహ్లాదంగా సాగే చిలిపి, స్ఫూర్తిదాయక, ప్రేమకథలకూ ప్రాధాన్యం.

చిరునామా

**కథల పోటీ**
ఈనాడు ఆదివారం అనుబంధం
రామోజీ ఫిలింసిటీ
హయత్‌నగర్ (మం.), రంగారెడ్డి జిల్లా
తెలంగాణ-501 512.

కథలు మాకు చేరాల్సిన ఆఖరు తేదీ **25 జూన్ 2015**

# మనసున ఉన్నదీ...

★ చతుర 'మే' సంచిక మాతృప్రేమ ముఖ చిత్రంతో అలరించింది. అక్కినేని కుటుంబరావు 'తొలి అడుగులు' నవల ఆరంభం నుండి ఆఖరిదాకా ఎంతో ఆసక్తిగా చదివించింది. చతురసమ్'గతుల్లో 'విమాన ప్రయాణ రహస్యాలు'లో కోడ్‌నేమ్స్.. 'క్రాంచ్ క్రాంచెస్, బ్లూ జ్యూస్..' వంటి అనేక సాంకేతిక పదాలను పరిచయం చేశారు. 'భలేభలే' హుషారుగా చదివించింది. పిన్నాడ రవి బొమ్మలు సజీవ చిత్రాల్లా అన్పించాయి. 'భామనే.. సత్యభామనే..!' పేజీల్లో 'ప్రత్యామ్నాయం లేనిది అమ్మ' అన్న కథనం వంద శాతం నిజం. అతిపెద్ద కొమ్ములు గల కోడెద్దు 'వారెవ్వా!' అనిపించేలా ఉంది. పెద్ద కథ 'తొమ్మిది రోజుల్లో మరణం' మనసును కదిలించింది.

**– నేమాన సుభాష్ చంద్రబోస్,** విశాఖపట్నం

★ సర్వేపల్లి చతురోక్తులు మనసుకు, మెదడుకు పనిపెట్టి ఆనందింపజేశాయి. 'భామనే.. సత్యభామనే..!' శీర్షిక ప్రతినెలా ఆహ్లాదాన్నిస్తోంది. చతురసమ్'గతులు ఆహ్లాదకరంగానే కాక విషయం సేకరణలోనూ నిపుణతని చూపిస్తున్నాయి. 'చతురకతలు' చక్కగా ఉన్నాయి. పెద్దకథ 'తొమ్మిది రోజుల్లో మరణం' చక్కని కథాబలంతో రక్తి కట్టించింది. 'తొలి అడుగులు' నవల రచయిత కథాకౌశల్యాన్ని చాటింది.

**– డాక్టర్ శివభూషణం,** కర్నూలు

★ 'తొలి అడుగులు' నవల ఆద్యంతం ఏకబిగిన చదివించింది. అలనాటి గ్రామాల్లో చదువు మీద ఉన్న ఆసక్తి.. దాని కోసం పడే పాట్లు.. ఎదురయ్యే అడ్డంకులు.. బిగువైన కథనంతో కుటుంబరావు కళ్లకు కట్టినట్లు చిత్రించారు. 'భలేభలే'లో రచయితల చిత్రవిచిత్ర అలవాట్లని చదివి ఆనందించాం. చమత్'కారం'లో కవిగారి సమయస్ఫూర్తి బాగుంది. అలనాటి అపరాధ పరిశోధక నవల 'వాడే వీడు' సమీక్ష ఆసక్తికరంగా ఉంది. 'కొత్తగాలి' కవితలు వాస్తవాలకి అద్దం పట్టాయి.

**– డి. శ్రీనివాసదీక్షితులు,** నరసరావుపేట

★ మాతృదినోత్సవం సందర్భంగా ప్రచురించిన ముఖచిత్రంలో మాతృత్వం ఉట్టిపడింది. ఒకప్పటి గ్రామీణ విద్యావిధానం ఎలా ఉండేదో కళ్లకు కట్టిన 'తొలి అడుగులు' ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. చతురసమ్'గతులు బాగున్నాయి. 'కొత్తగాలి' కవితలు, చతురకతలు మళ్లీ మళ్లీ చదివించాయి.

**– బిక్కునూరి రాజేశ్వర్,** పాన్కల్

★ అక్కినేని కుటుంబరావు నవల 'తొలి అడుగులు' విద్యావ్యవస్థ తీరుకు దర్పణం పట్టేలా ఉంది. దేవరాజు వేంకటకృష్ణారావు నవల 'వాడే వీడు' సమీక్ష ద్వారా శతాబ్దం కిందటే డిటెక్టివ్ నవలకు నాంది పలికినట్లు తెలియజేశారు. 'భామనే సత్యభామనే..!' శీర్షికలో మాతృదినోత్సవ ప్రాశస్త్యం గురించిన సమాచారం బాగుంది. చతురకతలు హాస్యభరితంగా ఉన్నాయి. 'తొమ్మిది రోజుల్లో మరణం' ఆసక్తిగా సాగింది.

**– జి. నరసింహులు,**
బద్వేలు, కడప జిల్లా

★ 'తొలి అడుగులు' నవల మా చిన్నతనాన్ని గుర్తు తెచ్చింది. చదువుకోసం శీను పడిన కష్టాలు కన్నీళ్లు తెప్పించింది. 'భామనే.. సత్యభామనే..!' శీర్షికలోని 'ప్రత్యామ్నాయం లేనిది అమ్మ' చక్కగా ఉంది. అమ్మ గురించిన నిజాలు ఎన్నో వివరించారు.

**– కరణం శివానందరావు,** కర్నూలు

★ అలనాటి గ్రామీణ వాతావరణాన్ని గుండెల నిండుగా పీల్చుకుని 'తొలి అడుగులు' నవల అందించిన అక్కినేని కుటుంబరావు అభినందనీయులు. శీను పాత్రను మలిచిన తీరు శ్లాఘనీయం. నాకు పాలిటెక్నిక్‌లో ఇరవై రూపాయలు మెరిట్ స్కాలర్‌షిప్ రావడం, దానిలో సగం మెస్ బిల్లు కట్టడం జ్ఞప్తికొచ్చాయి.

**– జి.జి.కె. రావు,**
శ్రీకాకుళం

# చతుర

సంపుటి -38,
సంచిక - 5
449వ సంచిక,
పేజీలు : 132, జూన్ 2015



★ ముఖచిత్రం: నటి తషు కౌశిక్
ఛాయాగ్రాహకుడు: మధు
★ చివరి కవరు : మాస్టర్ చరితకృష్ణ
★ పుస్తకాలంకరణ : రాజు యాట



'**ఏ**మోయ్ బ్రోకరూ! ఈ భూమిని ఎవరికో ఒకరికి అంటగడితే కమీషన్ వస్తుందని రోజుకొకడ్ని పిలుచుకొస్తున్నావు. కానీ శాపం పట్టిన ఈ ఊరికి మాత్రం ఓ దారి కనబడ్డంలేదు' అన్నాడు దారిన పోతున్న ఎడ్లబండి అతను.

'ఓయ్! నోరు మూసుకుని నీ పని చూసుకుని పోవయ్యా!' విసుక్కున్నాడు స్వామినాథం.

'శాపం పట్టిన ఊరా? ఏం చెబుతున్నాడతను' ఆశ్చర్యంగా అడిగాడు ఆ భూమిని కొనడానికొచ్చిన కరుణాకర్. స్వామినాథం మాట్లాడలేదు.

'నేనిలా చెప్తుంటే మీకు కోపం రావచ్చు! పాములు వెంటబడి కరిచి చంపినపుడు తెలుస్తుంది' అంటూ తన దారిన తాను పోయాడు ఎడ్లబండి అతను.

ఇంతకీ అతను చెప్పినట్లు ఆ ఊరికి శాపం పట్టడం నిజమేనా? కరుణాకర్ ఆ ఊరి భూమిని కొన్నాడా? అక్షరాక్షరంలో ఉత్కంఠ వెల్లువయ్యే **ఇందిరా సౌందరరాజన్** తమిళ సస్పెన్స్ థ్రిల్లర్‌కు **డా. యండపల్లి పాండురంగ** తెలుగు అనువాదం **నాగేశ్వరపురం 4 కి.మీ.** 6వ పేజీలో..

# నాగేశ్వరపురం 4 కి.మీ.

'మా జమీన్ అమ్మి నాకు వివాహం చెయ్యాలని మా తండ్రిగారి ఆలోచన. కానీ మా భూములు కొనడానికొచ్చిన ఎందరో ఇక్కడి నాగుపాములకు బలయ్యారు. అందుకే దయచేసి మీరు మా జమీన్‌ను కొనొద్దు! ప్రాణాలు పోగొట్టుకోవద్దు. ఇట్లు, పూర్ణిమా దేవి' ఆ ఉత్తరం చదివి అయోమయంలో పడిపోయాడు జమీన్ కొనేందుకు వచ్చిన కరుణాకర్.

నాగేశ్వరపురం జమీన్‌ను కొనడానికొచ్చినవారిని కాటేస్తున్న నాగుపాముల అసలు కథేంటి? ఇంతకీ కరుణాకర్ ఆ భూములను కొన్నాడా?

ఆద్యంతం ఉత్కంఠ పెంచే ఇందిరా సౌందరరాజన్ తమిళ సస్పెన్స్ థ్రిల్లర్‌కు

డా. యండపల్లి పాండురంగ తెలుగు అనువాదం

నాగేశ్వరపురం 4 కి.మీ.

చతుర జూన్ కానుక!



బొమ్మలు : బాలు

పాము పడగ మాదిరిగా ఉన్న ఆ కారు, తారు రోడ్డుని వదిలి ఆ గ్రామానికి వెళ్లే మట్టిరోడ్డు వైపు తిరిగి-వేగంగా పరుగు పెట్టడం ప్రారంభించింది. విపరీతంగా రేగిన ఎర్రని దుమ్ము మధ్య-పుట్టలోంచి దూసుకొస్తున్న తెల్లటి తాచుపాములాగ ఆ కారు కనిపిస్తోంది. ఆ కారు వెంబడే ఒక జీప్ అదే వేగంతో అనుసరిస్తోంది. ఆ మట్టిరోడ్డును ఆనుకుని ఉన్న ఒక పురాతన ఆలయం దగ్గర రోడ్డు మలుపు తిరిగింది. సరిగ్గా ఆ మలుపులో మట్టిరోడ్డు పక్కనే ఒక పెద్ద పాము శిల. రెండు అడుగుల వెడల్పు, మూడు అడుగుల పొడవు వుంది దాని పడగ. భక్తులు నిత్యం పూజలు చేస్తున్నట్లుగా దాని తలపై పసుపు కుంకుమలు, నూనె మరకలు. దాని చుట్టూ వెలుగుతున్న దీపాలు. నాగశిల పక్కనే ఒక పెద్ద శిలా ఫలకం. ఆ ఫలకంపై 'నాగేశ్వరపురం- 4 కి.మీ.' అని చెక్కి వుంది.

ఆ నాగశిలను కారులో నుంచి తొంగి చూశాడు కరుణాకర్. అతని వయస్సు ముఫ్ఫై సంవత్సరాలు. ఇంకా పెళ్ళి కాలేదు. అసలు పెళ్ళి గురించి ఆలోచించ డానికే అతనికి తీరిక దొరకదు. అంత పెద్ద బిజినెస్ మాగ్నెట్. అతని పక్క సీట్లో కూర్చుని ఉన్నాడు అసిస్టెంట్ గిరి ధర్. గిరిధర్ వయస్సు నలభై వరకు వుండవచ్చు. ఇద్దరు పిల్లలు. స్కూల్లో చదువుకుంటున్నారు.

కరుణాకర్ నాగశిలను పరిశీలనగా చూసి - గిరిధర్ వైపు తిరిగాడు.

అదే సమయంలో గిరిధర్, "సార్! బ్రోకర్ స్వామినాథం చెప్పిన లాండ్ ఇక్కడి నుంచే ఆరంభమవుతోంది" అని చెప్పి, కారును ఒక పక్కగా ఆపించాడు.

కారు ఆగింది. కారులో నుంచి దిగారు కరుణాకర్, గిరిధర్.

వెనుకనే వస్తోన్న జీప్ కూడా ఆగింది. ఆ జీప్‌లో నుంచి దిగి, బ్రోకర్ స్వామి నాథం పరుగు పరుగున కారు దగ్గరకు వచ్చాడు. సరిగ్గా అయిదడుగుల పొడవుంటాడు. తెల్లని లాల్చీ, పైజమాలో గుండ్రాయి మాదిరిగా, కొంత ప్రత్యేకంగా కనిపిస్తున్నాడు.

"రా! స్వామినాథం! ఇక్కడ నుంచేనా ఆ ల్యాండ్? " అడిగాడు అసిస్టెంట్ గిరిధర్.

"అవును సార్! ఇక్కడ్నుంచే ప్రారంభం. ఇక్కడ్నుంచి నాగేశ్వరపురం గ్రామం నాలుగు కిలోమీటర్ల దూరం వుంటుంది. అంతవరకు వున్న ఈ ల్యాండంతా నాగే శ్వరపురం జమీన్‌ది. సారవంతమైన ఎర్రమట్టినేల. ఈ నాలుగు కిలోమీటర్ల స్థలంలో రెండుచోట్ల గెస్ట్‌హౌస్‌లు, అది గాకుండా పన్నెండు బావులూ వున్నాయి.

"బావుల్లో నీరు వుందా? "

"ధారాళంగా పొంగి పొర్లుతోంది సర్!"

"అయితే.. ఈ స్థలాన్ని ఎందుకు బీడు పెట్టేశారు. కనీసం సర్వీచెట్లు పెంచినా మంచి ఆదాయం వచ్చేది కదా? "

"వస్తోందనుకోండి..! కానీ.." నసిగాడు బ్రోకర్ స్వామినాథం.

"ఏమిటి కానీ? "

"ఈ నాగేశ్వరపురం జమిందార్‌కు ఏం చెయ్యడానికి ఇష్టం లేదు సార్! ఈ జమీన్ అమ్ముడయిపోతే - మొత్తం సింగపూర్ వెళ్ళిపోవాలని ఆయన ఆలోచన. ఇప్పుడు కూడా సంవత్సరంలో సగం రోజులు సింగ పూర్‌లోనే ఉంటున్నారు"

"అక్కడ ఎవరున్నారు? "

"భార్యా, కూతురు ఇద్దరూ అక్కడే వుంటున్నారు"

"మొత్తం ఆస్తి అంతా ఇక్కడుంది. ఈ యన మాత్రం కుటుంబంతో సహా సింగ పూరులో వుంటాడు. ఆశ్చర్యంగా వుందే!"

"ఎంతుంటే మాత్రం ఇది పల్లెటూరు. సింగపూరేమో సిటీలైఫ్" అన్నాడు గిరిధర్.

గిరిధర్ చెప్పిన ఈ సమాధానం

ఎందుకో కరుణాకర్‌కు రుచించలేదు. వేరే ఇంకేదో కారణం వుండి వుంటుంది అను కున్నాడతను.

"ఈ భూమికి సంబంధించిన 'సాయిల్ రిపోర్టు' తీసుకున్నారు కదూ!" గిరిధర్‌ను అడిగాడు కరుణాకర్.

"ఎస్ సార్!" అంటూ గిరిధర్, వెంటనే కారులో వున్న ఫైల్ తీసి, దాంట్లోంచి ఆ రిపోర్టును కరుణాకర్‌కు ఇచ్చాడు.

"సూపర్ సాయిల్ సార్ ఇది. పూలతో టలకు మంచి అనుకూలమైన నేల అని వ్యవసాయ పరిశోధనశాఖవారు రిపోర్టు ఇచ్చారు"

గిరిధర్ చెప్పిన మాటలు బ్రోకర్ స్వామినాథానికి ఎక్కడలేని ఉత్సాహాన్ని తెచ్చిపెట్టాయి.

"అవును సార్! నాగేశ్వరపురం రోజా, మల్లి, చామంతి, మరువం వంటి తోటలకు పేరుపడ్డ వూరు. ఇక్కడ్నుంచి తూర్పుగా యాభై కిలోమీటర్ల దూరంలో క్రిష్ణగిరి, పడమరగా ముప్పై కిలోమీటర్ల దూరంలో బెంగళూరు వున్నాయి. క్లైమేట్ ఎప్పుడూ చల్లగా వుంటుంది. వర్షాకాలంలో మంచి వర్షాలు పడతాయి. ఈ వూరి ప్రత్యేకత ఇక్కడి వాతావరణమే సార్! మొత్తం ఈ ప్రాంతంలో పూలతోటలు ఎక్కువగా సాగు చేస్తారు. తమిళనాడు మొత్తానికి ఇక్క డ్నుంచే అన్నిరకాల పువ్వులు సరఫరా అవుతాయి. అంతేకాదు విదేశాలకు ఎగుమతీ అవుతుంటాయి"

బ్రోకర్ స్వామినాథం ఈ మాటలు ఇప్ప టికి నాలుగుసార్లు చెప్పాడు. అంచేత గిరి ధర్‌కు మండిపోయింది. అతని వంక చిరాగ్గా చూశాడు.

బ్రోకర్ స్వామినాథానికి అర్థమయ్యింది.

కరుణాకర్ మాత్రం చుట్టుపక్కల పరిశీ లనగా చూస్తున్నాడు.

సరిగ్గా అదే సమయంలో ఆ దారినే పోతున్న రెండెడ్ల బండిలోంచి ఇద్దరు ఆడ వాళ్ళు దిగి, తిన్నగా ఆ నాగశిల దగ్గరకు వెళ్ళి, దీపాలు వెలిగించి ఆ శిల ముందు సాగిలబడి మొక్కడం చూశాడు కరుణా కర్. కొంచెం నవ్వు వచ్చింది.

"ఏమిటిదంతా మిష్టర్ స్వామినాథం? " అడిగాడు కరుణాకర్.

"నాగదేవత సార్!"

"అది తెలుస్తోంది. పదిమంది వచ్చిపో యే దారిలో అడ్డంగా ఒక రాయి నాటి.."

"ఈ వూరువారెవ్వరూ అది అడ్డుగా వుందనుకోవడం లేదు సార్!" బ్రోకర్ స్వామినాథం తనకు తెలిసిన సమాధానం చెప్పి వూరుకున్నాడు.

ఈలోపల రెండెడ్ల బండిలో వచ్చి నవాళ్లు- ఆ నాగశిలకు పూజలు పూర్తిచేసు

## కొత్తగాలి...

**సమాజ 'ఆరోగ్యం'**
**పర్యావరణ 'శుద్ధి'**
**రోగాల నుంచి 'విముక్తి'కి**
**దివ్యౌషధం 'స్వచ్ఛభారత్'**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

కుని, కరుణాకర్ కారును దాటి ముందుకు పోసాగారు.

అదే సమయంలో ఆ రెండెడ్ల బండి తోలుతున్న ఆ వ్యక్తి బ్రోకర్ స్వామినా థాన్ని చూశాడు. అది గమనించనట్లు బ్రోకర్ స్వామినాథం తల పక్కకు తిప్పుకు న్నాడు. అయినా ఆ వ్యక్తి వదల్లేదు.

"ఏమోయ్ బ్రోకరూ! ఎవరు..? పార్టీయా..? " పగ్గాలు పట్టిలాగి బండి ఆపి మరీ అడిగాడు.

"ఆc!.. అవును..! అయినా నీకెందుకు? నీ పని చూసుకో!"

"అది నాకు తెలుసులేవోయ్! కమీషన్

కోసం రోజుకొకర్ని పిలుచుకు వస్తున్నావు. కానీ శాపం పట్టిన ఈ వూరికి మాత్రం ఒక దారి కనపడడం లేదు" అన్నాడు ఆ ఎడ్లబండి అతను.

అతను అన్న మాటలు కరుణాకర్ చెవిన పడ్డాయి.

"శాపం పట్టిన వూరా? ఏం చెబుతున్నాడతను? " అడిగాడు.

బ్రోకర్ స్వామినాథానికి ఆ బండివాడి మీద ఎక్కడలేని కోపం తన్నుకొచ్చింది.

"ఓయ్! మూసుకుని నీ పని చూసుకుని పోయ్యా! ఇపుడు ఎవరైనా వచ్చి నిన్నడిగారా? " అని గదమాయించాడు.

"నేను ఇపుడు చెపుతుంటే మీకు కోపం రావచ్చు! పాములు వెంటబడి తరిమి తరిమి - కరిచి చంపినపుడు తెలుస్తుంది. అయినా నాకెందుకు? " అంటూ ఎడ్లను అదిలించి, బండిని ముందుకు నడిపించుకు పోయాడతను.

అది విన్న కరుణాకర్, గిరిధర్ ఇద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"ఏంటి సార్ ఆలోచిస్తున్నారు? అతను అన్న మాటలు మీరేమీ పెద్దగా పట్టించుకోకండి! అదంతా వివరంగా తరువాత చెబుతాను. ముందు ఈ ల్యాండ్‌ను చూడడం పూర్తిచెయ్యండి!"

"అదే చేస్తున్నాం కదయ్యా! ముందు అతను అన్న మాటలకి వివరం చెప్పు" స్వరం హెచ్చించి, కొంచెం కఠినంగా అడిగాడు గిరిధర్.

"సార్! ఈ నాగేశ్వరపురం, జమిందారీ పరంపరకు చెందిన వూరు. ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత జమీన్లన్నీ పోయినా, ఆ గౌరవం మాత్రం ఈ నాగేశ్వరపురం వంశస్థులకి ఇప్పటి వరకు అలాగే కొనసాగుతోంది. ఆ జమిందార్ వంశానికి సంబంధించిన వారే ఇపుడున్న జమిందార్ దొరైసింగం. ఆయనా సింగపూరులో సెటిలైపోవడానికి చూస్తున్నాడు"

"ఇపుడతను సింగపూర్‌లోనే కదా నివసిస్తున్నాడు? "

"ఆఫ్‌కోర్స్! అది నిజమే అనుకోండి! ఈ ప్రదేశంలో ఒకప్పుడు ఒక పెద్దనాగు పాము పుట్ట వుండేదిట! అప్పటి జమిందార్ - ఆ పుట్టను పడగొట్టి ఆ స్థలంలో భవనం కట్టాలని ఆశపడ్డాట! ఆ పుట్టను పడగొట్టినపుడు - దానిలోపల ఒక మగ పాము, ఒక ఆడపాము వున్నాయట! వాటి పిల్లలు కూడా వున్నాయట! వాటినన్నిటిని జమిందారు మనుషులు కొట్టి చంపేశారట! అంతవరకు ఎంతో వైభవంగా వున్న జమిందారు కుటుంబం - ఆ తరువాత అంతగా రాణించలేకపోయింది"

బ్రోకర్ స్వామినాథం చెప్పిన ఈ విషయం - ఏదో కామిక్స్ పుస్తకంలోని కథలాగ అనిపించింది కరుణాకర్‌కు.

"సరే! మరి ఈ శాపం ఎప్పట్నుంచి వచ్చింది? " అడిగాడు గిరిధర్.

"పుట్టను నాశనం చేసేటపుడు - చచ్చిపోతున్న ఆ పాములన్నీ - ఈ జమిందారు కుటుంబం- ఏ కాలంలోనూ అభివృద్ధి చెందకూడదని శాపం పెట్టాయని చెపుతారు"

"ఇదంతా జరిగి ఎన్ని సంవత్సరాలైవుంటుంది? "

"ఒక యాభై లేదా అరవై సంవత్సరాల క్రితం జరిగి వుంటుంది సార్!"

"మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత అయ్యుండవచ్చు!"

"అవును సార్!"

"అది సరే! ఇన్ని సంవత్సరాలు గడిచిపోయిన తరువాత కూడా ఆ శాపానికి శక్తి ఉంటుందంటావా? "

"అది.. అది.. సార్.." బ్రోకర్ స్వామినాథం ఆ తరువాత ఏం చెప్పాలో అర్థం కాక ఆగిపోయాడు.

"ఏంటయ్యా? .. చెప్పు.."

"అదేమిటంటే.. మీలాగనే ఈ ల్యాండ్ కొనడానికి ఇంతకు ముందు చాలామంది

# భర్తకన్నా ఆమెకు గుర్రమే ఇష్టం!

చతుర సమాచారం

అసూయ మానవ సహజం. భార్యాభర్తల మధ్య కూడా అది ఉండొచ్చు. వింత కారణాలకే అసూయ చెందిన కొందరి విశేషాలు..

★ సౌదీ అరేబియాలోని రియాద్‌కి చెందిన ఓ భర్త, గుర్రాన్ని ముద్దు పెట్టుకున్న భార్య ఫొటోని చూసి విడాకులు తీసుకున్నాడు. తనకి తన భర్తకన్నా అరేబియన్ గుర్రాలంటేనే ప్రేమ అని ఆమె కోపంగా చెప్పింది.

★ ఇంగ్లండ్‌లోని లైసెస్టర్‌కి చెందిన డెబ్బీవుడ్(42)కి అసూయ ఎక్కువ. ఆమె భర్త స్టీల్ ఉడ్(30) ఫోన్, ఇమెయిల్ అకౌంట్, బేంక్, క్రెడిట్ కార్డు స్టేట్‌మెంట్స్ తనిఖీ చేయటమే కాక, అతను కేంప్‌కి వెళ్లొచ్చినప్పుడల్లా లైడి టెక్టర్‌తో టెస్ట్ చేస్తుంది.



★ చైనాకి చెందిన ఊ సియా(21) తన గర్ల్‌ఫ్రెండ్ జున్ టేంగ్(20) నించి విడిపోయాడు. రాంగ్‌సావో(22)తో ప్రేమలో పడ్డాడు. వారిద్దరూ అతన్ని పిలిచి, అతను చూస్తుండగా నదిలోకి దూకారు, అతను ఎవర్ని కాపాడతాడో తెలుసుకోడానికి!

★ తన మీద అనుమానంతో తన భర్త రాత్రిళ్లు గడపముందు నిద్రిస్తాడని, ఎవరైనా మగాడు రాత్రుల్లో వస్తాడేమోనని అనుమానం అని చెప్పి జింబాబ్వేకి చెందిన ఓ భార్య విడాకులు తీసుకుంది.

★ చికాగోలో 2012లో మిడ్ టర్మ్ ఎలక్షన్స్‌కి ప్రెసిడెంట్ బరాక్ ఒబామా, ఓటు వేయడానికి వచ్చి క్యూలో నిలబడ్డప్పుడు మైక్ అనే వ్యక్తి ఒబామాతో చెప్పాడు 'నా గర్ల్ ఫ్రెండ్‌ని ముట్టకోకండి'. 'నాకా ఉద్దేశం లేదు' నివ్వెరపోయిన ఒబామా జవాబు చెప్పాడు. క్యూలో ఆయన ముందు నిల్చున్న మైక్ గర్ల్‌ఫ్రెండ్ అయాకూపర్ తన బాయ్‌ఫ్రెండ్‌కి అసూయ ఎక్కువని జర్నలిస్టులతో చెప్పింది.

★ టెన్నెస్సీకి చెందిన లోవెల్ టర్పిన్(40) తనతో జీవించే గర్ల్‌ఫ్రెండ్ క్రిస్టల్ గ్రే(38) ఫేస్‌బుక్‌లో ఆమె పేజీలో మిట్ రోమ్నీ (2012 అధ్యక్ష ఎన్నికల్లో రిపబ్లిక్ పార్టీ నామినీ) ఫొటో చూసి ఆమె ల్యాప్‌టాప్‌ని పగలకొట్టి, అతనితో ఆమెకి ఎఫైర్ ఉందని ఆరోపించాడు!

★ మార్చి 2015లో బ్రాంక్స్‌కి చెందిన నార్బెట్టో(21) తన బాస్‌కి లేట్‌గా వస్తానని ఎస్ఎంఎస్ పంపుతుంటే, అతని గర్ల్‌ఫ్రెండ్ క్రిసైల్(23) ఇంకో యువతికి దాన్ని పంపుతున్నాడనుకుని నార్బెట్టోను పొడిచి చంపింది.

---

వచ్చారు. కానీ, వారందర్నీ పాములు వెంటబడి తరిమి - కాటు వేసి చంపేశాయంటారు. అప్పట్నుంచి ఆ భయం అలా వుండిపోయింది".

"ఓహో! అదా! ఈ ల్యాండ్, మార్కెట్ రేటు కంటే చాలా రెట్లు తక్కువగా ఉండడానికి కారణం"

"ఏం సార్! చదువుకున్నవారు.. మీరు కూడా అవన్నీ నమ్ముతున్నారా..? "

అది విన్న గిరిధర్‌కు కోపం వచ్చింది. "నువ్వు ఈ విషయం, ఈ ల్యాండ్ గురించి ఈ వివరాలు ముందే ఎందుకు చెప్పలేదు? "

"మీరు ఈ ప్రాంతాన్ని పూర్తిగా చూసిన తరువాత చెపుదామనుకున్నాను. అంతే కాదు సార్! ఇదంతా నాకు నమ్మబుద్ధి కావడంలేదు. ఇంత మంచి ల్యాండ్ ఇలాంటి కట్టుకథల వల్ల రేటు సగానికి సగం పడిపోయింది. ఇప్పుడు మీరుగానీ కొనకుండా పోయారా.. దీని రేటు మరింత పడిపోవడం తథ్యం" బ్రోకర్ స్వామినాథం స్వరం ఒక రకమైన బాధ, వేడుకోలు మిళితమై వుంది.

గిరిధర్ చూపు కరుణాకర్ వైపు

మళ్ళింది.

గాలి అక్కడ మొలిచిన పిచ్చిచెట్ల మధ్య నుంచి శబ్దం చేస్తూ చల్లగా వీస్తోంది. వాతావరణ కొలమాని పెట్టి కొలిస్తే- బహుశా ఉష్ణోగ్రత 20 డిగ్రీల సెల్సియస్ కంటే తక్కువ ఉండవచ్చు అనిపిస్తోంది.

చల్లగాలికి కరుణాకర్ ఉంగరాల జుట్టు మరింత ముడుచుకుని రింగులు తిరుగుతున్నట్లు కనిపిస్తోంది.

"సార్..!" గిరిధర్ గొంతు కలవరంగా పలికింది.

"చెప్పండి గిరిధర్!"

"ఏం చేద్దాం సార్..? "

"మీరు చెప్పండి ఏం చేద్దామో..!"

"నేనా సార్? డబ్బు ఇచ్చి కొనేది మీరు కదా..!"

"పోనీ! మీరే డబ్బు ఇచ్చేదనుకొని.. చెప్పండి!"

"అయితే వద్దు సార్! వెనక్కి వెళ్లిపోదాం!"

గిరిధర్ అంత నిర్మొహమాటంగా తన నిర్ణయాన్ని చెప్పేస్తాడనుకోలేదు. అది విన్న బ్రోకర్ స్వామినాథం గుండెల్లో రాయి పడింది.

"ఏమిటి సార్ మీరు? సార్ అడిగినందుకైనా ధైర్యంగా కొందామని చెప్ప వచ్చు కదా సార్? ఈ చుట్టుపక్కల ప్రాంతంలో పన్నెండు బావులతో, రెండు గెస్ట్‌హౌస్‌లతో ఇలాంటి జమీన్ దొరకమన్నా దొరకదు"

"మిష్టర్ స్వామినాథం! కొంచెం నోరు మూసుకుంటావా? నీకు వచ్చే లక్షల కమీషన్ కోసం ఇలాంటి ప్రాబ్లమ్ వున్న ల్యాండ్ కొని మమ్మల్ని కష్టపడమంటావా? " కోపంతో అరిచాడు గిరిధర్.

"ప్రాబ్లమా సార్? దస్తావేజులు క్లియర్‌గా వున్నాయి. ఎన్ని సంవత్సరాల కైనా ఈసీ తీసి మీరు చూసుకోవచ్చు"

"నేను దస్తావేజు పత్రాల గురించి మాట్లాడడం లేదు. ఈ ల్యాండ్ కొనడానికి వచ్చిన వారిని పాములు కాటువేసి చంపే శాయని నువ్వు చెప్పలేదే, దాని గురించి"

"సార్! అవేవో చిన్నచిన్న రూమర్స్! వాటిని నమ్మి మీరు.."

"ఇక ఆపు! చిన్న రూమర్సా అవి? మంచి నీటివసతి వున్న ల్యాండ్ మా వరకు మాకు ముఖ్యం"

"నీటివసతి చాలా బాగా వుంది కదా? "

"అది చాలదు. ఈ నేలపై నాగుల శాపం ఉందని తెలిసీ కొని, అవస్థలు పడడానికి మేం సిద్ధంగా లేం" గిరిధర్ చాల తీవ్రంగా చెప్పాడు. అదే వేగంతో "రండి సార్! మనం వెళ్లిపోదాం!" అన్నాడు.

కరుణాకర్ చిరునవ్వు నవ్వాడు.

"ఏం సార్? నవ్వుతున్నారు? "

"గిరిధర్! మీరొక సెంటిమెంటల్ మాన్ అని నిరూపించుకున్నారు"

"ఏం అంటున్నారు సార్ మీరు? "

"మిమ్మల్ని టెస్ట్ చెయ్యడం కోసం మీ నిర్ణయం చెప్పమన్నాను. కానీ, మీరింత పాతకాలంగా ఆలోచిస్తారని అనుకోలేదు"

ఇది విన్న బ్రోకర్ స్వామినాథానికి కొంత ధైర్యం వచ్చింది.

"ఇప్పుడు, ఇది కొనడానికే నా మీ నిర్ణయం? "

"డెఫినెట్లీ మిష్టర్ స్వామినాథం! మీరు మీ జీప్‌ను ముందుకు పోనివ్వండి. మేం మీ వెనుకనే ఫాలో అవుతాం. అవునూ! జమీందార్ దొరైసింగం ఇప్పుడు ఇక్కడే వున్నారా? లేదా సింగపూర్‌లో వున్నారా? "

"ఇక్కడే! నాగేశ్వరపురంలోని వారి జమిందారీ భవనంలోనే వున్నారు సార్! ప్రస్తుతం మీ కోసమే ఎదురు చూస్తున్నారు"

"వెరీగుడ్! వారిని కలిసి మాట్లాడి- సెటిలైతే అడ్వాన్సు కూడా ఇచ్చేద్దాం..! కానీ, ఒక విషయం మీరు అక్కడ చెప్పాల్సి వుంటుంది"

"ఏమిటిసార్! అది? "



# రచయితలకు సూచనలు

**నవ్యనవలా వేదిక 'చతుర'కు రచనలు పంపేవారు ఈ కింది సూచనల్ని గమనించాలి.**

---

★ చతురకు నవలలు పంపేవారు సామాజిక సమస్యలపై దృష్టిపెట్టాలి. హాస్య, వ్యంగ్య సహా ఏ ఇతివృత్తమైనా ఎంచుకోవచ్చు. వైవిధ్య కథా వస్తువులకు ప్రాధాన్యం ఉంటుంది. నవ్యతకే పెద్దపీట.

★ బొమ్మలు, వివిధ శీర్షికలు, ప్రకటనలు పోను 'చతుర నవల' అచ్చులో 80-85 పేజీలు ఉంటుంది. దీనికి అనుగుణంగా రచయితలు నవలల్ని రాసి పంపాలి.

★ ప్రచురణకు స్వీకరించని నవలలు తిప్పి పంపేందుకు వీలుగా తగినన్ని స్టాంపులు అంటించిన సొంత చిరునామా గల కవరు జతపరచాలి. స్టాంపులు అంటించని నవలలు ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి.

★ నవలలపై నిర్ణయం తెలియజేయడానికి 6-8 వారాలు పడుతుంది. ఫోన్/ ఎస్సెమ్మెస్/ ఈమెయిల్ ద్వారా మా నిర్ణయాన్ని తెలియజేస్తాం. గడువులోగా సమాచారం అందకపోతే మమ్మల్ని సంప్రదించవచ్చు.

★ నవలతోపాటు మీ చిరునామా, ఫోన్ నెంబరు, ఈ మెయిల్ వివరాలు స్పష్టంగా రాయాలి.

★ సంపాదకులను ఉద్దేశించి 'హామీ పత్రం' తప్పనిసరిగా పంపాలి. హామీ పత్రం లేని నవలలు పరిశీలించలేమని మనవి.

## నమూనా హామీ పత్రం

సంపాదకులు చతుర!

ఫలానా నవలను 'చతుర'లో ప్రచురణార్థం పంపుతున్నాను. ఈ నవల నా సొంతం. దేనికీ అనువాదం కాదు. ఒకవేళ అనువాదమైతే (అనువాద నవల ఫలానా భాషా రచయితది (రచయిత పేరు). ఫలానా పబ్లిషర్‌నుంచి, ఫలానా భాషలో స్వీకరించి అనువదించాను).

ఈ నవలను ఇంతవరకూ ఏ పత్రికకూ పంపలేదు. ఏ పత్రిక పరిశీలనలోనూ లేదు. ఏ వెబ్‌సైట్, బ్లాగులో కానీ ప్రచురితం కాలేదు. ఈ అనువాద నవలకు మూల రచయిత/రచయిత్రి/ ప్రచురణకర్తల నుంచి అనుమతి పొందాను/ పొందలేదు. ప్రచురణకు స్వీకరించని పక్షంలో తిప్పి పంపటానికి స్టాంపులు అంటించిన కవరు జతపరిచాను/లేదు.

తేదీ:

స్థలం: సంతకం:

చిరునామా : ఎడిటర్, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్-500082

ఫోన్ : 23318181, Ext: 6658, 6532 ఈ మెయిల్: vipula.chatura@gmail.com

"ఏమిలేదు! ఇప్పుడు మీరు చెబుతున్న రేటు మీద పదిహేను శాతం తగ్గించాలి"

బ్రోకర్ స్వామినాథం ముఖం చిన్నబోయింది.

ఏం చెప్పబోతాడా అని గిరిధర్ ఆత్రుతగా స్వామినాథం ముఖంలోకి చూశాడు.

"సార్! దీనికి జమీందార్ దొరైసింగం ఒప్పుకోవాలి కదా సార్!"

"ఒప్పుకుంటే ఈ ల్యాండ్ నాదవుతుంది. లేదా ఆయన జమీన్ ఆయన దగ్గరే వుంటుంది"

"సరేసార్ రండి! పోయి మాట్లాడి చూద్దాం" అని చెప్పి బ్రోకర్ స్వామినాథం తన జీప్‌లో కూర్చోగానే, జీప్ నాగేశ్వరం వైపు పరుగుపెట్టింది. ఈసారి కరుణాకర్ తెల్లని కారు దానిని వెంబడించింది.

నాగేశ్వరపురానికి వెళ్లే మట్టిరోడ్డు అనేక మలుపులు తిరిగి వుంది. దారి పొడవునా ముళ్లపొదలు, పిచ్చిచెట్లు, మధ్యలో ఎన్నో పాము పుట్టలు. కొన్ని పుట్టలు - చిన్న సైజు ఇల్లు మాదిరిగా కనపడుతున్నాయి. సుమారు పదిహేను, ఇరవై అడుగుల ఎత్తువరకు కూడా ఉన్నాయి.

ఈవిధమైన దృశ్యాలు కరుణాకర్‌కు పూర్తిగా కొత్త.

అక్కడక్కడ పూదోటలు పంటగా వేసినట్లున్నారు. విరబూసిన పువ్వులతో మనోహరంగా కనబడుతున్నాయి. ఆ పంట భూముల దగ్గర చాల గుడిసెలు వరుసగా మట్టిరోడ్డు పక్కనే వేసి ఉన్నాయి. ఆ గుడిసెల ముందు ఎంతో మంది చిన్నపిల్లలు ఆడుకుంటున్నారు. వారిలో సగం మందికి పైగా ఒంటిమీద బట్టలు లేవు.

దాదాపు రెండు కిలోమీటర్ల దూరం వరకు మట్టిరోడ్డు పక్కనే చిన్న సెలయేరు మాదిరి - నీటి ప్రవాహం ఒకటి పారుతూ ఉంది. బహుశా ఆ జమీన్ లోపలి కొండ గుట్టల మధ్య జలపాతం ఏదో వుండి వుంటుంది.

ఓ పది సంవత్సరాల పిల్లవాడొకడు ఆర డుగుల కోడె తాచును మెడలో పూమాల మాదిరిగా వేసికొని రోడ్డుపై అటూ, ఇటూ తిరుగుతున్నాడు.

అది చూసిన గిరిధర్‌కు గుండె గుభిల్లుమంది. కరుణాకర్ కూడా చకితుడయ్యాడు.

"ఏమిటి గిరిధర్ ఇది? వీరంతా ఎవరు? "

"తెలియడం లేదు సార్! బ్రోకర్ స్వామినాథాన్ని అడుగుదాం"

"చూడ్డానికి బాగా వెనకబడ్డ జనం మాదిరిగా ఉన్నారు. అదీగాక మనం కొనబోయే స్థలంలో గుడిసెలతో సహా తిష్ఠవేసినట్లుగా వుంది. ఒకవేళ ఎంక్రోచ్‌మెంట్ మేటరేమో? "

"కావచ్చు సార్! లేకపోతే ఇంత తక్కువ రేటుకు ఈ జమీన్ అంతా అమ్మకానికి పెడతారా? "

"ఒకవేళ మనం కొనే పక్షంలో - మొత్తం వీరందర్నీ ఖాళీ చేయించిన తరువాతే - డబ్బు ఇద్దామని చెబుతాం"

కారు నాగేశ్వరపురం వైపు దూసుకుపోతోంది. కరుణాకర్ చెప్పిన విషయం విని గిరిధర్ ఆలోచనలో పడ్డాడు.

"ఏమిటి గిరిధర్ ఆలోచిస్తున్నారు? "

"ఏంలేదు సార్! మీరు.. ఈ జమీన్ కొనడానికే నిర్ణయించుకున్నారన్నమాట!"

"ఆఫ్‌కోర్స్! నీటి వసతి వుంది. వాతావరణం చాలా బాగుంది. రేటూ తక్కువ.. దీన్ని ఎలా వదలమంటారు గిరిధర్? "

"కూడా నాగుల శాపం.. ఎంక్రోచ్‌మెంట్.. తలనొప్పిగా లేదూ? "

"ఆ నాగుల శాపాన్ని ఎత్తి డస్ట్‌బిన్‌లో వేయండి. అదంతా నమ్మడానికి నేను సిద్ధంగా లేను. ఇక ఎంక్రోచ్‌మెంట్ అంటారా! నిజమే! అది ప్రాబ్లమే! దాన్ని సరిచేయాల్సిన బాధ్యత జమిందారుది"

# సం'దేహం'

జాను! నిజం!!

మన శరీరంలో దాదాపుగా పది ట్రిలియన్లు అంటే పది లక్షల కోట్ల పైబడి జీవకణాలు ఉన్నాయి.

★ మన తెలివికి, మన మెదడులో ఉన్న జీవ కణాలకు మధ్య సంబంధం ఉన్నది. ఒక చిన్న కీటకం మెదడులో 25 కణాలు, చీమ బుర్రలో 250, తేనెటీగ మస్తిష్కంలో 1000 జీవకణా లుంటే మన మెదడులో దాదాపుగా 10 బిలియన్ల జీవకణాలు ఉన్నాయి. మెదడులో ఉన్న కణాల సంఖ్య పెరిగిన కొద్దీ ఆ జీవికి తెలివి తేటలు ఎక్కువ ఉండే ఆస్కారం ఉంది. కానీ మన మెద డులో ఉన్న కణాలు రోజుకు 50 వేల చొప్పున చనిపోతాయి. అంటే 70 ఏళ్ల జీవితంలో 1.3 బిలియన్ కణాలు తగ్గిపోతాయి. కనుక వయస్సు పెరుగుతున్న కొద్దీ తెలి వితేటలు తగ్గాలి. అయినా పెద్ద వాళ్లను తెలివైన వాళ్లలా పరిగ ణిస్తాం, ఎందుకో తెలుసా. పుట్టిన ప్పటితో పోల్చి చూస్తే మెదడు సైజు పదోవంతు తగ్గినా 70 ఏళ్ల అనుభవం ఎక్కడికి పోతుంది?



★ మన జ్ఞానేంద్రియాలు అందించే వార్త లలో మన మెదడు ఒక శాతం మాత్రమే జీర్ణిం చుకుంటుంది. మిగిలినవి గోడ మీద నీరులా జారిపోతాయి.

★ మన తలమీద దాదాపుగా ఒక లక్షా ఇరవై వేల వెంట్రుకలు ఉంటాయి.

★ శరీరం మీద ఉన్న చర్మమంతా వలిచి తూకం వేస్తే మూడు కిలోలు ఉంటుంది. ఇందు లో ఏడాదికి కిలో చొప్పున రాలిపోతుంటే మర లా కొత్త చర్మం పుడుతూ ఉంటుంది.

★ మన పొట్ట పొడవు నిజంగా జానెడే, అంటే 10 అంగుళాలు

★ పొట్టలో జీర్ణక్రియకు ఉపయోగపడే జఠర రసాలలో ఉదజహరికామ్లం ఒకటి. దీనిని గొట్టం తో బయటకు తోడి కర్రమీద వేస్తే కర్ర కాలిపో తుంది. జఠరాగ్ని అన్న పేరు ఇందుకేనేమో.

★ మన అదృష్టం కొద్దీ మన చెవులకు అన్ని శబ్దాలు వినిపించవు. లేకపోతే గాలిలో తేలి యాడే అణువులు ఒక దానికొకటి ఢీకొన్నప్పుడు ఆ శబ్దం వింటే మనకు పిచ్చెక్కుతుంది.

★ శరీరంలోని కండరాల న్నింటిలోకి గుండె చాలా దృఢమై నది. విశ్రాంతి లేకుండా నూరేళ్ల పని చేస్తుంది. మనకు 70 ఏళ్లు నిండేసరికి మన గుండె 5 బిలియను సార్లు కొట్టుకుం టుంది.

★ మన రక్తంలోని ఎర్ర కణాలు నాలుగు నెలలు బతుకుతాయి. ఈ నాలుగు నెలల్లో అవి 1500 కిలోమీటర్ల దూరం ప్రయాణం చేస్తాయి.

★ జీవితకాలంలో మనం 40 టన్నుల ఆహారం తీసుకుంటాం. 5 లక్షల ఘన మీటర్ల గాలిని పీలుస్తాం.

★ నోటిలో పదివేల గాలన్ల లాలాజలం ఊరుతుంది.

### మెదడు వృద్ధాప్యం

అభిరుచితో చురుకుగా తీరిక లేకుండా వ్యాపకం పెట్టుకోవడమే దీర్ఘాయుష్షుకి కిటుకు.

★ మెదడులోని కొన్ని సబ్‌స్టా న్సియానిగ్రా తగ్గిపోయినప్పుడు పార్కిన్‌సన్స్ కంపన వ్యాధి పట్టు కుంటుంది. ఈ వ్యాధి పట్టిన ప్పుడు 80వ సంవత్సరానికి ఈ కణాలు ఆరు లక్షల నుండి ఒక లక్షకు తగ్గిపోతాయి.

★ సలహాలు పాటించండి: శరీర భారం తక్కువ స్థాయిలో ఉంచుకోవాలి. మెదడును ఆరోగ్యంగా ఉంచుకోవడానికి రక్తపు వత్తిడిని అదుపులో ఉంచుకోవాలి.

★ మనం తినే ఆహారం మెదడుకు కూడా చేరుతుందని తెలుసుకోవాలి. అందుచేత లోప భూయిష్టమైన, నిస్సత్తువ ఆహారం వల్ల నాడీ మండలం దెబ్బతింటుంది.

★ పార్కిన్‌సన్స్ వ్యాధికి ఆధునిక రసాయ నిక పదార్థాలు కూడా ఒక కారణమే. కాబట్టి ఈ పరిస్థితులలో సేంద్రియ పదార్థాలు తీసుకోవడం ఉత్తమం.

★ శరీర వ్యాయామం శరీరాన్ని ఆరోగ్యవం తంగా ఉంచినట్లు మనస్సును చురుకుగా ఉంచు కుంటే ఆరోగ్యంగా యౌవ్వనం నిలబడుతుంది.

– ఎ. రాంబాబు

ఇద్దరూ మాట్లాడుకుంటుండగా.. అల్లంత దూరంలో మోపెడ్‌తో ఒకతను నడిరోడ్డు మీద నిలబడి వున్నాడు. మోపెడ్ టైర్ పంక్చరయినట్లుంది.

కారు దగ్గరగా పోయి ఆగింది.

గిరిధర్ తల బయటకు పెట్టి బిగ్గరగా అరిచాడు.

"ఏమయ్యా! కొంచెం దారి వదిలి నిలబడవచ్చు కదా? "

"బండి కదలడం లేదు బాబు! స్టక్ అయినట్లుంది. కారు దిగి ఒక చెయ్యివేస్తే- పక్కకు పెట్టుకుంటా' అన్నాడతను.

మనిషి సన్నగా పొడుగ్గా వున్నాడు. ఎనిమిది మూరల తెల్లని పంచె, పొడుగు చేతుల చొక్కా ధరించి వున్నాడు. కాళ్లకు టైర్ చెప్పులు, నుదుట అడ్డంగా దిద్దిన విభూతిరేఖలు, మాట్లాడే పద్ధతి ఎంతో నాగరికంగా వుంది. అందుకే గిరిధర్ అర్థవంతంగా డ్రైవర్ వైపు చూశాడు. అది గ్రహించి డ్రైవర్ కారు దిగి - ఆ వ్యక్తికి సహాయం చేశాడు.

మోపెడ్‌ను ఇద్దరూ ఎత్తి పక్కకు జరపగానే, కారు వెళ్లడానికి దారి ఏర్పడింది.

అప్పుడు కదిలింది సందేహం.

'ఇతను మోపెడ్‌తో సహా దారికడ్డంగా వుంటే బ్రోకర్ స్వామినాథం జీప్ ఇతన్ని దాటి ఎలా ముందుకు పోయి వుంటుంది? '

దానికి సమాధానం అతని దగ్గర్నుంచే వచ్చింది.

"ఒక జీప్ నన్ను రాసుకుంటూ ఇప్పుడే పోయింది. తిరిగి కూడా చూడలేదు కానీ, మీరు కారు దిగి నాకు సహాయం చేశారు. మీకు నా కృతజ్ఞతలు"

అతను కృతజ్ఞతలు చెప్పే విధానమే - అతనిలోని సంస్కారాన్ని ఎత్తి చూపిస్తోంది.

కరుణాకర్‌కు అతనితో మాటలు కలపాలనిపించింది.

"అయ్యా! తమరిది.. ఈ వూరేనా? "

"అవును బాబూ! నేను ఈ నాగేశ్వరపురంలోనే పుట్టాను. క్రిష్ణగిరిలోని స్కూల్లో తెలుగు పండిట్‌గా పనిచేస్తున్నాను"

"ఇక్కడి నుంచి క్రిష్ణగిరి బాగా దూరమనుకుంటాను"

"దూరమే! ప్రతిరోజూ బస్‌లో అప్ అండ్ డౌన్! మెయిన్‌రోడ్ వరకు ఈ మోపెడ్‌లో పోయి, దీన్ని అక్కడ పెడతాను. దీనికి కూడా వయసు అయిపోయింది. 1996 మోడల్ మోపెడ్ ఇది"

"బైదిబై ఇపుడు ఈ మోపెడ్‌ను ఎలా తీసుకెళతారు? "

"ఏదో ఒక రెండెడ్ల బండి వస్తే- దాన్లో వేసుకుని పోవాల్సిందే!"

"మీ పేరు? "

"నా పేరు నాగేశ్వర్! అవునూ..! మీరెవరో నేను తెలుసుకోవచ్చా? "

"సంతోషంగా! నా పేరు కరుణాకర్! ఫైవ్‌స్టార్ గ్రూఫ్ ఆఫ్ కంపెనీస్ ప్రొప్రయిటర్ని. ప్రపంచ వ్యాప్తంగా చాలా దేశాలలో అనేక వ్యాపారాలు చేస్తున్నాం. ఇపుడు మా కంపెనీ పేరుతో ఈ జమీన్ మొత్తం కొని, పూలతోటలు పెంచి అన్నిచోట్లకు పూలు ఎగుమతి చేయాలని ప్లాన్"

"ఓc! ఈ జమీన్ ఎస్టేట్ అంతా కొనడానికి వచ్చినవారా మీరు? "

సూటిగా అసలు విషయం అడిగాడా తెలుగు పండిట్.

"అవును సార్! మీకీ జమిందార్ తెలుసా? " కరుణాకర్ కూడా అతని దగ్గర్నుంచి విషయాలు రాబట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించాడు.

"ఎందుకు తెలియదు? ఇపుడున్న జమిందార్ దొరై సింగం నా బాల్య స్నేహితుడు. మేం ఇద్దరం స్కూల్లో కలిసి చదువుకున్నాం"

"అవునా? సరి.. సరి.. మరి.. ఇంత మంచి ల్యాండ్‌ను ఏం చెయ్యకుండా మీ

మిత్రుడు అలా వేస్ట్‌గా వదిలేశారు?

"దీని గురించి మీకు తెలియదా? "

"ఏదో నాగుల శాపం వుందని విన్నాం. అయితే అదంతా నమ్మబుద్ధి కావడం లేదు"

"అయితే మీకు దేవుడు మీద నమ్మకం లేదా? "

"దేవుడు మీద నమ్మకానికి - దీనికి సంబంధం ఏం వుంది?

"నమ్మకం లేనివాళ్ళేకదా ఇలా మాట్లాడ తారు? "

"ఈ శాపాన్ని నమ్మనివాళ్ళు - నాస్తికు లని మీరనుకుంటే- నేను నాస్తికుడినే"

"ఎందుకైనా మంచిది, బాగా ఆలోచించి, అడుగు ముందుకెయ్యండి? "

"దేని గురించి? "

"ఈ జమీన్ ల్యాండ్ కొనడం గురించే నేను చెప్పేది? "

"ఈ ల్యాండ్ కొని నా ప్లాన్ అమలు చేస్తే- మీ వూరు జనానికి పని దొరుకు తుంది. ఈ ఏరియా అంతా బాగా డెవ లప్ అవుతుంది. ఆలోచించి చూడండి"

"సరే! నేను చెప్పాల్సింది చెప్పాను. తరు వాత మీ ఇష్టం" పెద్దగా ఒక నిట్టూర్పు వదిలి, ఆ తెలుగు పండిట్ తన అభిప్రా యాన్ని నిర్మొహమాటంగా చెప్పాడు.

ఈలోపులో దూరంగా బ్రోకర్ స్వామి నాథం జీప్ తిరిగి రావడం కనిపించింది. ఆ జీప్ సరాసరి వచ్చి, వారి ముందా గింది. అందులోంచి ఆత్రుతగా కిందకు దూకాడు బ్రోకర్ స్వామినాథం

"ఏం సార్! ఇక్కడ నిలిచిపోయారు? నేను వూరు లోపలి దాకా పోయాను. తిరిగి చూస్తే- మీరు లేరు. వెంటనే రిటర్న్ అయ్యాను"

"సారీ మిష్టర్ స్వామినాథం! మాష్టా

## చిత్రమైన పెళ్లి డాట్‌కామ్‌లు

చతుర సమాచారం

మనదేశంలో పెళ్ళిళ్ళు కుదిర్చే వెబ్‌సైట్లు ఉన్నాయి. అలాగే అమెరికాలో కూడా వివిధ వర్గాలకు వివిధ మేరేజ్ వెబ్‌సైట్లు ఉన్నాయి. వాటిలో చిత్రమైనవి కొన్ని..

★ ఫార్మర్స్ ఓన్లీడాట్‌కాం: ఈ వెబ్‌సైట్ రైతులకే ప్రత్యేకం.

అబ్రాడ్ ట్రావెల్ డాట్‌కాం: ఈ సైట్‌లో నమోదైన వారు డేటింగ్ చేయదలిస్తే అది విదే శంలో జరిగేందుకు ఇష్టపడాలి.

★ డార్విన్ డేటింగ్ డాట్‌కాం: పెంపుడు జంతువు లని అంగీకరించేవారు మాత్రమే ఈ వెబ్‌సై ట్‌లో సంబంధాన్ని చూడాలి.

క్లీన్ డేటింగ్ డాట్‌కాం: బఫూన్/ జోకర్ వృత్తిలో ఉన్నవారు ఈ సైట్‌లో నమోదవ్వాలి.

★ వెల్దీమెన్ డాట్‌కాం: డబ్బున్నవారిని భర్తలుగా పొందగోరేవారు ఈ సైట్‌లో నమో దవచ్చు. ఇందులో నమోదయ్యే మగవారి వృత్తులు, ఆదాయం, ఫొటోలని వెరిఫై చేశాకే వారిని నమోదు చేస్తారు.



★ ది అగ్లీబగ్ బాల్ డాట్‌కాం: ఇందులో కురూపులైన వారు అలాంటి జీవిత భాగస్వామి కోసం ఇందులో వెదకవచ్చు.

★ అమిష్ డేటింగ్‌డాట్‌కాం: అమెరికాలోని అమిష్ జాతి వారిలో సంబంధం కోసం ఈ వెబ్‌సైట్‌లో చూడొచ్చు. అమిష్ జాతివారు కారు, సెల్ ఫోన్ లాంటి ఆధునిక పరికరాలని వాడరు. గుర్రపు బగ్గీలనే నేటికీ వినియోగిస్తారు.

★ ఫర్రీకుట్ డాట్‌కాం: పెంపుడు జంతు వులు ఉంటే పెళ్ళికి అభ్యంతరం లేనివారు ఈ సైట్‌లో నమోదు చేసుకోవచ్చు.

రుకు సహాయం చేయడంలో కొంచెం లేట య్యింది. కంగారు పడవలసిన పనిలేదు. అయ్యా! మరి మేం వెళ్ళివస్తాం"

"మంచిది నాయనా! ఆలోచించి నడుచు కోండి"

ఆ తెలుగు పండిట్ వీడ్కోలు చెప్పాడు

కరుణాకర్‌లో నూతనోత్సాహం కనపడు తోంది. కానీ గిరిధర్‌కు మాత్రం ఏం జరు గుతుందో అనే భయం కలుగుతోంది.

బ్రోకర్ స్వామినాథం జీప్, సర్రున రిటర్న్ అయి మరలా నాగేశ్వరపురం వైపు వేగం పుంజుకుంది. తెల్లని త్రాచుపాము విడిచిన పొర రంగులో మెరుస్తున్న కరు ణాకర్ కారు, అదే వేగంతో మరలా దానిని అనుసరించింది.

వేగంగా దూసుకుపోతున్న బ్రోకర్ స్వామినాథం జీప్- సడన్ బ్రేక్‌తో, కీచు మని శబ్దం చేస్తూ ఆగింది.

అదే వేగంతో వస్తున్న కరుణాకర్ కారు కూడా సడన్‌గా ఆగాల్సి వచ్చింది. బ్రోకర్ స్వామినాథం జీప్ దిగడం కరుణాకర్, గిరి ధర్ చూశారు. వారు కూడా కారు దిగి, బ్రోకర్ స్వామినాథం దగ్గరకు వడివడిగా వెళ్ళారు.

అప్పుడు అక్కడ కనపడిన దృశ్యాన్ని చూడగానే వారి కళ్ళు ఆశ్చర్యంతో పెద్ద వయ్యాయి.

అక్కడ.. రోడ్డు మధ్యలో అడ్డుగా.. పడగెత్తి ఓ నాగుపాము నిలబడి వుంది.

చాలా పెద్దపాము. సుమారు పది, పన్నెండు అడుగుల పొడవు ఉంటుంది.

ఒకటిన్నర అడుగు వెడల్పు పడగతో సుమారు అయిదడుగుల ఎత్తు లేచి.. ఆ రోడ్డు మీద నిలబడి.. శివమెత్తిన దానిలా వూగిపోతూ వుంది.

కోపంతో దాన్ని కళ్ళు ఎర్రగా వున్నాయి. అది వారినే తీవ్రంగా చూస్తోంది. రోడ్డు పక్కనే పెద్దపుట్ట. బహుశా ఆ పుట్టలో నుంచే అది వచ్చి వుంటుంది.

"ఏమిటి సార్ ఇది? ఇలా రోడ్డుకు అడ్డంగా నిలబడితే ఏమిటి అర్థం? "

"ఒక పక్కగా మన వాహనాలు పోవడా నికి దారి సరిపోతూందేమో ట్రై చెయ్యకూ డదూ? "

"అందుకోసం కాదు సార్! అది ఎంత ధైర్యంగా చూస్తోందో చూడండి సార్! ఈ జీప్‌తో అలాగే దానిపై నుంచి పోనిస్తే.. చట్నీ అయిపోతుంది. అయినా దానికి ఆ భయమే లేదు సార్! గమనించండి!"

"అయ్యా! స్వామినాథం! మనమే ఒక పక్కనుంచి ఒదిగిపోదాం. నువ్వు పక్క నుంచి జీప్ పోతుందేమో ట్రై చేయ్!" అన్నాడు గిరిధర్ కొంచెం అసహనంగా

"అరె! ఏం సార్ మీరు? ఒక విషపురు గుకి భయపడి.. మనం పక్కకు పోవ డమా? చూడండి తమాషా..!"

గిరిధర్‌కు అతను ఏం చెయ్యబోతు న్నాడో అర్థమైపోయింది. కంగారు కంగా రుగా అతన్ని వారించబోయాడు.

కానీ, అదేది పట్టించుకొనే స్థితిలో లేడు బ్రోకర్ స్వామినాథం. ఒక్క ఊపుతో జీ ప్‌లో ఎగిరి కూర్చుని, స్టార్ట్ చేసి ముం దుకు దూకించాడు స్వామినాథం.

ముందుకు దూకిన జీప్ కన్ను మూసి తెరిచే లోపు - పన్నెండు అడుగుల ఆ నాగుపాము పైకి, వేగంగా దూసుకుపో యింది. నిలబడిన చోట నిలబడినట్లుగానే అది నేలమట్టమయింది. దాని శరీరం జీప్ టైర్ల కింద పడి నుజ్జునుజ్జయింది.

"ఇతను చేసింది నాకు నచ్చలేదు సార్! మనం పక్క నుంచి పోతే సరిపోతుంది కదా సార్!" అన్నాడు గిరిధర్ కొంచెం కష్టంగా.

"ఆ పాముకు మాత్రం ఇంత ధైర్యం వుండవచ్చా గిరిధర్? సరి.. సరి.. అయిం దేదో అయ్యింది. జీప్ పోతోంది. తొంద రగా కారు ఎక్కండి, మనం ఆ జీప్‌ను ఫాలో చెయ్యాలి కదా!" అని కరుణాకర్

చెప్పగానే, గిరిధర్ గబగబా కారెక్కి కూర్చు న్నాడు. డ్రైవర్ కారు స్టార్ట్ చేసి, జీప్ వెను కనే పోనిచ్చాడు.

దూరంగా ఏదో గ్రామం కనిపిస్తోంది. క్రమంగా ఆ గ్రామం దగ్గరపడసాగింది

"నాగేశ్వరపురం"

జీర్ణస్థితిలో వుంది నేమ్ బోర్డు. ఊరును సమీపించగానే వారికి దర్శనమిచ్చింది ఆ నేమ్ బోర్డు

ఆ బోర్డును దాటుకుని ఊర్లోకి ప్రవే శించాయి బ్రోకర్ స్వామినాథం జీప్, కరు ణాకర్ కారు.

ఊర్లోకి వచ్చిన జీప్‌ను, కారును నాగే శ్వరపురం గ్రామ ప్రజలు విడ్డూరంగా చూడసాగారు.

నాగేశ్వరపురం ఒక విధంగా కొంచెం పెద్దవూరే!

ఇళ్లన్నీ సిమెంట్‌తో కట్టివున్నాయి. వీధు లలో రోడ్లు కూడా సిమెంట్‌తో నిర్మించారు. వీధి, వీధికి పేర్లతో బోర్డు లున్నాయి.

బ్రోకర్ స్వామినాథం జీప్ 'సింగరాజా వీధి' అని పేరున్న వీధిలోనికి తిరిగింది. దాని ఎడమ వీధికి 'వేంగరాజావీధి' అని వుంది.

"ఇక్కడ వీధుల పేర్లన్నీ 'రాజా' చేర్చి ఉన్నాయే..? "

"అవన్నీ జమిందార్ కుటుంబంలోని వ్యక్తుల పేర్లయి వుండవచ్చు"

కరుణాకర్, గిరిధర్ ఒకరితో ఒకరు ఈ విధంగా మాట్లాడుకుంటుండగా..

కారు వేగం తగ్గి నెమ్మదిగా పోవడం ప్రారంభించింది.

ప్రతి ఇంటి గేటు ముందు.. ముఖ ద్వారం పైన నాగుపాము శిలలు అమర్చి వున్నాయి. కొన్ని ఇళ్ల తలుపులపై పాము చిత్రాలు చెక్కి ఉన్నాయి.

"నాగేశ్వరపురం పేరుకు తగ్గట్టుగానే.. ఎక్కడ చూసినా.. నాగుపాము బొమ్మలే కనిపిస్తున్నాయి. పాములకి, ఈ వూరికి ఏవిటో ఆ అవినాభావ సంబంధం? "

కరుణాకర్ తన మనసులోని మాటల్ని పైకే అనేశాడు

ముందు వెళుతున్న జీప్ ఎడమ పక్కకు తిరిగి, ఒక పెద్ద కాంపౌండ్‌వాల్ గేటు దాటి, లోపల ఆగింది.

కరుణాకర్ కారును కూడా దాని వెనుక ఆపాడు డ్రైవర్.

కరుణాకర్ కారులో నుంచి దిగబో యాడు. సరిగ్గా అప్పుడు తాకింది అతని చెవులకు సన్నని ఒక శబ్దం. అది కాలిప ట్టీల చిరుమువ్వల సవ్వడి. ఆ శబ్దం విన వచ్చిన దిశగా తల తిప్పి చూశాడు.

అంతే! ఆశ్చర్యంతో అతని కళ్ళు పెద్ద వయ్యాయి.

అప్పుడే దివి నుంచి భువికి దిగి వచ్చిన అప్సరసలాంటి ఒక యవ్వనవతి. తీగ లాంటి సన్నని శరీరం. పిరుదులను తాకు తున్న పొడవైన, ఒత్తయిన ఉంగరాల జుట్టు. రక్త సిందూరం రంగు చీర ధరించి ఉందామె. తెల్లని మేని ఛాయకు - ఎర్రని ఆ చీర రంగు మేళవింపు - అత్యంత మనోహరంగా కనిపిస్తోంది. కాంతిమంత మైన ముఖవర్చస్సు.

నిపుణుడైన శిల్పి - ఒక అద్భుత సౌంద ర్యరాశి విగ్రహాన్ని తయారు చేయడానికి- అత్యంత జాగ్రత్తలు తీసుకుని ఎక్కడెక్కడ ఏయే కొలతలతో తీర్చిదిద్దుతాడో అంత చక్కగా చెక్కిన అపురూప శిల్పంలా ఉందామె.

కరుణాకర్ ఎంతో మంది అమ్మాయిల్ని చూసి వున్నాడు.

కానీ, ఆకాశంలో ఉద్భవించే మెరుపునకు పుట్టినట్లు మిరుమిట్లు గొలిపే ఇలాంటి మనోహరిని చూడడం ఇదే మొదటిసారి.

అతని మనసు పొరల్లో పెద్ద అలజడి.. ఒక విచిత్ర స్పందన.

ఆ అందాల భరిణె చేతిలో ఒక పూల

సజ్జ, అందులో భగవంతునికి నైవేద్యం సమర్పించిన పిదప తెస్తున్న కొబ్బరి చిప్పలు, పండ్లు, పువ్వులు వంటివి వున్నాయి. బహుశా అప్పుడే ఆమె గుడి నుంచి తిరిగి వస్తోందేమో!

కారు దిగుతున్న కరణాకర్‌ను ఆమె క్రీగంట చూసింది. అనేక భావాలు ఆమె మోములో ఒక్కసారిగా పొడసూపాయి. అటు తరువాత దించిన తల ఎత్తకుండా నెమ్మదిగా నడచుకుంటూ సింహద్వారం దాటుకుని భవనం లోపలికి వెళ్లిపోయింది.

కరుణాకర్ ఆమెను చూస్తూ కదల కుండా నిలబడ్డాడు. అంతలో గిరిధర్, బ్రోకర్ స్వామినాథం అతనిని సమీపించారు.

"సార్! ఆమె జమిందార్ మొదటి కూతురు, పేరు పూర్ణిమాదేవి" చెప్పాడు బ్రోకర్ స్వామినాథం.

"జమిందార్ మొదటి కూతురా? "

"అవును సార్! వయస్సు ఇర్వై ఆరు దాకా ఉంటుంది. ఇంకా పెళ్లికాలేదు. ఇప్పుడిప్పుడే ప్రయత్నాలు చేస్తున్నారు"

"ఓహో! అలాగా..!" సాభిప్రాయంగా తలవూపాడు కరుణాకర్.

"రండి! లోపలికి..! ఇదే నాగేశ్వరపురం జమీన్ బంగ్లా! ఈ బంగ్లా చుట్టూ వున్న కాంపౌండ్ చూడండి! ఓ పెద్ద కోట చుట్టూ నిర్మించిన కాంపౌండ్ వాల్ మాదిరిగా లేదూ..!" బ్రోకర్ స్వామినాథం ఒక్కొక్కదాన్ని వర్ణించి చెబుతూ వారిని భవనం దగ్గరికి తీసుకుపోసాగాడు.

కాంపౌండ్ వాల్ దాటగానే గేటు దగ్గర్నుంచి భవనం సింహద్వారం వరకు సిమెంట్‌తో వేసిన బాట, ఆ బాట కిరుపక్కల కన్నుల పండువగా పెంచిన అందమైన క్రోటన్ మొక్కలు. సుమారు నూరు అడుగుల పొడవు ఉంది ఆ బాట.

ఆ సిమెంటు దారి చివర అందంగా కనిపిస్తోంది బ్రహ్మాండమైన ఆ జమీన్ బంగ్లా.

ఆ బంగ్లా ముంగిట విశాలమైన పోర్టికోలో అయిదు తలల నాగుపాము పడగ విప్పి నాట్యం చేస్తున్న భంగిమతో ఒక అద్భుత శిల్పం. ఆ బంగ్లా ముఖద్వారం పైన కూడా నాగుపాము ప్రతిమ అమర్చి వుంది. ఆ నాగప్రతిమపైన కొన్ని అడుగుల ఎత్తులో ఉన్న బాల్కనీలో జమిందారు దొరైసింగం నిలబడి వున్నారు.. రాజసం ఉట్టిపడే ఆ ఆజానుబాహువు.

"ఆయనే నాగేశ్వరపురం జమిందారు దొరై సింగం" అని చెప్పి ఇక్కడ్నుంచే అభివాదం చేశాడు బ్రోకర్ స్వామినాథం.

అటు తరువాత కరుణాకర్, గిరిధర్‌లతో సహా బంగ్లా లోపలికి ప్రవేశించిడానికి మెట్లు ఎక్కారు.

ఆ మెట్ల కిరుపక్కల కట్టి వున్న అంచులు కొండచిలువ ఆకారంలో నిర్మించారు. రెండు పాములు సేదతీరుతూ నిద్రపోతున్నట్లుగా వున్నాయి. పొరపాటున చెయ్యి వేస్తే ఆ పాముల మీద చెయ్యి వేసిన ఫీలింగ్ కలుగుతుంది. అంత చక్కని, సహజమైన శిల్పకళ కనిపిస్తోంది.

లోపలికి ప్రవేశించగానే విశాలమైన పెద్ద హాలు. హాలు మధ్య అందమైన సోఫా. ముగ్గురూ ఆ సోఫాలో ఆశీనులయ్యారు.

వీరు లోపలికి రావడం చూసి, జమిం

కొత్తగాలి...

**సానియా మీర్జా**
**సైనా నెహ్వాల్**
**హైదరాబాద్**
**ఆణిముత్యాలు!**

– కన్నేపల్లి నారాయణమూర్తి,
జీడిమెట్ల, హైదరాబాద్

దార్ దొరై సింగం బాల్కనీ దిగి వచ్చారు. జమిందారును చూడగానే ముగ్గురూ మర్యాద పూర్వకంగా లేచి నిలబడ్డారు. దొరైసింగం కూర్చోండని చేత్తో సైగ చేస్తూ.. ఎదురుగా ఉన్న ఆసనంలో కూర్చున్నాడు.

ఆయన ముఖం కొంత నిరుత్సాహంగా ఉంది. కళ్ల వెనుక విచారం దాగి ఉంది. సూక్ష్మగ్రాహి అయిన కరుణాకర్ దృష్టిని అది దాటిపోలేదు.

"నమస్కారం సార్! ఈయనే కరుణాకర్, ఫైవ్‌స్టార్ ఎంటర్‌ప్రైజెస్ ప్రొప్రయిటర్. మన ల్యాండ్ కొని, దాంట్లో పూలతోటలు వేయాలనుకుంటున్నది ఈయనే" అని బ్రోకర్ స్వామినాథం పరిచయం చేస్తూనే, సూటిగా అసలు విషయానికి వచ్చేశాడు.

దొరైసింగం కరుణాకర్ వైపు సాభిప్రాయంగా చూశారు. అటు తరువాత కూడా వున్న గిరిధర్ వైపు దృష్టి సారించారు. అదే సమయంలో...

మరల అదే.. కాలి మంజీరాల చిరుమువ్వల శబ్దం. జమిందారు కుమార్తె పూర్ణిమాదేవి, మేడ మెట్లు దిగి, కింద అంతస్తులోని గదిలోనికి వెళుతోంది.

ఒక్కక్షణం అందరూ తమ దృష్టి అటు వైపు తిప్పారు.

జమిందారు దొరై సింగం తల పంకించి- తన కూతురు వైపు తిరిగి..

"అమ్మా! కొంచెం ఇటురా తల్లీ!" అని దగ్గరికి రమ్మని సంజ్ఞ చేశాడు.

ఇంద్రలోకంలో వున్న పారిజాతపుష్పం స్త్రీరూపంలో నడిచి వచ్చినట్లుగా అనిపించింది అపరిచితులైన ఆ ముగ్గురికి.

పద్మినీజాతి స్త్రీల మేను, కాంతితో పాటు ఒక రకమైన సువాసనను కూడా వెదజల్లుతుందంటారు. ఆ హాలంతా గమ్మత్తయిన పరిమళం అలముకుంది ఆమె రాగానే.

"ఈమె నా కూతురు, పేరు పూర్ణిమాదేవి" అని కరుణాకర్‌కు పరిచయం చేశారు.

కరుణాకర్ నవీనపద్ధతిలో "హాయ్!" అన్నాడు.

పూర్ణిమాదేవి మాత్రం వినయంగా ముగ్గురికీ నమస్కరించింది.

"సరే తల్లీ! లోపలికి వెళ్లి నీ పని చూసుకో!" అని చెప్పారు జమిందారు.

పూర్ణిమాదేవి అర్థవంతంగా తలవూపి లోపలికి వెళ్లిపోయింది.

బ్రోకర్ స్వామినాథం వచ్చిన విషయాన్ని వదలకుండా తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

"అయ్యా! వచ్చే దారిలో మన భూములన్నీ ఈయనకు చూపించాను. అలాగే మన జమీన్ గురించి అందరూ ఏం చెప్పుకుంటున్నారో కూడా వివరిచాను. రేపు ఎవ్వరూ ఈ ల్యాండ్ గురించి నిజాలు దాచిపెట్టి అమ్మారని చెప్పకూడదు కదా!"

"స్వామినాథం ఈవిధంగా నువ్వు చాలా సార్లు చాలామందిని పిలుచుకొని వచ్చి చెబుతూనే వున్నావు. కానీ కార్యం మాత్రం పూర్తి చేయలేకపోతున్నావు. సరి అవన్నీ వదిలి తిన్నగా విషయానికి రా!"

"అది కాదండయ్యా! ఈసారి తప్పకుండా పని సజావుగా పూర్తయిపోతుంది. కరుణాకర్‌గారు మంచి అభ్యుదయ భావాలు గల మనిషి. ఈ శాపాలు గీపాలు పట్ల పూర్తిగా నమ్మకం లేనివారు. ఆ విషయం వారే స్వయంగా సెలవిచ్చారు కూడా! కరుణాకర్‌గారూ! మీరే చెప్పండి"

"అవునండి! నేను ఆ శాపాలకు సంబంధించిన కట్టుకథల్ని నమ్మను. అసమర్థులు శాపం.. కోపం అంటూ మాట్లాడి వాటినే నిజమని నమ్ముతారు. బైదిబై మిస్టర్ స్వామినాథం-! నేను జమీన్ కొనడానికి తయారుగా వున్నాని చెతున్నాడు. ఆయన చెప్పడం మర్చిపోయిన రెండు విషయాలు నేను ఇప్పుడు మీ దగ్గర ప్రస్తావించాలని

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, పెద్దకథ, నవలావలోకనం ఇంకా ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? అయితే ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ జూన్ 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపికకాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532 e-mail: vipula.chatura@gmail.com

అనుకుంటున్నాను"

"ఏమిటి నాయనా అది! సందేహించకుండా మీ మనస్సులోని మాటను బయటపెట్టండి. ఫర్వాలేదు!" అన్నారాయన.

"వచ్చేదారిలో మీ జమీన్ చూసేటప్పుడు నేను ఒక విషయం గమనించాను. మన ల్యాండ్‌ను చాలామంది ఆక్రమించుకొని ఉన్నారు. ఏకంగా నివాసాలు ఏర్పరచుకున్నారు. మరి వారందర్నీ- ఆ ల్యాండ్ మాకు హ్యాండోవర్ చేయడానికి ముందు ఖాళీ చేయించి ఇవ్వాల్సిన బాధ్యత మీదే కదా! ఇక రెండో విషయం ఇప్పుడు మీరు చెపుతున్న రేటులో పదిహేను శాతం తగ్గించి అమ్మితే నేను కొనడానికి సిద్ధంగా వున్నాను" కరుణాకర్ కట్ అండ్ రైట్‌గా - అసలు విషయం సూటిగా వదిలాడు.

జమిందారు దొరై సింగం ఆలోచనలో పడ్డారు.

బ్రోకర్ స్వామినాథం ఆయన మొహంలోకే దీక్షగా చూస్తున్నాడు. అతనికి మాత్రం విషయం ఎంత తొందరగా అయితే అంత తొందరగా ముగించేద్దామని వుంది.

జమిందారు ఈ ప్రపోజల్‌కి సమ్మతించాడంటే దగ్గర దగ్గర నాలుగు కిలోమీటర్ల జమీన్‌భూమి ఒకే చేతికి మారుతుంది. ఒకే ఒక్క బేరం ద్వారా పెద్దమొత్తం తన చేతికి అందుతుంది. 'ఓస్వామీ! జమిందారు దొరై సింగం ఎలాగైనా ఒప్పుకునేలా చూడు! ఈ బిజినెస్ విజయవంతంగా పూర్తవ్వాలి స్వామీ!' అని స్వామినాథం మనసులోనే అనేక విధాల ప్రార్థనలు చేయడం ప్రారంభించాడు.

ఆలోచిస్తున్న జమిందారు దొరై సింగం - ఒక నిర్ణయానికి వచ్చిన వాడిలా తల పైకెత్తి "ఓకే! మిష్టర్ కరుణాకర్! మీ కోరికల్ని నేను అంగీకరిస్తున్నాను. ఆ ఆక్రమణల గురించి మీరు కంగారు పడవలసిన పనిలేదు. వారంతా మన పొలాల్లో కూలి

అక్షరం

విజయానికి కావల్సింది
పది శాతం ప్రేరణ
తొంభై శాతం కఠోర శ్రమ

– థామస్ అల్వా ఎడిసన్



పనులు చేసే జనం. ఖాళీ చేయండని చెప్పగానే తక్షణం ఖాళీ చేసేస్తారు. రేపు మీ వ్యవసాయ పనులు చూడడానికి మనుషులు కావాలంటే కూడా వాళ్లంతా బాగా ఉపయోగపడతారు. నాదొక కండిషన్! అది చెప్పమంటారా? " అన్నారాయన.

మనుసులోనే సంతోషంగా గంతులేస్తున్న బ్రోకర్ స్వామినాథం అది వినగానే గతుక్కుమన్నాడు. ఆయన ఏం చెప్పబోతాడో అని బితుకు బితుకుమన్నది మరొక్కసారి అతని మనసు.

"ఈ భూములకు సంబంధించిన ఎమౌంట్ ఎంతవుతుందో ఆ మొత్తం సింగిల్ సెటిల్‌మెంట్‌గా మీరు ఇచ్చేయాలి. అంతేకాదు, ఈ అమ్మకం వ్యవహారమంతా పదేపది రోజుల్లో ముగించేయాలి. ఎందుకంటే నేను, మా అమ్మాయి పూర్ణిమాదేవితో సహా అర్జెంటుగా సింగపూర్ వెళ్లవలసిన పని వుంది. ఈ జమీన్ భూములన్నీ మీరొక్కరే తీసుకుంటున్నారు కాబట్టి మీరడిగిన పదిహేను పర్సెంట్ కూడా తగ్గించి ఇస్తాను. ఇంకా ఈ బంగ్లా ఒకటి వుంటుంది. దీన్ని త్వరగా అమ్మేయాలి. ఈ వూరిలో ఇంతవరకు బతికింది చాలనుకుంటాను" ఓ రకమైన విరక్తిగా అన్నారు జమిందార్ దొరై సింగం.

"అయితే మీరు ఈ బంగ్లాను కూడా అమ్మకానికి పెట్టదలుచుకున్నారా? " సాలోచనగా అడిగాడు కరుణాకర్.

"అవును! ఇంత పెద్ద బంగ్లా ఇక మీదట మాకెందుకు? మా అధికారం ఉన్నంతవరకు- నాలుగు పక్కలా నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్నమా పొలాలన్నీ సస్యశ్యామలంగా వుండేవి. ఎంతోమందికి జీవనోపాధి ఈ జమీన్. ఈ ఊరు మొత్తం మా అధీనంలోనే- ఎంతో ముందుండేది. కానీ, ఇపుడు అధికారం పోయింది. దాంతో అన్నీ పోయాయి. మా అమ్మాయి పెళ్లి చేసేస్తే మిగిలిన ఆ బాధ్యత కూడా తీరిపోతుంది. ఈ జమీన్ అమ్మగా వచ్చిన డబ్బుతోనే కదా నేను అమ్మాయి పెళ్లి చేయాల్సివుంది. ప్రస్తుతం సింగపూర్‌లో వున్న మా బిజినెస్ అంతంత మాత్రంగానే వుంది. దాన్ని కూడా ఒకదారికి తీసుకురావాల్సిన పనివుంది" జమిందారు దొరై సింగం తన మనసు విప్పి మాట్లాడసాగారు.

"అయ్యా! జమిందారుగారూ! మీరేమీ అనుకోనంటే- సింగపూర్‌లో మీరు చేస్తున్న బిజినెస్ ఏమిటో తెలుసుకోవచ్చా? " మృదువుగా అడిగాడు కరుణాకర్.

"సంతోషంగా తెలుసుకోవచ్చు! చెరకు పిప్పి నుంచి పేపరు తయారుచేసే ఫ్యాక్టరీ నడుపుతున్నాను. ఆ ఫ్యాక్టరీ ఒక మలేషియన్ దగ్గర కొని మెయిన్‌టైన్ చేస్తున్నాను. కానీ, దానిని లాభాల దిశగా నడపడం నావల్ల కాలేదు. అందువల్ల నాకక్కడ నష్టాలు వచ్చి పెద్ద మొత్తం అప్పు పడ్డాను" జమిందారు దొరై సింగం గట్టిగా గాలి పీల్చి, ఇంకా ఏదో చెప్పబోతున్నారు.

సరిగ్గా అదే సమయంలో-

అకస్మాత్తుగా ఎక్కడ్నుంచో ఢమరుకం ధ్వని భయంకరంగా వినిపించడం ప్రారంభించింది.

అది విన్న మరుక్షణం జమిందారు

ముఖంలో రంగులు మారిపోయాయి.

వెంటనే-

"భీమన్నా!" అని గట్టిగా పిలిచాడు జమిందార్ దొరై సింగం.

పిలవడం పూర్తవడానికి ముందే జమిం దార్ ఎదుట ప్రత్యక్షమయ్యాడు దృఢకా యుడొకడు, పరుగు పరుగున వచ్చి

"పూర్ణిమాదేవిని ఏ కారణం చేత కూడా ఇక్కడకు రాకుండా చూసుకో! ఏమైనా అవ సరం వచ్చి పిలిచినపుడు నువ్వు మాత్రమే వచ్చి- అవన్నీ సమకూర్చాలి! జాగ్రత్త!" చక చకా సూచనలు జారీచేశాడు జమిందారు దొరై సింగం.

"సరే దొరా!" అంటూ లోపలికి పరుగు పెట్టాడు భీమన్న.

వెనువెంటనే కరుణాకర్ వైపు తిరిగారు జమిందార్. "మిష్టర్ కరుణాకర్! మా కులదైవానికి సంబంధించిన గుడి పూజారి వస్తున్నాడు. మీరు బయలుదేరండి! రేప టికే రిజిస్ట్రేషన్ పెట్టుకుందాం. ఈ భూములకు సంబంధించిన దస్తావేజుల నకళ్ళు, ఈసీ మొదలైనవన్నీ మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాయి. వాటినన్నిటినీ కావాలంటే ఎవరి దగ్గరైనా చూపించి వెరిఫై చేసుకోవచ్చు. చట్టపరమైన ఆక్షేప ణలు కొంచెం కూడా లేవు. ఇక ల్యాండ్ అంటారా..! ఇరవై నాలుగు కేరెట్ల మేలిమి బంగారం. దాంట్లో ఏ విధమైన సందే హాలు మీరు పెట్టుకోవల్సిన పని లేదు" అంటూ గబాగబా మాట్లాడడం పూర్తి చేసే లోపలే..

ఢమరుకం ధ్వని, ఈసారి బంగ్లా ముఖ ద్వారం దగ్గరికి వచ్చినట్లుగా వినిపించసా గింది.

"స్వామినాథం! ఇక మీరు బయలుదేర వచ్చు" మరొక్కసారి జమిందారు వాళ్ళను తొందరపెట్టారు.

బ్రోకర్ స్వామినాథం "సరేనండయ్యా!" అంటూ కరుణాకర్‌తో కలిసి బయలుదేర డానికి పైకి లేచాడు.

ఇదంతా గమనిస్తూ నిలబడి వున్న గిరి ధర్‌కు జరుగుతున్నదంతా ఏదో ఒక పజిల్ మాదిరిగా అనిపించింది. అతను అనుకున్నదానికంటే ఇది మరింత భయంకరమైన పజిల్‌గా మారబోతుం దని- అతని ఊహకు అందలేదు.




**క**రుణాకర్, గిరిధర్ బయటికి రావడా నికి బ్రహ్మాండమైన ఆ జమీన్ బంగ్లా సింహద్వారాన్ని సమీపించారు. వారితో పాటు బ్రోకర్ స్వామినాథం హడావుడిగా అడుగులు వేస్తూ వెంబడించాడు.

సరిగ్గా అదే సమయంలో-

భయంకరంగా ఢమరుకం మోగిస్తూ ఆ పూజారి సింహద్వారం దాటి ఆ జమిం దారు బంగ్లాలోకి అడుగుపెట్టాడు.

గుబురుగా పెరిగిన గెడ్డం మీసాలతో, ముఖమంతా విభూతి పూసుకుని ఎర్రని కళ్ళతో చూపరులకి భయం గొల్పేలా వున్నాడు.

అతనికిరుపక్కల ఇద్దరు అనుచరులు. వారి చేతులలో అగ్నిజ్వాలలు వెలువరి స్తున్న మట్టి మూకుళ్ళు. వారంతా పసుపు పూసిన పంచెలు మొలలకు కట్టుకుని అర్ధ నగ్నంగా వున్నారు. మెడల నిండా రుద్రా క్షమాలలు.

ఆ పూజారి ఒక్కక్షణం కరుణాకర్, గిరి ధర్‌లను చూశాడు. అటు తరువాత తన

దృష్టిని బ్రోకర్ స్వామినాథం వైపు మర ల్చాడు.

అతన్ని చూసిన మరుక్షణం..

ఒళ్ళంతా పూనకం వచ్చినవాడిలా పూజారి వూగడం ప్రారంభించాడు. కళ్ళు పెద్దవయ్యాయి.

"ఏయ్..!" అంటూ పెద్ద అరుపు, అరి చాడు పూజారి.

అంతే!

బ్రోకర్ స్వామినాథం నవనాడులూ స్తంభించిపోయాయి. కాళ్ళ దగ్గర్నుంచి ప్రారంభమయ్యింది వణుకు.

"..పాపి! ..పాపి! ..మహాపాపి..!" మరొక్కసారి భయంకరంగా అరిచాడు పూజారి. ఆ అరుపుకి జమిందారు భవనం దద్దరిల్లిపోయింది. లోపల్నుంచి జమిం దారు దొరై సింగం పరుగు పరుగున అక్కడకు వచ్చాడు.

"ఏరా! మహాపాపి! నీ దారి కడ్డు వచ్చిం దని ఒక పుణ్యజీవిని నలిపి పారేస్తా వురా? " అదే స్వరంతో పూజారి- బ్రోకర్ స్వామినాథాన్ని అడిగాడు కోపంగా.

బ్రోకర్ స్వామినాథానికి ఏమీ అర్థం కాలేదు.

మరొక్కసారి రెట్టించిన స్వరంతో "ఏరా! అర్థం కాలేదా? సర్పం నీకు దారి వదలక పోతే- దాన్ని దారుణంగా చంపేయ డమేనా? " అని ప్రశ్నించాడు.

కరుణాకర్‌కు వెంటనే అర్థమైపోయింది. గిరిధర్‌కు గొంతు తడారిపోయింది. బ్రోకర్ స్వామినాథానికి నిలువునా ప్రాణాలు పోయాయి.

"ఇంతటి మహాపాపం చేసిన నువ్వు- ప్రాణాలతో ఈ వూరు దాటి పోలేవురా మూర్ఖా! నువ్వు చంపింది మామూలు పాము కాదురా! దేవతా సర్పం. మగ పాము. అందుకు నిన్ను బలి తీసుకోవడా నికి.. నీపై పగ సాధించడానికి పయమన మయ్యిందిరా ఆడపాము. నువ్వు తప్పిం చుకోలేవురా! తప్పించుకోవడం నీకు సాధ్యం కాదు!" అన్నాడు పూజారి ఆవే శంగా వూగిపోతూ.

ఆవేశంగా మాట్లాడినందువల్లనో ఏమో పూజారి ఉన్నచోటునే మైకం వచ్చి కుప్ప కూలిపోయాడు.

జమిందారు ముఖంలో కలవరం.

"ఏమయ్యా! స్వామినాథం! ఏదైనా పామునుగానీ- మీరు వచ్చేదారిలో.." ఆందోళనగా అడిగారాయన.

"అవునండయ్యా! నడిరోడ్డులో ఒక పాము మాకు దారి వదలకుండా పడగ ఎత్తి నిలబడి వుండింది. పక్కకు తప్పుకుం టుందేమోనని చాలాసేపు చూశాం. తప్పు కోలేదు. ఏం చెయ్యను? వెంటనే నేను జీప్ స్టార్ట్‌చేసి- దాని మీదుగా పోనిచ్చాను. ఆ దెబ్బకు అది చచ్చి వూరుకుంది" కాళ్ళ దగ్గర ప్రారంభమయిన వణుకు- ఇప్పుడు అతని గొంతు దాకా వచ్చిందని స్పష్టంగా తెలుస్తోంది.

అది విన్న జమీందారు ముఖం పాలిపో యింది. అతని ఆందోళన కాస్తా విచా రంగా మారింది. అది అతని కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది.

రోడ్డుమీద జరిగిన విషయం గురించి పూజారి చెప్పగానే కరుణాకర్‌కు ఆశ్చర్యం కలిగింది.

"గిరిధర్! ఇక్కడ జరుగుతున్నదంతా ఆశ్చర్యంగా లేదూ! ఎక్కడో జరిగిన సంఘ టన గురించి పూజారి అంత కరెక్టుగా ఎలా చెప్పగలుగుతున్నాడు? " నెమ్మదిగా చెవిలో గుసగుసలాడాడు కరుణాకర్.

ఈలోపల తేరుకున్న జమిందారు దొరై సింగం "సరే, మిష్టర్ కరుణాకర్! ఇక మీరు బయలుదేరండి!" అన్నారు.

"అయితే మరి సెలవు! నేను అన్నిఏ ర్పాట్లు పూర్తిచేసి, మీకు ఫోన్ చేస్తాను జమిందారుగారూ!"

"చెయ్యండి! చెయ్యండి!" అని పక్కకు

చమత్కారం

# నక్షత్రమహాత్మ్యం

నక్షత్రము పేరిటి సతి
నక్షత్రము చేతబూని నాథుడు గదియన్
నక్షత్రానికి రమ్మని
నక్షత్రము పట్టిలాగె నారీమణియున్

ఏంట్రా ఇన్నిసార్లు నక్షత్రం.. నక్షత్రం అంటారు? ఏంటీ పద్యం అనుకుంటున్నారా? నక్షత్రంలోనే ఉంది అసలు గమ్మత్తు!

మనకు అశ్విని, భరణి అంటూ 27 నక్షత్రాలు ఉన్నాయి కదా! వాటితో చమత్కారం చేశాడీకవి.

తొలి పంక్తిలో నక్షత్రము పేరిటి సతి అంటే 'స్వాతి' అనే ఓ నక్షత్ర నామధేయురాలు ఉందట.

ఆవిడ దగ్గరకు ప్రియుడు ఓ నక్షత్రం చేతబూని వచ్చాడట. ఈ నక్షత్రం స్వాతి కాదు.. ఉత్తర.. అంటే ఉత్తరం. ప్రేమలేఖ కావచ్చు. అయితే అంతా చూస్తారనేది ఆమె భయం! చూస్తే గేలిచేస్తారని బిడియం. అందుకే ఓ మూల(చాటు)కు పదవయ్యా మగడా (మూల కూడా నక్షత్రమే అని మర్చిపోకండి. మూడో పాదంలో నక్షత్రం అదన్నమాట) అని అంతటితో ఊరుకోలేదు. అతని హస్తం పట్టుకుని బరబరా లాక్కెళ్లింది. నాలుగో పంక్తిలోని 'హస్త' కూడా నక్షత్రమే కదా! ఇదీ ఇందులో చమత్కారం. ఎవరో ప్రాచీన కవి చెప్పిన చాటుపద్యమిది.

స్థూలంగా చెప్పాలంటే.. స్వాతికి ప్రేమలేఖ ఇవ్వడానికి ప్రియుడు వస్తే అంతా చూస్తారని అతని చేతిని పట్టుకుని ఓ మూలకు లాక్కెళ్లిందామె అనేది దీని భావం.

సేకరణ: చంద్రప్రతాప్



తిరిగి బ్రోకర్ స్వామినాథం వైపు చెయ్యి చాపి చూపిస్తూ, "నువ్వు మాత్రం వెళ్ళ వద్దు మిష్టర్ స్వామినాథం! ఇక్కడే వుండు" అన్నారాయన.

బ్రోకర్ స్వామినాథం ఉలిక్కిపడ్డాడు. ఆ మాట అతనికి ముల్లు గుచ్చుకున్నట్లుంది.

"అయ్యా! నేను వెళ్ళాలండయ్యా! నాకు వూర్లో ఇంకా చాలా పన్లున్నాయి" అన్నాడు బ్రోకర్ స్వామినాథం నసుగుతూ.

"నీకు ఎన్ని ముఖ్యమైన పనులున్నాసరే! నువ్వు పోవద్దు! ఈ ఇంట్లో ఉన్నంతవరకే నీకు రక్షణ. ఈ ఇల్లు దాటావా.. నిన్నె వరూ కాపాడలేరు. నేను బయటకు వెళ్ళి నపుడు మాత్రమే నువ్వు నా కూడా రావచ్చు. కానీ.. అప్పుడు కూడా నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలి సుమా!"

జమిందార్ దొరై సింగం ఈ విధంగా చెబుతుండగా పూజారి నెమ్మదిగా మైకం నుంచి తేరుకుని లేచి నిలబడ్డాడు.

లేచిన వెంటనే జమిందారును చూశాడు. చేతులు రెండూ జోడించి, అతి వినయంగా "యజమాన్!" అంటూ నమ స్కరించి ఒక పక్కగా ఒదిగి నిలబడ్డాడు.

ఇంతకుముందు ఎంతో రౌద్రంగా, ఆవే శంగా వీరంగం ఆడిన పూజారి.. ఇపుడు వినయంగా చేతులు కట్టుకుని నిలబడి వున్న ఇతను ఒకరేనా అన్న ఆశ్చర్యం కలుగక మానదు.

"ఏమిటి ఈనాడు వచ్చీరాగానే పూన కమా పూజారీ?" గంభీరంగా అడిగారు దొరై సింగం.

"నేనేమి చేసేది సామీ? ఆ సమ యంలో నేను ఎలా ఉంటున్నానో నాకే తెలియదు. ఇపుడు కూడా నేను ఏమేమి మాట్లాడేనో గుర్తులేదు"

"సరి! లోపలికి వెళ్ళి, పాలూ, పళ్ళూ తీసుకోండి. ఇదిగో! నేను ఇపుడే వస్తాను" అని దొరై సింగం- అటు తరు వాత బ్రోకర్ స్వామినాథం వైపు తిరిగి "నువ్వు కూడా లోపలికి పోవయ్యా! మా భీమన్న మీకు బస ఏర్పాట్లు అవీ చూస్తాడు" అన్నాడు.

"అయ్యా! నాకు.. నాకు.. ఏదైనా అవు తుందేమోనని భయపడుతున్నారా?" మెల్లగా అడిగాడు బ్రోకర్ స్వామినాథం.

"అవును స్వామినాథం! ఇపుడు పూజారి చెప్పిందంతా విన్నావుగా?"

"ఏమిటండయ్యా మీరు? మీకు సంబం ధించిన శాపాల కథనే నేను నమ్మలేదు. ఇంక ఈ పూజారి చెప్పిందంతా నమ్ము తానా ఏంటి?"

"ఇదిగో స్వామినాథం! దయచేసి నేను చెప్పేది విను"

"అరె జమిందారుగారూ! నాకేమీ కాదం డయ్యా! నేను పోయి రిజిష్టర్ ఆఫీసులో దస్తావేజులు రెడీ చేయించాలి. వాటికి సంబంధించిన రాతకోతలు పూర్తిచెయ్యాలి కదా సార్! అదంతా ఆగిపోతుంది నే వెళ్ళకపోతే.."

"అవును జమీందారుగారూ! అతన్ని రానివ్వండి. లాండ్ సర్వే నంబరు దగ్గ ర్నుంచి మొత్తం అన్ని విషయాలు అతనికి తెలుసు. కాబట్టి స్వామినాథం వస్తేనే పని సజావుగా జరుగుతుంది" కల్పించుకు న్నాడు కరుణాకర్.

"అదికాదు మిష్టర్ కరుణాకర్! నేను ఏం చెబుతున్నానంటే.."

"అర్థమయ్యింది సార్! మీరు ఈ పూజారి చెప్పిన మాటలు నమ్మి భయప డుతున్నారు. నన్ను చెప్పనీయండి! మగ పాము చస్తే.. ఆడపాము పగబట్టి బలి తీసుకోవడం.. సినిమాలలోనే ఉంటుంది సార్! నిజంగా జరగదు"

"లేదు మిష్టర్ కరుణాకర్! మీకు ఈ వూరి గురించి సరిగ్గా తెలియదు. మీలాగే ఆలోచించేవాళ్ళలో నేను కూడా ఒక్కడ్ని. అసలు నేను ఈవూరి నుంచి సింగపూర్‌కి కుటుంబంతో సహా మకాం మార్చడానికి

# 'నైన్‌లెవెన్ కాల్స్' వింతలు!

చతుర సమగతులు

అమెరికాలో పోలీసులకు ఫిర్యాదు చేయడానికి 911 ఫోన్ నెంబర్ అమెరికన్ ప్రజలు వాడుతుంటారు. కానీ వివిధ విచిత్ర కారణాల కోసం 911కి అనేక మంది ఫిర్యాదు చేశారు. ఆ వివరాలు..



★ డాలస్‌లోని ఫోర్ట్‌వర్త్‌లోని ఓ రెస్టారెంట్‌లోంచి 911కి ఫోన్ చేసి తను తినే ఫ్రైడ్‌రైస్‌లో ష్రింప్‌లు(చేపలు) తక్కువగా వేశారని ఒకావిడ కోపంగా ఫిర్యాదు చేసింది.

★ జానీ అనే ఎనిమిదేళ్ళ పిల్లవాడు లెక్కల హోంవర్క్‌లో సహాయం కోసం 911కి ఫోన్ చేసాడు. ఆశ్చర్యంగా ఫోన్‌కాల్ రిసీవ్ చేసుకున్న వ్యక్తి సహాయం చేశాడు కూడా.

★ అమెరికన్‌ని పెళ్ళి చేసుకున్న ఓ జర్మన్ తన 46 ఏళ్ల భర్త టి.వి.లో పోర్నోగ్రాఫీ సినిమాని చూస్తున్నాడని, వచ్చి ఆయన్ని అరెస్ట్ చేయమని 911కి ఫోన్ చేసి కోరింది.

★ ఫ్లోరిడాకి చెందిన గుడ్‌మెన్(25) అనే మహిళ 911కి ఫోన్ చేసి "నేనున్న మెక్‌డొనాల్డ్స్ రెస్టారెంట్‌లో మెక్ నగ్గెల్స్ లేవు. బదులుగా మేక్ డబుల్ ఇస్తాం అంటున్నారు. నాకది అవసరం లేదు" అని ఫిర్యాదు చేసింది.

★ జాన్ ట్రిప్లెట్(45) అనే నిరుద్యోగి ఒంటరితనాన్ని భరించలేక మొత్తం 27 వేల సార్లు 911కి కాలక్షేపం కోసం ఫోన్ చేశాడు. ఎమర్జెన్సీ లైన్‌ని దుర్వినియోగం చేసినందుకు అయనికి 1000 డాలర్లు జరిమానా విధించారు.

★ ఫ్లోరిడాలోని కిస్సిమీలోని వాల్‌గ్రీన్స్ అనే స్టోర్ బయట నించి ఒకామె 911కి ఫోన్ చేసి, ఎలక్ట్రిసిటీకి సంబంధించిన ఏదీ పనిచేయక కారులో నుంచి బయటికి రాలేకపోతున్నానని చెప్తే పోలీసులు వచ్చి సహాయం చేశారు.

★ ఆరెగాన్ అలోహనించి తార్నా అనే ఆమె అందమైన పోలీస్ ఆఫీసర్‌ని తనతో డేటింగ్‌కి పంపమని 911కి ఫోన్ చేసి కోరింది!

కారణం ఏమిటో తెలుసా? ఈ వూర్లో జరిగిన కొన్ని విషయాలు. వాటిని చూస్తే అవి.. అవి లాజిక్కుకు ఏమాత్రం అందడంలేదు. వాటినన్నింటిని నేను స్వయంగా చూశాను కాబట్టి చెపుతున్నాను. నేను చెప్పేది వినండి!"

"సరేసార్! స్వామినాథం మీ దగ్గర వుంటానంటే వుండనివ్వండి! కానీ.. నాకొక సందేహం..? "

"చెప్పండి!"

"స్వామినాథాన్ని మీ ఇంట్లోనే వుండమంటున్నారు. సరి..! మరి ఆ ఆడపాము మీయింట్లోకి రాదా? వచ్చినా ఏమీ చెయ్యదా? "

కరుణాకర్ అడిగిన ప్రశ్నకు జమిందార్ దొరై సింగం తలపంకించి, గట్టిగా ఊపిరి పీల్చి, "అవును మిష్టర్ కరుణాకర్! ఈ బంగ్లా మొత్తం 'నాగబంధం' మధ్య వుంది. మీరు బంగ్లా చుట్టూ ఒకసారి చూసిరండి! విషయం మీకే అర్థమవుతుంది" అని చెప్పి "భీమన్నా!" అని కొంచెం బిగ్గరగా పిలిచారు.

దూరంగా నిలబడి వున్న ఆ దృఢకాయుడు పరుగున వచ్చి చేతులు



కట్టుకుని నిలబడ్డాడు.

"వీరు మన బంగ్లా చుట్టూ చూస్తారు. పోయి జాగ్రత్తగా చూపించి, తీసుకుని రా!" అన్నారాయన.

భీమన్న కరుణాకర్ వైపు చూసి, ముందుకు నడిచాడు. అతని ముఖంలో ఏ భావం కనిపించడంలేదు.

గిరిధర్‌కు విషయం ఎక్కడికో పోతోందనిపించింది.

అయితే గిరిధర్ అనుకున్నదాని కంటే కూడా విషయం మరింత మిష్టరీగా మారబోతోందని మాత్రం అతను ఊహించలేకపోయాడు.

మౌనంగా భీమన్నను అనుసరించారు వాళ్లిద్దరూ. బంగ్లా వదిలి బయటకి వచ్చారు. అలాగే కుడిపక్కకు తిరిగి నడవడం ప్రారంభించారు.

వరుసగా నాటిన చెట్లు ఎంతో మనోహరంగా ఉన్నాయి. ఆ చెట్లు చూడడానికి విచిత్రంగా కనిపిస్తున్నాయి. వాటిని కరుణాకర్‌గానీ, గిరిధర్‌గానీ అంతకు ముందెన్నడూ చూడలేదు.

"ఈ చెట్లను సర్పదేవదారు చెట్లు అంటారండయ్యా! ఈ చెట్లనుంచి వచ్చే వాసనకి అర ఫర్లాంగు దూరం వరకు ఏవిధమైన విషపురుగులు దరి చేరలేవు సార్! వాటికి కడుపులో తిప్పేసి, కళ్ళు కనపడకుండా పోతాయి" గంభీరంగా చెపుతూ ముందుకు పోసాగాడు భీమన్న.

బంగ్లా కుడిపక్క అంతా చూడడానికి



వాళ్లకి సుమారు పదిహేను నిముషాలు పట్టింది. అలాగే బంగ్లా వెనుక పక్కకు తిరిగారు.

అక్కడ బ్రహ్మాండమైన పొయ్యి ఒకటి దట్టంగా పొగలు విరజిమ్ముతోంది. ఆ పొగ నుంచి ఏదో ఒక రకమైన తిక్కవాసన వస్తోంది. ఆ పొయ్యి ముందు కట్టలుగా పేర్చివున్నాయి చెట్లవేర్లను పోలి వున్న కట్టెపేడులు.

"అయ్యా! ఇవన్నీ తెల్లయిసరు, నాగతావి చెట్లవేర్లు. వీటి వాసనకి పాములు భయ పడతాయి. వాటి నాడులు పనిచెయ్య కుండా పోతాయి. దగ్గరకు కూడా రాలేవు. ఆమడ దూరం పరుగుపెడతాయి" అన్నాడు భీమన్న ఆగకుండా నడుస్తూనే..

అతని కాళ్ళకు తెల్లయిసరు, నాగతావి చెట్టు వేరుముక్కలు కట్టివుండడం కరుణాకర్ గమనించాడు. రెండు కాళ్లకు మడమల దగ్గర గొలుసులు మాదిరిగా వేర్లు కనిపిస్తున్నాయి. రెండు చేతులకు మణికట్టు దగ్గర కూడా ఆ చెట్టువేర్లు అతనికి కట్టివున్నాయి.

"సార్! జరిగేది ఏదీ నాకు నచ్చడం లేదుసార్! ఈ వూర్లో వుండే వీళ్ళే.. ఈ పొగలు, వేర్లు వేసుకుని బతకుతున్నారంటే - ఇక ఎక్కడ్నుంచో వచ్చిన మన కథ ఏంటి సార్? ఆలోచించి చూడండి!" లోగొంతుకతో కరుణాకర్‌కు మాత్రమే విని పించేటట్టు చెప్పాడు గిరిధర్.

"అవును గిరిధర్! ఇదంతా చూస్తుంటే -

నా మనసుకు కూడా ఏమీ పట్టడం లేదు. కొంచెం చౌకగా దొరుకుతున్న భూములు కదాని ఆశపడ్డాంగానీ.. ఏదో రాతియుగం నాటి వాతావరణం కనిపిస్తోంది. జమిందారు మాటల్లో కూడా ఎన్నో కాంట్ర డిక్షన్లు. మనం సైలెంట్‌గా వెళ్ళిపోదాం. ఈ జమీన్ కొనడం లేదని తరువాత బ్రోకర్ స్వామినాథం ద్వారా చెప్పి పంపిద్దాం" స్పాట్‌లో ఒక నిర్ణయానికి వచ్చేశాడు కరుణాకర్. తన నిర్ణయాన్ని గిరిధర్ దగ్గర తెగేసి చెప్పేశాడు కూడా.

గిరిధర్ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

బంగ్లా చుట్టూ తిరగడం పూర్తయింది.

ఒక విషయం మాత్రం వాళ్ళిద్దర్నీ బాగా ఆకర్షించింది. అది జమీన్ బంగ్లా కట్టిన

## కొత్తగాలి...

**భూమాతకు ఎందుకో కోపాలు**
**బలై విలవిలలాడింది నేపాలు**
**భారత్ పంచుకుంది సాయంలో పాలు**
**బృహత్కార్యాల్లో తప్పవు కొన్నిలోపాలు!**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

పనితనం. నల్లని రాళ్ళని - అందంగా చెక్కి - వాటితో నిర్మించిన గోడలు. మంచి టేకుతో అమర్చిన రూఫ్. అప్పట్లో బాగా పేరుపొందిన ఖరీదైన జర్మన్ టైల్స్‌తో గదిలోపల గోడలు, ఫ్లోరింగ్.

గాలి, వెలుతురు ధారాళంగా బంగ్లాలోప లికి వచ్చేటట్లుగా కిటికీలు, ద్వారాలు ఉ న్నాయి. అయితే... అంత అందంగా, అద్భుతంగా కట్టిన ఆ జమిందారు బంగ్లా వెనుక భయంకరమైన నీలినీడలు, పాముల భయం.

మనసు లోపల ఎన్నో ఆలోచనలు సుడులు తిరుగుతుండగా - బయలుదేరిన చోటుకే వచ్చి చేరుకున్నారు కరుణాకర్, గి రిధర్. జమిందారు దొరై సింగం వాళ్ల కో సమే ఎదురుచూస్తున్నారు.

"చూశారా మిష్టర్ కరుణాకర్! మిష్టర్ గిరిధర్!" అడిగాడాయన.

"చూశాం సార్! పాములకి విరుగుడుగా పనిచేసే సర్పదారుచెట్లు, తెల్లయిసురు, నాగతావి చెట్లవేర్లు ఈ బంగ్లాకి రక్షణగా పనిచేస్తున్నాయన్నమాట! సపోజ్.. అవి లేకుండా ఈ బంగ్లాలో ఉండడం వీలుకాద నుకుంటా!" గిరిధర్ తన మనసులోని మాటల్ని నిర్మొహమాటంగా అడిగేశాడు.

నిజానికి కరుణాకర్ కూడా అదే అను కుంటున్నాడు.

అది విన్న జమిందార్ దొరై సింగం ముఖం చిన్నపోయింది. పెదవి విప్పి ఏమీ సమాధానం చెప్పలేకపోయారు.

ఆయన మౌనంగా ఉన్నప్పటికీ కరుణా కర్ - అది పెద్దవిషయంగా పట్టించుకోలే దుగానీ - అతన్ని మరింత ఆలోచనలలో పడేసింది. ప్రశ్నలు మీద ప్రశ్నలు. బహుశా ఆయనకు విసుగు తెప్పించి ఉండవచ్చు లేదా సమాధానం ఏం చెబితే.. ఏం వస్తుందో అనే సందిగ్ధ పరి స్థితి కావచ్చు. అందువల్ల ఆయన్ని మరింత ఇబ్బంది పెట్టడం ఇష్టం లేకపో యింది కరుణాకర్‌కి.

"అయితే.. మరి మేం బయలుదేరుతాం జమిందార్‌గారూ!"

"మంచిది! జాగ్రత్తగా వెళ్లిరండి బాబూ" జమిందార్ దొరై సింగం వీడ్కోలు చెప్పారు.

బ్రోకర్ స్వామినాథం కూడా వాళ్లతో బయలుదేరడానికి సిద్ధమయ్యాడు. అది చూసి జమిందారు దొరై సింగానికి కోపం వచ్చింది.

"ఇదిగోచూడు స్వామినాథం! నేను కచ్చితంగా చెపుతున్నాను. నేను చెప్పేవ రకు నువ్వు ఈ ఇల్లు వదిలిపోవద్దు!

వాళ్ళను మాత్రం వెళ్ళనివ్వు. ఇక రాతకోతల వ్యవహారమంటావా? అదంతా వాళ్ళేపూర్తి చేసేస్తారు. ఏం? ఆవిధంగా చేస్తారు కదా మీరు?" అని కరుణాకర్, గిరిధర్‌ల వైపు తిరిగి అడిగారాయన. తర్వాత "ఇక్కడే వుండండి! ఒక్క నిముషం ఇప్పుడే వస్తాను"- అని చెప్పి బంగ్లా లోపలికి వెళ్ళి ఒక ప్లాస్టిక్ ఫైల్‌తో తిరిగి వచ్చాడు.

"ఈ ఫైల్ తీసుకోండి! ఇందులో మీరు కొనబోయే జమీన్‌కు సంబంధించిన అన్ని వివరాలూ వున్నాయి. అన్నీ జెరాక్స్ కాపీలు. మొత్తం ఈ భూములన్నింటికి సంబంధించిన ఇందులోని విషయాలు మీరు ఎవరి దగ్గరైనా చూపించుకోవచ్చు. వీటిని మించి, ఈ భూముల గురించి నేను చెప్పాల్సింది లేదా మీరు అడగాల్సింది ఇంకేమీ లేదు. ఇక మీరు బయలుదేరవచ్చు!" అని చెప్పారాయన చాలా స్పష్టంగా

బ్రోకర్ స్వామినాథం 'అనవసరంగా ఇక్కడ తగులుకున్నాన్రా' అన్నట్లుగా ఉస్సూరంటూ చూస్తుండిపోయాడు.

కరుణాకర్, గిరిధర్‌లు ఆ ఫైల్ తీసుకుని కారువైపు అడుగులు వేశారు.

★ ★ ★

నాగేశ్వరపురం గ్రామవీధిలో కరుణాకర్ తెల్లనికారు నెమ్మదిగా వెనక్కి తిరిగి జెర్రి గొడ్డులా రోడ్డుమీద కదలడం ప్రారంభించింది. చాలామంది వీధిలో నిలబడి చూస్తున్నారు. ఆ వూళ్లో వున్న ఇళ్ళన్నింటికీ తెల్ల సున్నం కొట్టివుంది. నాగరికమైన రకరకాల రంగులు ఏమీ ఆ వూళ్లో ఎవ్వరూ ఉపయోగించినట్లు లేదు. టీవి, డిష్ యాంటీనాలు మాత్రం చాలా ఇళ్ళపై కనిపిస్తున్నాయి.

ఆ వూరు దాటగానే కరుణాకర్‌కు ఏదో ఒక ఫాంటసీ నుంచి బయటపడిన ఫీలింగ్ కలిగింది. గిరిధర్ ముఖంలో మాత్రం ఒక విధమైన భయం కనిపిస్తోంది.

కరుణాకర్ అది గమనించి నెమ్మదిగా మాటల్లోకి దించాడు.

"ఏం గిరి! ఏమీ మాట్లాడకుండా వున్నారు"

'ఏం మాట్లాడేది సార్ నేను? మరల మీరు ఈ భూముల్ని కొనడానికి ఒప్పుకోవద్దు. ఇక పేపర్లలో ఏవైనా మిస్టేక్స్ ఉంటాయని నేను అనుకోవడంలేదు"

"అవును! ఎప్పుడైతే ఈ భూములకి సంబంధించిన పూర్తిఫైల్ మన చేతికిచ్చి బాగా చెక్ చేసుకోండని ధైర్యంగా చెప్పారంటే - అప్పుడే ఈ జమీన్ మీద ఉన్న సందేహాలన్నీ తీరిపోయినట్లే కదా! అయినా మనం చెక్ చేసుకుందాం. కాకపోతే ఈ పాముల భయం మాత్రం ఎందుకో నాకు కొంత ఇరిటేటింగ్‌గా వుంది. ముందుకు ఏ మాత్రం అడుగెయ్యనివ్వడంలేదు"

"సంతోషం సార్! ఏదో కొంతలో కొంత పాముల గురించి ఆ మాత్రమైనా ఫీలింగ్ ఉందని చెప్పారు.. సంతోషం!"

గిరిధర్ ఇచ్చిన సమాధానంలో కోపం, హేళన రెండూ మిళితమై ఉన్నాయి.

"ఏంటి గిరి? ఈ భూముల్ని కొనడం మీకు బొత్తిగా ఇష్టం లేనట్లుంది!"

"అస్సలు ఇష్టంలేదు సార్! ఇదేదో నేను పాములకి భయపడో, లేదా పాముల శాపం తగులుతుందనో చెప్పడం లేదు. అసలు ఈ వూర్లోనే ఏదో మర్మం దాగి వుంది సార్!"

"మర్మమా?"

"అవును సార్! అంతకు మించి నాకెలా చెప్పాలో తెలియడంలేదు"

"సరి! అందువల్లనే మనం భూముల్ని కొనాలా? వద్దా? అనేది జాగ్రత్తగా ఆలోచించాలి. అంతేకదా?"

"అవును సార్! మనం ఇప్పుడు మన బిజినెస్‌పై పూర్తి ఏకాగ్రత పెట్టి పనిచె

య్యాల్సిన పరిస్థితిలో వున్నాం. మన బిజినెస్ ఇప్పుడు హైపీక్‌లో వుంది. ఈ పూల తోటలు వేయడమనేది మనకు కొత్త విషయం. మార్కెట్టును పట్టుకోవడానికి, దీన్నుంచి రాబడి పొందడానికి మనకు చాలా సంవత్సరాలు పట్టవచ్చు. మధ్యలో ఈ విధంగా చికాకులు పెట్టే విషయాల వల్ల మన పథకాలు అంత అభివృద్ధిలోకి రాక పోవచ్చు. అందువల్ల ఈ వూరులోని ఈ భూముల్ని కొనకపోవడమే మంచిదనిపిస్తోంది నాకు"

గిరిధర్ చాలా క్లియర్‌గా విషయాన్ని, ప్రస్తుత పరిస్థితిని చక్కగా ఎనలైజ్ చేసి పూర్తిచేయడం- కారు కీచుమంటూ సడన్ బ్రేక్‌తో ఆగడం ఒకేసారి జరిగాయ్.

## కొత్తగాలి...

**నేను ఏ గడ్డో తిని**
**కడుపు నింపుకుంటుంటే**
**వాడు ఏ గడ్డయినా మేసి**
**సంచి నింపుకుంటున్నాడు!**

*- జి.జి.కె. రావు,*
*శ్రీకాకుళం*

ఇద్దరూ ఒక్కసారిగా ఉలిక్కిపడి ముందుకు చూశారు.

అక్కడ.. దారి మధ్యలో..

ఒకటి కాదు, రెండు కాదు.. ఏకంగా మూడు నాగుపాములు పడగవిప్పి బుసలుకొడుతూ నాట్యం చేస్తున్నాయి.

అటువైపు పోస్టుమాన్ ఒకతను- తన సైకిల్ స్టాండ్‌వేసి, నడిరోడ్డు అని కూడా చూడకుండా ఆ పాములకి సాగిలబడి మొక్కి, కర్పూరం తీసి, దాన్ని వెలిగించడంలో మునిగిపోయి ఉన్నాడు.

కరుణాకర్, గిరిధర్‌లు ఆశ్చర్యపోయి- కన్నార్పకుండా ఆ దృశ్యాన్ని చూడసాగారు.

వారలా చూస్తుండగానే కర్పూరం గప్పున వెలిగింది.

దూరంగా నిలబడి దాన్ని, ఆ పాముల చుట్టూ మూడుసార్లు పైకి కిందికి తిప్పి, కళ్లకద్దుకున్నాడు ఆ పోస్ట్‌మాన్.

ఆ దృశ్యం చూడడానికి చాలా చోద్యంగా కూడా ఉంది.

బుసలు కొడుతున్న ఆ మూడు పాములు శాంతించినట్లు- మెల్లగా విప్పిన పడగలు నేలకు దించి- రోడ్డు వదిలి పక్కనున్న పొదల్లోకి నెమ్మదిగా వెళ్లిపోయాయి.

అపుడా పోస్ట్‌మాన్ 'హమ్మయ్య' అనుకుంటూ గుండెలమీద చేయి వేసుకున్నాడు. మరొక్కసారి ఆ పాములు వెళ్లిన దిశగా, సాష్టాంగ నమస్కారం చేసి లేచి నిలబడి సైకిల్ తీసుకున్నాడు.

కరుణాకర్ కారును అతని పక్కగా పోనివ్వమన్నాడు. అతని వైపు గమ్మత్తుగా చూస్తూ, చిరునవ్వు నవ్వాడు.

"ఏంసార్! నవ్వుతున్నారు? నేను ఈ పాములకి మొక్కడం మీకు విచిత్రంగా ఉంది కదూ! ఈ నాగేశ్వరపురం వచ్చారు కదూ! మీరు కూడా మొక్కక తప్పదు" అన్నాడు పోస్ట్‌మాన్.

"ఓc..! ఆ విధంగా కూడా ఉందా?" అన్నాడు గిరిధర్.

"అవును సార్! ఆ విధంగా చెయ్యక పోతే.. మీరు ఏ పని కోసమైతే వచ్చారో.. ఆ పని జరుగదు"

"ఆ భయంతోనేనా మీరు రోడ్డు అని కూడా చూడకుండా సాష్టాంగ దండప్రమాణాలు చేసి, కర్పూరం వెలిగించి పూజలు చేస్తున్నారు?"

"మీరు ఈ నాగేశ్వరపురం ఇపుడే ఫస్ట్ టైమ్ వచ్చారనుకుంటాను. అందుకే వివరం తెలియకుండా ప్రశ్నలు అడుగుతున్నారు. నేను కూడా మొదట్లో విషపురుగులకి మనమేంట్రా మొక్కేదని చాలా నిర్ల

# తెలుగువారిని ఆకట్టుకున్న తమిళ రచయిత


ఇందిరా సౌందరరాజన్

'నాగేశ్వరపురం 4 కి.మీ.' తమిళ మూల రచయిత ఇందిరా సౌందరరాజన్. వీరు 1958 నవంబరు 13వ తేదీన సేలం నగరంలో జన్మించారు. 1978 నుంచి రచనా వ్యాసంగం ప్రారంభించి తమిళనాడులోని అన్ని వార, మాస పత్రికలకు వందలకొద్దీ కథలు, ధారావాహికాలు రాశారు. ఇంత వరకు 340 నవలలు, ఏడొందల కథలు, 97 ధారావాహికాలు, 150 పెద్ద నవలలు ప్రచురితమయ్యాయి. వీరి కథలెన్నో ఉత్తమ రచనలుగా అనేక బహుమతులు పొందాయి. సాహిత్య అకాడెమీ వీరి కథల్ని కొన్నింటిని ఇంగ్లీషులోనికి అనువాదం చేయించింది. 'ఇలక్కియ చింతనై, సిరంద ఎళుతాళర్' బిరుదులు పొందారు. అనేక నవలల పోటీలలో మొదటి బహుమతులు పొందడం వీరి ప్రతిభకు నిదర్శనం. వీరి 'రుద్రవీణై' నవల అమ్మకం తమిళనాడులో సంచలన రికార్డు సాధించింది. టీవీ సీరియల్‌గా కూడా అశేషప్రేక్షకుల మన్ననలు పొందింది. వీరు రాసిన, 'మర్మదేశం, విడాద కరుపు' మెగా తమిళ టీవీ సీరియళ్లు తెలుగులోకి అనూదితమయి తెలుగు ప్రేక్షకుల్ని కూడా ఉర్రూతలూగించాయి. చలన చిత్రాలకు కూడా వీరు కథలు సమకూర్చారు. 'శృంగారం' సినిమాకు ఐదు కేంద్రప్రభుత్వ అవార్డులు అందుకున్నారు. వీరి నవలలు అనేకం ఇతర భాషల్లోకి అనువాదమయ్యాయి.

క్ష్యంగా ప్రవర్తించాను. ఆ తరువాత పడరాని పాట్లు పడ్డాక గానీ నాకు బుద్ధి రాలేదు"

"అయితే ఇపుడు మేం వాటికి మొక్కలేదు కదా! మాకేదైనా అవుతుందా? అదే కదా మీరు చెప్పబోయేది!"

"అది నేను చెప్పేకంటే.. మీకు స్వయంగా అనుభవంలోకి వచ్చిన తరువాత తెలుస్తుంది. సరేసార్! నాకు టైమయ్యింది. వస్తాను సార్!"

పోస్ట్‌మాన్ పోయేవాడు పోకుండా ఒక రకమైన భయాన్ని రేపి, వదిలేసి పోయాడు.

గిరిధర్ ముఖం నల్లగా మాడిపోయింది.

"ఏంటి సార్? ఆ పోస్ట్‌మాన్ చెప్పింది మీరు నమ్మడం లేదా?" కరుణాకర్ ముఖంలోకి పరిశీలనగా చూస్తూ, కలవరంగా అడిగాడు గిరిధర్.

"మీరు ఇదంతా నమ్ముతున్నారా మిస్టర్ గిరిధర్?"

"నమ్మాలో.. నమ్మకూడదో.. నావల్ల కావడం లేదు సార్!"

"అటువంటి సందిగ్ధ పరిస్థితి నా దగ్గర లేదు. నేను ఒక్క పర్సెంట్ కూడా నమ్మడానికి సిద్ధంగా లేను"

"అయితే అతను పడ్డ అగచాట్లు అబద్ధమంటారా?"

"అవేమిటో అతను చెప్పలేదే? ఏవో అతనికి వచ్చిన కష్టాన్ని దీంతో ముడిపెట్టి చెబుతున్నాడు. అంతే! అంతకు మించి మరేమీ కాదు. సరే! ఇక మనం బయలుదేరుదామా?"

కారు ముందుకు దూకింది

వచ్చేటప్పుడు ఏ దృశ్యాలైతే చూశారో అవే తిరిగి దర్శనమిస్తున్నాయి.

"గిరిధర్! ఇదిగో ఇక్కడ్నుంచికంచె వేయాలనుకున్నాను ఒకవేళ మనం ఈ జమీన్ కొంటే! బాగా ఆరడుగుల ఎత్తులో ముళ్లకంచె లాంటిది వేయాలని ప్లాన్"-

పొలాల్ని బాగా పరిశీలిస్తూ మాట్లాడ సాగాడు కరుణాకర్.

గిరిధర్ మౌనంగా తల వూపాడు.

కారు బాగా వేగం అందుకుంది

'నాగేశ్వరపురం 4 కి.మీ.' అని చెక్కి వున్న శిలాఫలకం దాటింది. నాగశిలను కూడా దాటడానికి ఎడమ పక్కకు తిరిగింది కారు.

సరిగ్గా అప్పుడు జరిగింది ఆ సంఘటన.. ఎక్కడ్నుంచి వచ్చిందో తెలియదు, అకస్మాత్తుగా ఒక గాడిద.. కారుకు అడ్డంగా వచ్చిపడింది.

ఎదురుచూడని ఆ సంఘటనకి డ్రైవర్ బిత్తరపోయాడు.

కొత్తగాలి...

**ముద్దొచ్చినప్పుడు**
**కౌగిలింత!**
**నిద్దురొచ్చినప్పుడు**
**ఆవులింత!**

– శ్రీలక్ష్మి,
నల్లకుంట, హైదరాబాద్

అనుభవం ఉన్న డ్రైవర్ కాబట్టి చాకచక్యంగా కారును కంట్రోల్ చేయగలిగాడు. కానీ, అప్పటికే లేటయ్యింది. కారు కుడివైపు హెడ్‌లైట్ గాడిదను బలంగా తాకింది. ఆ దెబ్బకు అది ఎగిరి కుడివైపు పొదల్లో పడింది, బాధతో బిగ్గరగా అరుస్తూ. కారు ఎడమ పక్కకు తిరిగి.. రోడ్డు దిగిపోయింది. రాత్రి కురిసిన వర్షం వల్ల అక్కడంతా బురద, బురదగా ఉంది. సరిగ్గా ఆ బురదలో కూరుకుపోయి.. కారు ఆగిపోయింది.

కారు డోర్ తీయడానికి ప్రయత్నించాడు కరుణాకర్. ఓపెన్ కాలేదు. గిరిధర్ రెండోవైపు ట్రై చేశాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. డ్రైవర్ ఫ్రంట్ డోర్ బలంగా నెట్టాడు. కొంచెం కూడా కదల్లేదు. ఏమైందో తెలియడం లేదు. ఈలోపు కారులోని ఎ.సి. ఆగిపోయింది. అంతే! క్రమంగా ముగ్గురికీ ఊపిరి పీల్చుకోవడం కష్టమవుతోంది. కరుణాకర్ బూట్‌కాళ్లతో గ్లాస్‌విండో పగలగొట్టడానికి బలంగా తన్నాడు. ఫలించలేదు. ముగ్గురికీ శ్వాస అందడం లేదు. గిరిధర్ మనసులోపల నాగదేవతలకు ప్రార్థనలు చేయడం ప్రారంభించాడు.

అప్పుడు తీశాడు కరుణాకర్ తన జేబులోంచి లైసెన్స్‌డ్ రివాల్వర్. పాయింట్ బ్లాక్ రేంజ్‌లో గ్లాసను షూట్ చేశాడు. భళ్లున పగిలింది గ్లాస్‌విండో. అతికష్టం మీద కారులో నుంచి బయటపడ్డారు కరుణాకర్, గిరిధర్, డ్రైవర్.

అక్కడ్నుంచి రోడ్డు మీదకు చేరుకోవడానికి చాలా శ్రమ పడాల్సి వచ్చింది ముగ్గురూ.

ఈలోపల దెబ్బతిన్న గాడిద కుంటు కుంటూ కరుణాకర్ కొందామని ఆశపడ్డ పొలాల్లోకి అడ్డంపడి పరుగుపెట్టింది.

పోస్ట్‌మాన్ చెప్పిన మాటలు చెవుల్లో రివైండ్ అయినట్లుగా అనిపించింది గిరిధర్‌కు. అంతులేని భయంతో అతని ముఖం పాలిపోయింది.

సరిగ్గా అదే సమయంలో..

రోడ్డు పక్కనున్న పొదల్లో ప్రత్యక్షమయ్యాడు ఒక వ్యక్తి. అతని చేతిలో పొడవాటి దుడ్డుకర్ర ఒకటి ఉంది. అతను సరాసరి రోడ్డు మీదకు వచ్చాడు. చూడ్డానికి చాలా మొరటుగా ఉన్నాడు.

“ఏంటి సార్? గాడిదను గుద్ది, మీ కారు బురదలో దిగిపోయిందా? కొంచెం చూసుకుని పోవద్దూ? ” అన్నాడు.

“అంతా చూసుకునే వస్తున్నామయ్యా! అయితే గాడిద ఇంత సడన్‌గా కారుకు అడ్డం పడుతుందని మేం ఏమైనా కలగ

న్నామా? "

"అయితే ఏదైనా దేవుడి మొక్కుబడి తీర్చకుండా ఉన్నారా ఏంటి? " అన్నాడ తను మరల.

"దేవుడి మొక్కుబడా? "

"అవును మరి! నాగేశ్వరపురం నాలుగు కిలోమీటర్ల దారిని ఏ ఆటంకాలు లేకుండా, ఏ అగచాట్లు పడకుండా దాటలేకపోతే- దేవుడి మొక్కుబడి ఏదో తీర్చాల్సింది బాకీ ఉండిపోయిందని అర్థం"

అతను చెప్పిన మాటలు గిరిధర్‌కు మొఖం మీద కొట్టినట్లుగా అయ్యింది.

"అయ్యా! పెద్దాయనా! ఇపుడు కారును బయటికి తియ్యాలి. ముందు దానికేదైనా దారి చూపించండి. కనీసం ఒక నలుగురైదుగురు తోస్తేగానీ బండిని బయటికి లాగలేం" అన్నాడు గిరిధర్.

"ముందు ఏదైనా దేవుడి మొక్కుబడి ఉంటే- అది తీర్చండి. లేకపోతే వంద మంది వచ్చి తోసినా బండి ఒక్క అంగుళం కూడా కదలదు"

"ఏంటి పెద్దాయనా? భయపెడుతున్నావా? "

"ఉన్న విషయమే చెప్పాను నేను. వింటే వినండి. లేకపోతే వదలండి. అవునూ! ఇంతకూ ఎక్కడికి వచ్చారు మీరు? కొంపదీసి ఈ పొలాలు కొందామని వచ్చారా ఏంటి? "

"ఈ పొలాలు కొనాలనుకున్నవాళ్లు మాత్రమే ఈ ఊరికి వస్తారా ఏమిటి? మిగతా వాళ్లెవ్వరూ నాగేశ్వరపురం రాకూడదని మీ ఉద్దేశమా? "

"మిమ్మల్ని చూస్తే నాకలా అనిపించింది. అందుకే అడిగాను"

"అవును! కొనడానికే వచ్చాం. అది అలా ఉంచండి. ఇపుడు కారు బయటికి తీయడానికి ఏదైనా మార్గం చూడండి ముందు"

"అరె..! నేను మొదటే చెప్పాను కదా! కనీసం ఆ నాగదేవతకి చేతులెత్తి మొక్కండి! లేకపోతే ఈ నాగేశ్వరపురం నాలుగు కిలోమీటర్లు దాటలేరు"

ఆ మనిషి చాలా నిర్లక్ష్యంగా మాట్లాడి, దుడ్డుకర్ర ఊపుకుంటూ... రోడ్డు ఎక్కి నాగేశ్వరపురం దిశగా అడుగులు వేశాడు. కన్నుమూసి తెరిచే లోపల అదృశ్యమైపోయాడు.

"ఇపుడేం చేద్దాం సార్? "

"రండి! మన ముగ్గురం కలిసి ట్రైచేసి, చూద్దాం"

కరుణాకర్, గిరిధర్, డ్రైవర్ ముగ్గురూ కలిసి బురదలో దిగి, కారు వెనుక నుంచి తోయడానికి ప్రయత్నించారు.

కారు కొంచెం కూడా కదల్లేదు.

తిరిగి ముగ్గురూ బలమంతా ఉపయోగించి, కారును ముందుకు నెట్టారు. ఆయాసం వచ్చింది కానీ ప్రయోజనం లేకపోయింది.

గిరిధర్‌కు భయం ఎక్కువయ్యింది.

"సార్! మన ముగ్గురి బలానికి- కారు కొంచెం కూడా కదలడం లేదంటే ఆశ్చర్యంగా లేదూ! సార్! ఇక్కడ.. ఈ నాగేశ్వరపురంలో తెలియని విషయమేదో ఉన్నట్లుగానే ఉంది సార్! నిజానికి మనకు 'ఇగో' అడ్డువచ్చి- దాన్ని మనం ఒప్పుకోలేకపోతున్నాం అనుకుంటున్నాను. రండి..! ఆ నాగశిల దగ్గరకు పోయి మొక్కి వద్దాం" చెయ్యెత్తి కొంచెం దూరంలో ఠీవిగా నిలబడి ఉన్న ఆ పాము పడగను చూపించాడు గిరిధర్.

గిరిధర్ చెప్పింది వినగానే కరుణాకర్‌కు నవ్వు వచ్చింది. ఆపుకోలేకపోయాడు. పకపకా నవ్వేశాడు. కొంచెం ఎక్కువగానే నవ్వాడు.

పాపం! గిరిధర్ ముఖం నల్లగా మాడిపోయింది. విషయం అర్థమయ్యింది. ఇక అంతకు మించి ఒక్కక్షణం కూడా అక్కడ ఉండలేదు గిరిధర్. కరుణాకర్‌ను వదిలేసి

చకచకా అడుగులు వేసుకుంటూ ఆ నాగ శిలను చేరుకున్నాడు. దానిముందు నిల బడి చేతులెత్తి నమస్కరించాడు. రోడ్డు అని కూడా చూడకుండా సాగిలబడి మొక్కాడు. ఆ నాగశిల తలమీదనున్న కుంకుమ తీసి, నుదుట మీద దిద్దుకు న్నాడు. మనసు లోపలే ప్రార్థిస్తూ తిరిగి వచ్చాడు.

"ఏం గిరిధర్‌గారూ! ఇకపై కారు బయ టపడుతుందనుకుంటాను? " తిరిగి వచ్చిన గిరిధర్‌ను నవ్వుతూ అడిగాడు కరుణాకర్.

"చూద్దాం సార్!"

"చూద్దామా? లేదు.. లేదు.. కారు కచ్చి తంగా బయటపడి తీరాలి! లేకపోతే మీ రు చేసిన ప్రార్థనలన్నీ వృథా అని మీరు ఒప్పుకోవాలి" సరదాగా హేళన చేశాడు కరుణాకర్.

కరుణాకర్ ఛాలెంజ్- గిరిధర్ భయాన్ని రెట్టింపు చేసింది. తన నమ్మకం వృథాపోదని ధైర్యంగాను ఉంది.

సరిగ్గా అదే సమయంలో-

దూరాన్నుంచి 'దడదడ'మని ఏదో శబ్దం వినిపించసాగింది. అది ఏదో వాహనం వస్తున్న శబ్దం.

చటుక్కున తిరిగి చూశారు ముగ్గురు.

నాగేశ్వరపురం నుంచి వస్తోంది ఒక ట్రాక్టర్. దగ్గరకు రాగానే ట్రాక్టర్ లోపలి వ్యక్తిని చూసి, ఆశ్చర్యపోయారు కరుణా కర్, గిరిధర్.

ట్రాక్టర్ లోపల.. డ్రైవర్ పక్కసీట్లో కూర్చుని ఉన్నాడు బ్రోకర్ స్వామినాథం. కరుణాకర్, గిరిధర్‌ల్ని చూసి, టక్కున ట్రాక్టర్ ఆపుజేయించాడు.

"ఏంటిసార్! ఏం జరిగింది? మీకా రేది? " ఆశ్చర్యంగా అడిగాడు బ్రోకర్ స్వామినాథం.

రోడ్డు పక్కన.. బురదలో కూరుకుపో యిన కారును చూపిస్తూ, "చిన్న యాక్సిడెంట్ స్వామినాథం! అదంతా తరు వాత వివరంగా చెబుతాంగానీ ముందా కారు బయటపడడానికి ఆలోచించు. అవునూ..! మా కారు గురించి అడుగుతు న్నావు. నువ్వు ఎలా వచ్చావ్? నీజీప్ ఏది? "

"నా సంగతి ఏం అడుగుతారులెండి? ఎలాగో జమిందారుకు తెలియకుండా తప్పించుకుని వచ్చేశాను. నన్ను పోనివ్వ కుండా చాలా కట్టుదిట్టం చేశాడు"

"ఫర్వాలేదు! నీక్కూడా ధైర్యం వుంది? "

"ఈ నాలుగు కిలోమీటర్లు దాటి నాగే శ్వరపురం పోవాలంటేనే ఒక హింస సార్! దానికితోడు మనుషుల్ని బాగా భయపెట్టే స్తారు ఇక్కడ" చెపుతూ ట్రాక్టర్ దిగాడు స్వామినాథం.

కారును బయటికి తీయడానికి ట్రాక్టర్ డ్రైవర్‌తో మాట్లాడాడు స్వామినాథం. అతని సూచనల మేరకు ట్రాక్టర్ డ్రైవర్, సీట్లోంచి దిగి, ట్రాక్టర్ వెనుక పక్క ట్రయ లింగ్‌కు వేలాడుతున్న తాడు తీసుకు న్నాడు.

ఒక కొన కారువెనక కట్టి, రెండోపక్క ట్రాక్టర్‌కు కట్టి- స్టార్ట్‌చేసి నెమ్మదిగా రివర్స్ చేశాడు.

కారు నెమ్మదిగా బురదలోంచి బయటికి వచ్చి రోడ్డు ఎక్కింది.

గిరిధర్‌కు పట్టరాని ఆనందం కలిగింది. కారు పైకి వచ్చినందుకు కాదు.. తన నమ్మకం ఒమ్ము కాకుండా పోయినందుకు. గండం గట్టెక్కినందుకు కొంచెం దూరంలో వున్న ఆ నాగశిలకు ఇక్కడ్నుంచే మరొక్క సారి భక్తిగా నమస్కరించాడు.

కరుణాకర్‌కు మనసు లోపల సంఘర్షణ ఆరంభమయింది. ఇది యాదృచ్ఛికమా? దైవసంకల్పమా?

"గిరిధర్! మీ ప్రార్థనలకి- శక్తి వున్న ట్లుగా తెలుస్తోందే!" కరుణాకర్ కన్‌ఫ్యూ జింగ్ వాయిస్‌తో మెచ్చుకోలుగా అన్నాడు.

ఆ ట్రాక్టర్ డ్రైవర్ తాడును విప్పి- తన

బండికి తిరిగి తగిలించుకున్నాడు. కరుణాకర్‌తో సహా అందరూ అతనికి కృతజ్ఞతలు చెప్పారు.

బ్రోకర్ స్వామినాథం సెల్‌ఫోన్ తీసి- తన జీప్ డ్రైవర్‌కు ఫోన్ చేసి, "రాజూ! జీప్ తీసుకుని నువ్వు కూడా బయలుదేరి వచ్చెయ్. నేను నాగశిల దగ్గర కరుణాకర్ సార్‌తో వున్నాను. వాళ్ల కారులో వెళుతున్నాను" అని చెప్పాడు.

"సరేసార్! మీరు వెళుతూ ఉండండి! మీ వెనుకనే వచ్చి నేను మిమ్మల్ని కలుసుకుంటాను" అన్నాడతను ఫోన్లో.

తెల్ల తాచుపాములాగ నిగనిగలాడే కరుణాకర్ కారు- నల్లని బురద అంటుకుని సగం వరకు వేరే పెయింట్ వేసినట్లుగా వెలవెలబోతోంది. దానికితోడు పగిలిపోయిన హెడ్‌లైట్, విండోగ్లాస్!

"ఇంకేమీ జరగక ముందే మనం ఇక్కడ్నుంచి బయలుదేరి పోదాం సార్!" గిరిధర్ తొందర పెట్టాడు.

"ఎలా వుండే కారు..! ఎంత కాస్ట్లీ కారు సార్ ఇది..! ఇలా అయిపోయింది" అన్నాడు బ్రోకర్ స్వామినాథం.

డ్రైవర్ కారు ఎక్కి స్టార్ట్‌చేశాడు.

ఫలితం లేకపోయింది. స్టార్ట్ కాలేదు. "అమ్మా! నాగదేవత! మమ్మల్ని కరుణించు తల్లీ!" ఈసారి మనసులోని ప్రార్థనని గిరిధర్ బిగ్గరగా పైకే అనేశాడు.

డ్రైవర్ మరొక్కసారి ప్రయత్నించాడు.

గిరిధర్ ప్రార్థన ఫలించిందో..? ఏమో..? ఈసారి కారు వెంటనే స్టార్టయ్యింది. బ్రోకర్ స్వామినాథం, గిరిధర్ కారు వెనుక సీట్లో కూర్చున్నారు. ఫ్రంట్ సీట్లో కరుణాకర్.

"మిష్టర్ స్వామినాథం! ఇక్కడ జరిగే సంఘటనలు.. ఈ నాగేశ్వరపురం ఊరు.. కొంచెం విడ్డూరంగా వున్నాయి. అసలు ఏమనుకోవాలో? ఏం చెప్పాలో? తెలియడం లేదు" అన్నాడు కరుణాకర్.

కారు వేగంగా పరుగెడుతోంది. ఇపుడు

## నా తొలి అనువాద నవల



### డా. యండపల్లి పాండురంగ

ఒక్క తమిళ పదంతో కూడా పరిచయం లేని పశ్చిమగోదావరి జిల్లాలోని భీమవరం పక్కనున్న లక్ష్మీనారాయణపురం నా జన్మస్థలం. మద్రాసు విశ్వవిద్యాలయం 'యూనివర్శిటీ రీసెర్చి ఫెలోషిప్' వచ్చినందువల్ల చెన్నైలో ఎం.ఫిల్, డాక్టరేట్ పొందగలిగాను. తమిళనాడు ప్రభుత్వ విద్యాశాఖలో కామర్స్ పి.జి. అసిస్టెంట్‌గా పనిచేసి గత ఏడాదే రిటైరయ్యాను. తమిళనాడులోని ప్రభుత్వ తెలుగు పాఠశాలలకు పాఠ్యపుస్తకాలు రాయడం, గ్రూప్ సబ్జెక్టులు తమిళం నుంచి తెలుగులోనికి అనువాదం చేయడం ద్వారా అక్కడి తెలుగువారికి నావంతు సేవ అందించగలిగాను. వివిధ పత్రికలలో కథలు, కవితలు, కార్టూన్లు పరిశోధక వ్యాసాలు ప్రచురితమయ్యాయి. విజయవాడ, మద్రాసు ఆకాశవాణి కేంద్రాల ద్వారా రేడియో నాటికలు, కథలు కూడా ప్రసారమయ్యాయి. 'చతుర'లో ఇది నా తొలి అనువాద నవల. మూల రచయిత సౌందరరాజన్‌గారి అనుమతితో, సూచనలతో ఈ తెలుగు అనువాద నవలలో కొన్ని మార్పులు చేశాను. నవల పాఠకుల్ని ఆకర్షిస్తుందని ఆశిస్తున్నాను..

చిరునామా:
డా. యండపల్లి పాండురంగ, లెక్చరర్,
ఇం.నెం. 4-57, అల్లూరివారి వీధి,
గణపవరం - 534198
ప.గో. జిల్లా

ఏసీ కూడా పనిచేస్తోంది.

"సార్! నా మనసు లోపల్నుంచి- నిజంగా చెపుతున్న మాటలు సార్ ఇవి! నా దగ్గరే కానీ డబ్బు వుండి వుంటే- ఈ మొత్తం జమీన్ అంతా నేనే కొనేవాడిని సార్! కానీ, ఏం చేస్తాం! నేను కమీషన్ మీద బతికే ఒక సాధారణ బ్రోకర్‌ని. ఇపుడు చెబుతున్నాను.. సార్! మీరు ఈ భూములన్నీ కొని, తోటలు పెంచి, ఓహో అంటూ వ్యాపారం చేసేటపుడు- తప్పని సరిగా మీరు అపుడు నన్ను తలుచుకుంటారు సార్! ఇంక ఎవరేం చెప్పినా, మీరు చెవిలో వేసుకోవద్దుసార్! జమీందార్‌కు తెలియకుండా నేను ఎందుకు ఇలా వచ్చేశానో తెలుసా సార్! ఆయన భయం నిజం కాదని నిరూపించడానికి. అంతేకాదు మీరు కూడా ఆ మాటలు ఏవీ నమ్మకుండా- సంతోషంగా ఈ ల్యాండ్ కొనగల్గుతారనీ"

**కొత్తగాలి...**

**భావి భయపెట్టకుండా**
**బాల్యస్మృతులే నాకు అండ!**
**వర్తమానం ఎదుట నుంచున్న**
**ఎక్కలేని పెనుకొండ!**

**– యి.భ.వ. రావు,**
చిలకలూరి పేట

"చాల సంతోషం స్వామినాథం! మీ ధైర్యాన్ని నేను మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. నేనింతవరకు ముందుకు వేసిన కాలు వెనక్కు తీసుకున్నది లేదు. కానీ.. మా అసిస్టెంట్ గిరిధర్‌కు ఈ వూరు నచ్చలేదు. ఈ భూముల చుట్టూ సంభవించిన విచిత్ర పరిస్థితులు నచ్చలేదు. అందువల్ల.." గిరిధర్ అనుమానాన్ని కుండ బద్దలు కొట్టినట్లుగా చెప్పేశాడు కరుణాకర్.

"ఏంటి గిరిధర్ సర్! చదువుకున్న మీరే ఇలా భయపడితే ఎలా?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు బ్రోకర్ స్వామినాథం.

"లేదు.. లేదు.. స్వామినాథం! ఈ నాగేశ్వరపురం ఊళ్లో ఏదో వుంది. అంతా అగమ్యగోచరంగా వుంది. ఇపుడు కూడా నేను పోయి- ఆ నాగశిలకు మొక్కిన తరువాతనే బండి బయటికి తీయడానికి వీలయింది"

"అదే! ఏంటి సార్ మీరు? ఈ కాకమ్మ కథలు నమ్ముతానంటారు! పాము అనేది పొడుగ్గా వుండే ఒక విషపురుగు సార్! అంతే! దానికి చెవులు ముక్కులేవు. కాళ్ళు లేవు, చేతులు లేవు, పాపం సార్ అది! ఈ బలి తీసుకునేది, పగబట్టేది అంతా మనుషులే సార్!"

బ్రోకర్ స్వామినాథం మాటల్లో సత్యం వుంది. కరుణాకర్ బదులేమీ చెప్పకుండా- మౌనంగా బయటికి చూస్తూ కూర్చుండిపోయాడు. దూరంగా నాగేశ్వరపురం వూరు సరిహద్దులు కనిపిస్తున్నాయి.

సరిగ్గా అదే సమయంలో..

"స్..స్..స్..స్"

ఒక విచిత్రమైన శబ్దం.

మోడ్రన్ టెక్నాలజీతో తయారైనందువల్ల కారు లోపల ఉన్నవాళ్లకు ఇంజన్ సౌండ్ కూడా వినబడడం లేదు. సైలెంట్‌గా పరిగెడుతోంది.

అటువంటి నిశ్శబ్దాన్ని చీలుస్తూ మరొక్కసారి 'స్..స్..స్' శబ్దం వినవచ్చింది.

ఈసారి ఆ శబ్దం అందరికీ వినిపించింది. అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

డ్రైవర్ పక్క సీట్లో కూర్చొని వున్న కరుణాకర్ వెనక్కి తిరిగి చూశాడు. సరిగ్గా అదే సమయంలో..

ఆ శబ్దం ఇంకా గట్టిగా వినిపించింది.

ఒక్కసారిగా నలుగురూ ఉలిక్కిపడ్డారు. అందరి ముఖాలలో ఆందోళన.

అంతలో..

బ్రోకర్ స్వామినాథం కాళ్ళ దగ్గర ఏదో మెత్తగా కదులుతున్నట్లనిపించింది. అతనికి ఒక్కసారిగా ఒళ్ళు జలదరించింది.

ఈలోపల డ్రైవర్ ఒడిలో నుంచి స్టీరింగ్ మీదుగా ఫ్రంట్ గ్లాసుపైకి పాకుతూ- డాష్ బోర్డుపైకి వచ్చింది. మొదటిగా కరుణాకర్ దాన్ని చూశాడు.

అది.. ఒక కింగ్ కోబ్రా!

చూసిన మరుక్షణం కరుణాకర్ గుండె ఝల్లుమంది.

"డ్రైవర్! కారు ఆపుచెయ్! పాము!" అంటూ బిగ్గరగా అరిచాడు.

వెంటనే డ్రైవర్ కూడా అలర్టయ్యాడు.

అంతే!

కారు షడన్ బ్రేక్ వేయడం- డోర్ తెరుచుకుని ఇద్దరూ బయటికి జంప్ చేయడం ఒకేసారి జరిగిపోయాయి.

ఆ కింగ్ కోబ్రా సుమారు పన్నెండు అడుగుల పొడవుంది. అది బ్రోకర్ స్వామినాథం కూర్చొని వున్న వెనుక సీట్లో నుంచి- డ్రైవర్ సీటు మీదుగా ఫ్రంట్ గ్లాస్ వరకు ఆక్రమించుకుని వుంది. బ్రోకర్ స్వామినాథం కాళ్ళకు మెత్తగా తగిలింది కింగ్ కోబ్రా తోక. ఇప్పటికీ అతని కాళ్ళు దాని తోకపైనే వున్నాయి.

గిరిధర్‌కు సిట్యుయేషన్ అర్థమయింది. అతను కూడా అదే వేగంతో డోర్ తెరచుకుని బయటికి దూకేశాడు.

అదే డోర్‌లో నుంచి బయటికి రావడానికి ప్రయత్నించాడు బ్రోకర్ స్వామినాథం. ఆ కంగారులో- ఆ కింగ్ కోబ్రా తోకను మరింత బలంగా తొక్కేశాడు.

రెచ్చిపోయింది కింగ్ కోబ్రా. కోపంతో భయంకరంగా బుసకొట్టింది.

అంతే!

బ్రోకర్ స్వామినాథానికి గుండె జారిపోయింది. భయం అతని గుండెల్లో నుంచి గొంతులోకి ప్రవేశించి గోలీ సోడాలోని గోలీ మాదిరిగా కొట్టుకుంది.

ఫ్రంట్ డాష్‌బోర్డు మీద నుంచి లాగి పెట్టి వదిలిన బాణంలాగ దూసుకొచ్చింది కింగ్ కోబ్రా. బ్యాక్‌డోర్ నుంచి దిగబోతున్న అతని దారికడ్డంగా పడగ విప్పి మరోసారి బుస కొట్టింది.

కదలడానికి వీల్లేని పరిస్థితి. ఏమాత్రం కదిలినా పాము కాటేసేస్తుంది.

"సార్! నన్ను రక్షించండి! ఏదైనా చేసి, నన్ను రక్షించండి సార్!" అంటూ భయంతో బిగ్గరగా అరిచాడు బ్రోకర్ స్వామినాథం.

అదే అతను చేసిన పొరపాటు.

> **కొత్తగాలి...**
>
> **నిప్పులాంటిది భయం**
> **నీళ్లలాంటిది ధైర్యం**
> **మరి భయమెందుకు?**
> **నీళ్లు చల్లు!**
>
> – పెరుకరాజు,
> నీలగిరి, తమిళనాడు

కస్సున పైకి లేచింది ఆ కరినాగు. అతను అరచిన మరుక్షణం- ఆ కింగ్ కోబ్రా తన పడగను ఒక్కసారిగా వెనక్కి లాగి, వేగంగా ముందుకు కదుపుతూ... బ్రోకర్ స్వామినాథం చేతిపై 'ఫట్'మని వేసింది కాటు.

తలను ఒక పక్కకు వంచి, కన్నుమూసి తెరిచే లోపల తన కోరల్లోనుంచి భయంకరమైన విషాన్ని అతని శరీరంలోనికి 'ఇంజెక్ట్' చేసేసింది.

ఆ దెబ్బకు బ్రోకర్ స్వామినాథం కారులో నుంచి రోడ్డు మీదకు దొర్లిపడ్డాడు. విపరీతమైన భీతితో అతను గజ

గజా వణికిపోతున్నాడు. కళ్ళ ముందు భార్యాబిడ్డలు కనిపించారు. ఊపిరి 'కట్' అయిపోతున్న ఫీలింగ్ కలుగుతోంది.

వేగంగా రియాక్టయ్యాడు కరుణాకర్. సత్వరున తన ఫ్యాంట్ బెల్ట్‌ను బయటికి లాగాడు.

బ్రోకర్ స్వామినాథం చేతినందుకుని, కాటుపడ్డ చోటుకు కొంచెం పైన బెల్ట్‌ను బిగించి కట్టాడు. కింగ్ కోబ్రా కోరలు దిగ బడినట్లుగా ఉన్నాయి రెండు గుర్తులు. ఆ కాటుపడ్డచోట విషం బయటికి వచ్చేలా గట్టిగా పిండేశాడు.

"భయపడొద్దు స్వామినాథం! నీకేం కాదు. మేం వున్నాం!" అంటూ అతనికి మానసిక ధైర్యాన్నిచ్చాడు.

నిజానికి పాముకాటు తిన్న వ్యక్తికి ఈ విధమైన ధైర్యాన్ని అందించడం అతి ముఖ్యం.

కట్లపాము, రక్తపింజేరీ, పొడపాము వంటి విషసర్పాలు కరిస్తే- మనిషి శరీరం లోని రక్తం క్రమక్రమంగా విషపూరితమవు తుంది. కానీ, నాగుపాము విషం మనిషి నాడీ వ్యవస్థను దెబ్బతీస్తుంది. శరీరంలో వుండే.. నాడులన్నీ పారలైజ్ అయిపో తాయి. చివరగా ఊపిరి తిత్తుల నాడులు దెబ్బతిని.. ప్రాణవాయువు పీల్చుకోవడం కష్టమైపోతుంది. ఆ సమయంలోనే నోటిలో నుంచి నురగ బయటికి వస్తుంది. సరిగ్గా ముప్పై నిమిషాల లోపల నాగు పాము కాటు తిన్న వ్యక్తికి, 'యాంటీవీ నమ్' ఇంజెక్షన్ ఇవ్వగలిగితే అతను బతక డానికి అవకాశాలున్నాయి.

ఈలోపల- తను వచ్చిన పని పూర్తియిం దన్నట్లుగా ఆ కింగ్ కోబ్రా నిదానంగా కారులోనుంచి రోడ్డు మీదకు జారి- పక్కనున్న పొదల్లోకి పోబోతూ- ఒక్క క్షణం ఆగి తలతిప్పి- నిర్జీవంగా పడివున్న బ్రోకర్ స్వామినాథాన్ని చూసి- తిరిగి పొదల్లోకి దూరిపోయింది.

కరుణాకర్- స్వామినాథం చేతిపై కాటు పడ్డచోట- నోటితో కూడా బాగా పీల్చి- ఆ రక్తాన్ని బయటికి ఊసేశాడు. ఆ తరువాత కట్టిన బెల్టును కొద్దిగా వదులు చేశాడు.

కానీ, అప్పటికే స్పృహ తప్పాడు బ్రోకర్ స్వామినాథం. కరుణాకర్ అతని బుగ్గలపై తట్టి, తిరిగి మెలకువ తెప్పించాడు.

"మిష్టర్ స్వామినాథం! కళ్ళుతెరు! మమ్మల్ని చూస్తుండు. ఏ మాత్రం కళ్ళు మూసుకోవద్దు!" అని చెప్పి డ్రైవర్ వైపు తిరిగి, "శివా! కారును బాగా చెక్‌చెయ్! లోపల ఇంకేమైనా పాములున్నాయోమో చూడు! టేక్ కేర్!" అంటూ చకచకా ఆర్డర్స్ పాస్ చేశాడు.

తక్షణం డ్రైవర్‌తోపాటు గిరిధర్ కూడా కారు మొత్తాన్ని వెతికారు. డిక్కీ కూడా తెరిచి చూశారు. వారు భయపడినట్లుగా ఎక్కడా పాములేవీ కనిపించలేదు. అదే చెప్పారు కరుణాకర్‌తో!

"కమాన్! క్విక్! డ్రైవర్! కారు స్టార్ట్ చెయ్యి! ఎంత త్వరగా మనం హాస్పిటల్‌కు చేరుకోగలిగితే అంత మంచిది" గిరిధర్, కరుణాకర్ ఇద్దరూ కలిసి బ్రోకర్ స్వామి నాథాన్ని జాగ్రత్తగా ఎత్తి కారులో పడుకో బెట్టారు.

గిరిధర్- కరుణాకర్ కళ్ళలోకి లోతుగా చూపును సారించాడు. ఆ చూపులో కద లాడిన భావాలను కరుణాకర్ అర్థం చేసు కున్నాడు.

"తెలుస్తోంది గిరిధర్! ఈ నాగేశ్వర పురం ఊళ్లో ఈ జమీన్ కొనాలనే ఆలో చన కొద్దో, గొప్పో వుంటే- దాన్ని ఇంత టితో నేను వదులుకుంటున్నాను. ఇపుడు మనం ఈ స్వామినాథాన్ని అర్జెంటుగా దగ్గర్లో వుండే ఏదైనా హాస్పిటల్‌లో జాయిన్ చేసి ఇతని ప్రాణాలు కాపాడాలి. ఇదే మన తక్షణ కర్తవ్యం. కమాన్! హర్రీ అప్!" అన్నాడు.

ఆ మాటలు విన్న గిరిధర్‌కు సంతో

షంతో ప్రాణం లేచి వచ్చింది. డ్రైవర్ తన నైపుణ్యాన్ని చూపించాల్సిన సమయం ఆసన్నమయ్యింది.

కారు శరవేగంగా దూసుకుపోయింది.




**న**గరంలోని ఓ పేరున్న ఆసుపత్రి!

స్ట్రెచర్‌పై బ్రోకర్ స్వామినాథాన్ని పడుకోబెట్టి, అతివేగంగా ఎమర్జెన్సీ వార్డుకు తీసుకుపోయారు.

కింగ్‌కోబ్రా కాటేస్తే ఎక్కేంత విషం, బహుశా ప్రపంచంలో మరే పాము కాటేసినా ఎక్కదేమో? కరుణాకర్ చేసిన ప్రథమ చికిత్స ఎంతో బాగా ఉపయోగపడింది. బ్రోకర్ స్వామినాథం అదృష్టం కూడా బాగుంది. ఎందుకంటే ఆ హాస్పిటల్‌లో విషం విరుగుడికి సంబంధించిన 'యాంటీవీనమ్' ఇంజెక్షన్ల స్టాకు కావల్సినంత ఉంది.

పాము కాటుకు చికిత్స చేయడంలో అక్కడున్న డాక్టర్లకు మంచి అనుభవం ఉన్నట్లుంది. చకచకా అతనికి ట్రీట్‌మెంట్ ప్రారంభించి, దగ్గర దగ్గరగా పదహారు యాంటీవీనమ్ ఇంజెక్షన్లు ఇచ్చారు.

సరిగ్గా రెండు గంటల తరువాత అతని ప్రాణాలకి ప్రమాదం లేదని, ఆపద తప్పిందని డాక్టర్లు ప్రకటించారు.

ఫార్మాలిటీస్ పూర్తిచేసుకుని, స్వామినాథాన్ని ఐసీయూలోనే వదిలిపెట్టి ఇద్దరూ ఆసుపత్రి బయటికి వచ్చారు.

గిరిధర్ ఇంటికి బయలుదేరడానికి సిద్ధమయ్యాడు.

"సార్! మరి నేను ఇంటికి వెళ్ళేదా?"

"సరే గిరిధర్! మీరు ఇంటికి వెళ్ళండి! స్వామినాథం ఫ్యామిలీకి విషయం చెప్పి - వాళ్ళని ఆసుపత్రికి పంపించండి!"

"నేను ఇపుడే స్వామినాథం ఇంటి దగ్గర విషయం చెప్పిన తరువాత - అట్నుంచి మా యింటికి వెళతాను"

"గిరిధర్! జీవితంలో మనం ఈరోజును మరిచిపోగలమా?" శ్వాస దీర్ఘంగా తీసుకుంటూ అడిగాడు కరుణాకర్.

"మరిచిపోవడమా! ప్రాణం ఉన్నంత వరకు జ్ఞాపకం ఉంటుంది సార్!"

"సరే! జాగ్రత్తగా ఇంటికి పోయిరండి! రేపు ఎప్పటిలాగే ఆఫీసుకు వచ్చేయండి!"

"ష్యూర్ సార్! ఆc! మీరు వెళ్ళే దారిలో జమిందార్ దొరైసింగంగార్కి ఫోన్ చేసి, మన ప్రపోజల్ కాన్సిల్ అని చెప్పేయండి!"

"లేదు గిరిధర్! ఈ విషయం డైరెక్టుగా నేను చెప్పేకంటే, నా అసిస్టెంట్‌గా మీరు చెబితేనే బాగుంటుంది"

"రైట్‌సార్! మీ ఆలోచన కూడా బాగుంది. ఇదిగో ఇపుడే మీ ఎదురుగానే ఫోన్ చేస్తాను. సపోజ్! ఆయన ఏదైనా మాట్లాడితే కూడా దానికి తగిన విధంగా సమాధానం చెపుతాను" అన్నాడు గిరిధర్ ఉత్సాహంగా.

తన జేబులో నుంచి సెల్‌ఫోన్ తీసి, జమిందార్ దొరైసింగం మొబైల్‌కు రింగ్ చేశాడు. 'నాట్ రీచబుల్' - అని వచ్చింది.

కొంచెం నిరుత్సాహపడ్డాడు గిరిధర్. "సార్! ఫోన్ కలవడంలేదు. అందుబాటు ఏరియాలో లేదని వస్తోంది. నేను తరువాతైనా ఫోన్ చేసి మాట్లాడతాను. మీరు ఇంటికి బయలుదేరండి" అన్నాడతను.

★ ★ ★

కరుణాకర్‌ను సాగనంపి, ఆటో ఏదైనా

దొరుకుతుందేమోనని రోడ్డు మీదకు వచ్చాడు గిరిధర్.

అంతలో ఒక ఖాళీ ఆటోవచ్చి, అతని ముందాగింది. "ఏం సార్? రమ్మంటారా? " అని అడిగాడు ఆటోవాలా.

ఆ ఆటోపై 'నాగ' అని రాసి వుంది.

"పో.. పోవయ్యా! నీ ఆటోవద్దు.." అన్నాడు గిరిధర్ కంగారు కంగారుగా..

"సార్! పొద్దుట నుంచి ఒక్క బేరం కూడా లేక, అస్సలు బోణీ అవ్వలేదు. మీ మనసుకు తోచినంత ఇవ్వండి సార్! మీరెక్కడికి వెళ్ళాలో చెప్పండి" అన్నాడు ఆటోవాలా బతిమాలుతూ.

టక్కున ఫ్యాంట్ జేబులో నుంచి ఒక యాభైరూపాయల నోట్ తీసి, అతని ముందుకు చాపి, "ఇదిగో బోణీ! ఇక ఇంతటితో నన్ను వదిలెయ్! నువ్వు ఎంత బతిమాలినా.. నేను మాత్రం.. నీ ఆటో ఎక్కను గాక ఎక్కను" అన్నాడు గిరిధర్, మరొకసారి 'నాగ' పేరు వైపు భయం భయంగా చూస్తూ.

'ఇటువంటి గిరాకీలు కూడా వుంటాయా? ' అన్నట్లుగా గిరిధర్ వైపు విచిత్రంగా చూస్తూ - తలపట్టుకుని కూర్చుండిపోయాడు ఆటోవాలా.

బహుశా అతని జీవితంలో ఆటో ఎక్కకుండానే - ఆటోఛార్జి ఇచ్చేసిన మొదటి కష్టమర్ గిరిధరేనేమో!

★ ★ ★

శ్రీమహావిష్ణువు పాన్పు మాదిరిగా వున్న కరుణాకర్ కారు మట్టి, బురద అంటుకుని కుబుసం వదలని నల్లతాచు పాము రంగులోకి మారిపోయింది. కారు వెనుక సీట్లో కూర్చొని - ఆ నగరంలో రోడ్డు పక్కనున్న షాపుల్ని క్యాజువల్‌గా చూస్తున్నాడు కరుణాకర్.

అతని పక్కనే - సీటు మీద జమిందార్ ఇచ్చిన ప్లాస్టిక్ ఫైల్.

ట్రాఫిక్‌ను లాఘవంగా తప్పించుకుంటూ కారు మెత్తగా పరుగెడుతోంది.

## మే - 2015
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **అవధానుల సాయిసుబ్రహ్మణ్యం** - నూజివీడు, కృష్ణా జిల్లా
2. **కె. నాగభూషణం** - మౌలాలి, సికింద్రాబాద్
3. **బి.వి. నరసింహారావు** - పేరాల, ప్రకాశం జిల్లా
4. **జి. జయచంద్ర గుప్త** - బాలాజీనగర్, కర్నూలు
5. **ఎం.వి.ఎస్. మూర్తి** - కొత్తగూడెం, ఖమ్మం జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. రంగయ్య | 6. సీతమ్మ |
| 2. ఝాన్సీ | 7. సుమన్, లావణ్య |
| 3. పన్నెండేళ్లు | 8. ఆదంసాబ్ |
| 4. పెద్దక్క శకుంతల | 9. జో విటాలి |
| 5. సంపూర్ణానందశాస్త్రి | 10. దేవరాజు వేంకట కృష్ణారావు |

కారు ఒక చోట మలుపు తిరుగుతుండగా - సీటు మీదున్న ఫైల్ జారి అతని కాళ్ళ దగ్గర పడింది.

వంగి ఆ ఫైల్ అందుకుని సీటు మీద పెట్టాడు. అపుడు ఆ ఫైల్‌లో నుంచి జారి అతని వడిలో పడింది.. నాలుగు మడతలు పెట్టివున్న ఒక తెల్లకాగితం!

ఆ కాగితాన్ని మడతలు విప్పాడు కరుణాకర్. అది ఒక ఉత్తరం!

ముత్యాలు వరుసగా పేర్చినట్లుగా క

నిపిస్తున్నాయి ఆ అక్షరాలు. చదవడం ప్రారంభించాడు కరుణాకర్.

'మిత్రులు కరుణాకర్‌గార్కి,

నమస్సులు!

నేను పూర్ణిమాదేవిని! జమిందార్ దొ్రై సింగంగారి కూతురు పూర్ణిమాదేవి రాస్తున్న లేఖ.

ధైర్యంగా మా జమీన్ కొనడానికి ముందుకు వచ్చిన మిమ్మల్ని మొదటగా అభినందిస్తున్నాను. ఈ భూములు కొన డానికి వచ్చిన ఎందరో- ఈ నాగేశ్వర పురం నాలుగు కిలోమీటర్ల ల్యాండ్‌లో వున్న నాగుపాములకు భయపడి పారిపో యారు. కానీ, మీరు మాత్రం వాళ్ళ మాది రిగా భయపడకుండా ఈ జమీన్ కొనడా నికే ఒప్పుకున్నారంటే- నాకు చాలా ఆశ్చర్యం కలుగుతోంది.

ఈ జమీన్ అమ్మి నాకు వివాహం చెయ్యాలని మా తండ్రిగారి ఆలోచన.

నేను మా తండ్రిగారి మొదటి భార్యకు పుట్టాను. మా అమ్మగారు ఈ నాగేశ్వరపు రంలోనే పాముకాటు వల్ల చనిపోయారు. ఆ తరువాత మా తండ్రిగారు రెండో పెళ్ళి చేసుకోడానికి ఎంతో శ్రమపడాల్సి వచ్చింది. ఎవ్వరూ పిల్లనివ్వడానికి ముందుకు రాలేదు. ఈ వూళ్ళో వుండే నాగుపాములకు భయపడి, ఈ దేశంలోనే ఆయనకు రెండోభార్యగా రావడానికి ఎవ్వరూ ఇష్టపడలేదు.

మలేషియాలో తెలుగు కుటుంబానికి చెందిన ఒకామె మా తండ్రిగారిని పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకుంది. పోలియా వల్ల ఆమె కాలు కొద్దిగా దెబ్బతింది. అందువల్ల కొంచెం కుంటిగా నడుస్తుంది.

మా పిన్నికి ఇద్దరు మగపిల్లలు పుట్టారు. ఇంతవరకు ఆమె ఈ నాగేశ్వర పురంలో కాలు పెట్టింది లేదు. మా తండ్రి గారు కూడా పిన్నిని ఇంతవరకు ఈ వూరికి తీసుకుని రాలేదు. ఆమెను కూడా పాములు కాటు వేసి చంపేస్తాయేమోనని భయం వల్ల కావచ్చు. అదే సమయంలో ఈ జమీన్ అంతా ఏకమొత్తంగా అమ్మడం సాధ్యం కావడం లేదు. నన్ను ఈ నాగేశ్వ రపురంలో వదిలేసి ఉండడం ఆయనకు ఇష్టంలేదు. అలాగని నన్ను తనతో కూడా సింగపూర్ తీసుకు పోలేకపోతున్నారు. దానికి ముఖ్యకారణం మా కుటుంబానికి వున్న సర్పశాపం.

రెండు దేవతా సర్పాలు నివసించే పుట్టను పడగొట్టి - వాటిని చంపిన పాపమే మా కుటుంబానికి శాపమై - నా టి నుంచి నేటి వరకు వేధిస్తోంది. ఏదో వానపాములాగ ఈ జీవితాన్ని భారంగా లాగుతున్నాం.

రోజూ పూజారి ఒకతను వస్తాడు. పూజలు చేస్తాడు. విభూతి మంత్రించి, నుదుటను పూస్తాడు. ఈవిధంగా చేస్తే- ఆ సర్పాల వల్ల ఆ రోజుకు గండం గట్టె క్కినట్లు. ఇదంతా అయిన తరువాతనే మేం మా దినచర్య ప్రారంభించాలి. అప్పుడు మాత్రమే తినాలి.. నిద్రపోవాలి. పొరపాటున అతను ఏ ఒక్కరోజు రాకపో యినా ఇక ఆ రోజు మాకు తిండి ఉండదు.. నిద్ర ఉండదు.

ఎందుకు ఈవిధమైన నిర్బంధంలో జీవి తాన్ని గడపాల్సి వస్తోందో నాకైతే అర్థం కావడంలేదు. మా తండ్రిగారు వ్యాపార నిమిత్తం ఎక్కువ రోజులు సింగపూర్‌లోనే ఉంటారు. నన్నూ తన కూడా సింగపూర్ కు తీసుకుపొమ్మని- ఈ గృహ చెరసాలలో ఉండలేకపోతున్నానని ఎన్నోసార్లు వేడుకు న్నాను.

కానీ, దానికి పూజారి ద్వారా మా కుల దేవత అనుమతి ఇవ్వాలి. అప్పుడు మాత్రమే ఈ గృహ నిర్బంధం నుంచి బయటపడగలుగుతాను. కానీ, మా కుల దేవత నా మీద దయ చూపడంలేదు. వేరే దారిలేక- ఒక జీవిత ఖైదీలాగ ఈ

# వింత వింత పోటీలు

చతుర సమాచారం

ప్రపంచంలో రకరకాల పోటీలు జరుగుతుంటాయి. వాటిలో కొన్ని పోటీలు అత్యంత చిత్రమైనవి.

★ 1990 నించి అమెరికాలో, యూరప్‌లో వివిధ ప్రదేశాల్లో గడ్డాలని పెంచే 15 రకాల పోటీలని నిర్వహిస్తున్నారు.

★ ఇంగ్లండ్‌లో ఓ కొండ మీంచి 9 పౌన్ల బరువు గల ఛీజ్‌బాల్ కిందకి దొర్లిస్తారు. దాన్ని అనుసరించి, ఫినిష్ లైన్‌లో ముందుగా దాన్ని ముట్టుకున్నవాళ్ళు గెలిచినట్లు.



★ భార్యని భుజాల మీద మోసుకుని అడ్డంకులని దాటి గమ్యానికి చేరే భర్తల పోటీని ఫిన్‌లేండ్‌లో నిర్వహిస్తున్నారు.

★ పిల్లలని గట్టిగా ఏడిపించే పోటీ జపాన్‌లో జరుగుతోంది. వారిని ఏడ్పించే ఈ పోటీ సుమోరెజ్లర్స్ మధ్య జరుగుతుంది.

★ ఇంగ్లండ్‌లో 'వరల్డ్ టోరెజింగ్' పోటీ ఏటా జరుగుతోంది. పోటీదారులు అరిపాదాలతో, వేళ్ళతో పోరాడుతారు.

★ అమెరికాలో, ఆస్ట్రేలియాలో లాన్‌మూవర్ రేసింగ్ పోటీలు తరచు నిర్వహిస్తుంటారు.

★ ఇంగ్లండులో ఏటా గర్నింగ్(మొహాన్ని వికారంగా పెట్టే) పోటీని నిర్వహిస్తున్నారు.

★ అమెరికాలో మిషిగన్ రాష్ట్రంలో అంతర్జాతీయ చెర్రీపిట్ (చెర్రీగింజలని దూరంగా ఉమ్మే)పోటీని నిర్వహిస్తున్నారు. 93.5 అంగుళాల దూరంగా ఉమ్మడం ఇప్పటిదాకా రికార్డు.

★ ఆస్ట్రేలియా డే రోజు స్టోరీబ్రిడ్జ్ హోటల్‌లో బొద్దింకల రేస్‌లని నిర్వహిస్తారు. బొద్దింకలని ఓ బల్ల మీద వదులుతారు. అంచుకి మొదటగా చేరుకునేది గెలిచినట్లు!

★ ఇంగ్లండ్‌లో మంచాన్ని లాగేపోటీలని నిర్వహిస్తున్నారు. చక్రాలమర్చిన మంచం మీద ఒకరు పడుకోగా, నలుగురు తీసుకువెళ్లే ఈ పోటీలో గమ్యస్థానం 2 మైళ్ళు 4 ఫర్లాంగులు.

★ చైనాలో పిల్లలు పాకే పోటీని తరచూ నిర్వహిస్తుంటారు. సగటున 450 మంది పిల్లలు దీంట్లో పాల్గొంటారు.

బతుకు ఈడ్చుకొస్తున్నాను.

సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లో వున్న నేను మిమ్మల్ని ఈరోజు చూశాను. మీ ధైర్యం, మీరు మాట్లాడే విధానం ఎందుకో నన్ను ప్రత్యేకంగా ఆకర్షించాయి. మిమ్మల్ని అభినందించడానికే ఈ లేఖ. అదే సమయంలో మీకు నాదొక విన్నపం.

దయచేసి.. మీరు ఈ జమీన్ కొనవద్దండి!

ఎప్పుడో మా తాతగారు రెండు పాముల్ని చంపినందువల్ల - సర్పజాతి మొత్తం మా కుటుంబం మీద పగబట్టి - ఈ ప్రాంతంలో తిష్ఠవేసుకుని వున్నాయి. ఈ భూముల్ని కొనడానికి వచ్చిన వాళ్లని కూడా అవి వదలడం లేదు. మీ మేలు కోరి చెబుతున్నాను. ఆ నాగుపాముల శాపం మా కుటుంబంతోనే పోనివ్వండి. ఇది తెలియజేయడానికే మీకీ లేఖ రాస్తున్నాను. 'ఈ కంప్యూటర్ యుగంలో కూడా ఇటువంటివి జరుగుతాయా? ' అని సందేహించకండి. మనం ఆశ్చర్యపోయే అనేక సంఘటనలు ఈ నాగేశ్వరపురంలో జరుగుతూ వస్తున్నాయి. వాటినన్నిటినీ కొట్టిపారేసి, మూర్ఖత్వమనుకుని భూమిని

కొనేందుకు ముందుకు వచ్చిన చాలామంది - ఇప్పుడు ప్రాణాలతో లేరు. అర్ధాంత రంగా చనిపోయారు.

ఈ నాగేశ్వరపురంలో వుండే నాగు పాములు తెలివిగా వ్యవహరిస్తున్నాయి. మమ్మల్నందర్నీ భయభ్రాంతుల్ని చేసి వాటికి అణిగిమణిగి ఉండేటట్లుగా చేసు కుంటున్నాయోమో అనిపిస్తోంది.

దానికితోడు కొత్తగా ఎవరైనా వస్తే - వారిని కూడా బెదిరించి పారిపోయేటట్లు చేస్తున్నాయి. మిమ్మల్ని కూడా ఈ పాముల గుంపు భయాందోళనలకు గురి చేసి - కష్టాల్లో పడేస్తాయేమోనని నేను చాలా భయపడుతున్నాను. ఆ భయం తోనే ఈ లేఖ రాస్తున్నాను.

మా తండ్రిగారు ఇచ్చిన ఫైల్‌ను మీరు అసలు పరిగణనలోనికి తీసుకోవలసిన పనిలేదు. ఇంకా నయం, మీరు బేరం సెటిల్ చేసుకోవడం వరకే వచ్చి ఆగారు. అడ్వాన్సు ఇవ్వలేదు.. సంతోషం. ఒకవేళ నాకు తెలియకుండా అడ్వాన్సు ఇచ్చివుంటే - ఈ బేరం కాన్సిల్ చేసుకోండి. మీ మంచిని కోరుకుంటూ,

ఇట్లు,
పూర్ణిమాదేవి'

లెటర్ చదవడం పూర్తిచేసిన తరువాత కరుణాకర్ దీర్ఘ ఆలోచనలో పడ్డాడు.

కొత్తగాలి...

**తనవాళ్లను**
**ప్రేమించడం సహజం!**
**ఎదుటివాళ్లను ప్రేమిస్తే**
**మెరుగైన సమాజం!**

– గు.గో.కృ.
అరసవల్లి

పూర్ణిమాదేవి దయనీయ పరిస్థితి అతని మనసును కదిలించింది. ఆ ఉత్తరాన్ని పదేపదే చదివాడు.

పూర్ణిమాదేవి మనస్సు విప్పి చదువుతు న్నట్లుగా వుంది. ఎంత మంచి మనస్సు! మనిషే కాదు.. ఆమె హృదయం కూడా అందమైందే! తనకు నష్టం జరిగినా కూడా - ఎదుటివారు బాగుండాలనే ఆలోచన - ఆమె ఉన్నత వ్యక్తిత్వాన్ని తెలియజేస్తోంది. ఆమె మీద అతనికి ఒక రకమైన ఆరా ధనా భావం పెరిగింది.

చాలా సేపు ఆలోచించాడు. ఉన్నట్టుండి జేబులో నుంచి సెల్‌ఫోన్ తీసి గిరిధర్‌కు రింగ్ చేశాడు.

"హల్లో! గిరిధర్!"

"చెప్పండి సార్!"

"మీరు నన్ను క్షమించాలి! ఆ జమీన్ విషయానికి సంబంధించి నా నిర్ణయంలో ఒక చిన్నమార్పు"

"ఏమిటి సార్ అది? కొంపదీసి- జమీన్ కొనాలని అనుకుంటున్నారా మళ్లీ? "

"అవును! గిరిధర్! కరెక్టుగా చెప్పారు"

"ఎందువల్ల సార్! మీ నిర్ణయంలో ఈ మార్పు? " కొంచెం కంగారుగా అడిగాడు గిరిధర్.

"జమిందారు మనకిచ్చిన ఫైల్‌లో - ఆయన కూతురు పూర్ణిమాదేవి లెటర్ ఒకటి వుంది. అది చదివిన తరువాత నా మనసు మారింది.

"సార్! చెపుతున్నానని మీరు తప్పుగా అనుకోవద్దు. మీకు గుర్తుందో.. లేదో.. ఒకసారి కారులో వెళ్తూ.. ఒక ఆటో వెనుక రాసి ఉన్న వాక్యం ఒకటి చదివాం. 'నాగుపామునైనా నమ్ము - నవ్వే పడతిని మాత్రం నమ్మకు' - అప్పుడు ఎంత సత్యం ఉంది ఆ మాటలో - అనుకున్నాం"

"అవును! గుర్తుంది. మీరు చెప్పేది వాస్తవమే! కానీ, పూర్ణిమాదేవి నవ్వే ఆడది కాదు. సమస్యల వలలో చిక్కుకున్న అబల. ఆమెను ఆ వలలోంచి బయట

పడెయ్యాలనుకుంటున్నాను. సహాయం చెయ్యాలనుకుంటున్నాను"

"సార్! నేను ఒకమాట సూటిగా అడుగుతాను, చెబుతారా? కోపం తెచ్చుకోకూడదు మరి!"

"అడగండి గిరిధర్!"

"మొట్టమొదటిసారి పూర్ణిమాదేవిని చూసినపుడు మీలో ఏదైనా అలజడి కలిగిందా? ఇపుడు నాకు కలిగిన సందేహాన్ని మీరు నిజం చేయడానికి ప్రయత్నించడం లేదు కదా!"

"సారీ గిరిధర్! మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకుంటున్నారు. ఆమె మీద నాకేదో ప్రేమ కలిగి ఈవిధంగా చేస్తున్నానని అనుకుంటున్నారేమో! ఇది.. వంద శాతం ఆమె మీద నాకు కలిగిన పరితాపం. ఇది నిజం! అందుకే ఈ నిర్ణయం. ఇంకొక విషయం చెప్పనా మీకు? ఆమె నాకు రాసిన లెటర్‌లో ఈ జమీన్ కొనవద్దనే చెప్పింది. అందువల్ల ఎలాంటి ఆపదలు వస్తాయో కూడా వివరించింది"

"సారీ సార్! మీరు ఒక నిర్ణయానికి వచ్చేశారు. ఇక ఇపుడు నేనేం చెప్పినా మీరు వినరు. సరే! కానివ్వండి!"

"థేంక్యూ మిష్టర్ గిరిధర్! జమిందార్‌కు మీరు ఇక ఫోన్ చెయ్యవద్దు. రేపే రిజిస్ట్రేషన్‌కు కావలసిన ఏర్పాట్లు చేసెయ్యండి! ఆ రాతకోతలేవో పూర్తిచెయ్యండి!"

"..........."

"గిరిధర్! ఏం? సమాధానం లేదు? "

"ఒకే సార్!"

"ఉత్సాహంగా చెప్పండి గిరిధర్! ఏమీ జరగదు. ధైర్యంగా ఉండండి!" అని చెప్పి ఫోన్ కట్ చేశాడు కరుణాకర్.

అంతలో అతని బంగ్లాకు చేరుకుంది కారు.

గేటు ముందు నిలిపి - కారు లోపల ఉన్న ఒక ప్రత్యేక హారన్ మోగించాడు డ్రైవర్. ఆ హారన్ సౌండ్ ఫ్రీక్వెన్సీకి - తగినట్లుగా అమర్చిన రిమోట్ కంట్రోల్ సిస్టమ్ ద్వారా గేటు నెమ్మదిగా తెరుచుకుంది. కారు గేటు దాటి కాంపౌండ్ లోపలికి రాగానే తిరిగి ఆటోమేటిక్‌గా గేటు మూసుకుంది.

కారు పోర్టికోలోకి వచ్చి ఆగింది.

సూట్ కేస్‌తోను, జమిందార్ దొరై సింగం ఇచ్చిన ఫైల్‌తోను ఠీవిగా దిగాడు కారులో నుంచి కరుణాకర్. డ్రైవర్ వైపు చూసి "శివా! ఇపుడు నువ్వు ఇంటికి వెళ్లిపో! రేపు ఉదయమే వచ్చి కారు హెడ్ లైట్స్ - అవీ రిపేరు చేయించు. నీట్‌గా వాష్ చేయించు. కారు తిరిగి రీఫ్రెష్ అవ్వాలి. అర్థమయ్యింది కదూ" చెప్పాడు.

"ఓకేసార్!" శాల్యూట్ చేసి డ్రైవర్ వెళ్లిపోయాడు.

చకాచకా అడుగులు వేసుకుంటూ ఇంటి లోపలికి నడిచాడు కరుణాకర్.

గుమ్మంలోనే ఎదురయింది అతని తల్లి శారదాదేవి. నుదుట విభూతి బొట్టు పెట్టి, దానిపై కుంకుమ దిద్దుకుని - మూర్తీభవించిన సరస్వతీదేవీలాగ ఉందామె.

అప్పుడే దేవుని మందిరం నుంచి బయటికి వస్తున్నట్లుగా ఉంది. కుడి చేతిలో వెలుగుతున్న హారతి పళ్లెం. ఎడమ చేతిలో మోగుతున్న గంట. హాలులో బంగారు నగిషీలు చెక్కి ఉన్న నిలువెత్తు వేంకటేశ్వరస్వామి ఫొటోకి హారతి ఇస్తూ - పూజా మంత్రాలు ఉచ్చరిస్తోంది. రెండు పూటలా దేవునికి నిష్ఠగా పూజలు చేయడం ఆమెకు అలవాటు.

"అమ్మా!" ఆప్యాయంగా పిలిచాడు కరుణాకర్.

వెనక్కి తిరిగింది శారదాదేవి.

"రా! నాయనా! హారతి అందుకో! అవునూ! ఇంతకీ వెళ్లిన పని ఏమైంది? "

హారతి కళ్లకద్దుకుంటూ "జమీన్ బాగుందమ్మా! కొంటేనే బాగుంటుందనుకుంటు

న్నాను"

"ఎందువల్ల? "

"అందమైన ఊరు నాగేశ్వరపురం. ఊటీని తలపించే కూల్ క్లైమేట్! ఎంతో బాగుందమ్మా!" ఉత్సాహంగా చెప్పాడు కరుణాకర్.

"వెరీగుడ్! నీకు నచ్చిందన్నమాట!"

"అవునమ్మా! అమ్మా! నిన్ను కొన్ని విషయాలు అడగాలి. నాకు కలిగిన సందేహాలకి నువ్వు జవాబు చెప్పాలమ్మా!" సోఫాలో కూర్చుని, షూస్ విప్పుతూ - తను చెప్పబోయే అసలు విషయానికి ఉపోద్ఘాతం రెడీ చేశాడు కరుణాకర్.

"అడుగు కరుణా! ఏం అడగబోతున్నావు ఇంతకీ? "

కొత్తగాలి...

**కోతి నుంచి మనిషొచ్చాడు**
**నయం!**
**మనిషి నుంచి**
**కోతి రాలేదు!**

– బి. గోవిందరాజు,
మన్యంవారి పాలెం, తూ.గో. జిల్లా

"నేను అడిగే విషయాలన్నీ నీకు నచ్చిన సబ్జెక్టే!"

"ఏంటి కరుణా? నాకు నచ్చిన సబ్జెక్టా? చెప్పు.. చెప్పు!"

"అమ్మా! నాగుపాముల్ని దేవతలుగా పూజించే వారి గురించి నీ అభిప్రాయం..? "

'నాగుపాము' అన్నమాట కరుణాకర్ నోటి వెంట వినబడగానే - శారదాదేవి కొద్దిగా గాభరాపడింది. ఆమె కనుబొమలు ముడుచుకున్నాయి. కానీ కరుణాకర్ అదేమీ గమనించలేదు. షూస్ విప్పుకోవడంలో నిమగ్నమై ఉన్నాడు.

"ఇప్పుడు ఎందుకు ఆ విషయం!"

"నాగేశ్వరపురం జమీన్ బేరం చేయడానికి ఆ ఊరికి వెళ్లానుకదమ్మా! అక్కడ.."

"అర్థమయ్యింది కరుణా! నువ్వు మాట్లాడుతున్న దాన్నిబట్టి చూస్తే మన పారిజాతం చెప్పిన విషయాలు గుర్తుకొస్తున్నాయి"

"పారిజాతం చెప్పిన విషయాలా? ఏమిటమ్మా అవి? "

"ఆ ఊరికి సంబంధించి ఏవో కథలున్నాయని చెబుతుంది. నాగేశ్వరపురంలో నాలుగు కిలోమీటర్ల జమీన్‌లో ఎక్కడ చూసినా నాగుపాములే ఉంటాయట కదా! ఆ ఊళ్లో ఉండడం అందరి వల్ల సాధ్యం కాదట..? "

"ఆ ఊళ్లో అందరికీ పాముల పట్ల విపరీతమైన నమ్మకం, భక్తి ఉన్నాయమ్మా! మనుషులు మాదిరిగానే అక్కడ పాములు సర్వసాధారణంగా సంచరిస్తున్నాయి"

"దానికి చాలా కారణాలు ఉంటాయి. ముఖ్యంగా పాములు ఎక్కువగా పెరగడానికి అక్కడుండే మట్టి పరిస్థితులు కారణం కావచ్చు. చుట్టుపక్కల ఎక్కువగా నీటి గుంటలు, రాళ్లగుట్టలు ఉంటే కూడా పాములు అధికంగా చేరుతాయి. ఎందుకంటే.. నిల్వ ఉన్న నీటి గుంటలలో కప్పలు బాగా ఉంటాయి.

పాములకి కప్పలంటే చాలా ఇష్టం. పాములు నివసించడానికి గుట్టలు, ఇంకా చీమలు పెట్టిన పుట్టలు అనుకూలం. బహుశా ఆ జమీన్ ప్రాంతంలో ఇవన్నీ ఉండి ఉంటాయి"

"కరెక్ట్! కానీ అమ్మా! నువ్వు చెప్పే విషయాలన్నీ జియోగ్రాఫికల్ కారణాలు. అసలు నేనక్కడ విన్న విషయాలు, చూసిన సంఘటనలు పూర్తిగా నమ్మకానికి సంబంధించినవి"

"దానికి కూడా కారణాలు నేను చెప్తాను. ముందు ఒక విషయం చెప్పు

నాకు. నువ్వు ఆ జమీన్ కొనడానికి దీని వల్ల భయపడుతున్నావా? "

"అలాగని కాదు. నాకు అక్కడ ఎదురైన కొన్ని అనుభవాలు- ఎందుకు అనవసరంగా రిస్క్ తీసుకోవడం అనిపిస్తోంది. గిరిధర్ కూడా అదే చెపుతున్నాడు. 'నెమ్మదిగా మన వ్యాపారమేదో మనం చూసుకుందాం సార్! ఎందుకు లేనిపోని చికాకులు తెచ్చుకోవడం' అన్నట్లుగా మాట్లాడుతున్నాడు"

"ఇంతకీ నువ్వు తీసుకున్న నిర్ణయం ఏమిటి? "

"అనేక రకాలుగా ఆలోచించిన తరువాత చివరికి నేను కూడా వద్దని నిర్ణయించుకున్నాను. కానీ ఒక ఉత్తరం నా నిర్ణయాన్ని మార్చేసింది" - అని చెప్పి తన జేబులో భద్రంగా దాచుకున్న పూర్ణిమదేవి రాసిన లేఖను తల్లికి అందించాడు కరుణాకర్.

శారదాదేవి టేబుల్ మీదున్న కళ్లజోడు తెచ్చుకుని ఆ ఉత్తరాన్ని ఆసాంతం ఆత్రుతగా చదివింది. ఆ తరువాత కళ్లజోడు తీసి, మడిచి బాక్సులో పెట్టింది.

"ఏం చెబుతున్నావమ్మా నువ్వు? "

"నువ్వు తీసుకున్న నిర్ణయం సరైంది నాయనా! పాపం.. ఆ అమ్మాయి పూర్ణిమాదేవి.."

"అవునమ్మా! ఈ అమ్మాయిని మొట్టమొదట చూసినపుడే నాకు ఒక రకమైన అభిప్రాయం కలిగింది. ఆకర్షణీయమైన అందం. పాలిష్ పెట్టిన బంగారు దీపపు కుందె మాదిరిగా ఉంటుందమ్మా!" అతను వర్ణించి చెపుతుంటే, శారదాదేవి కూడా అతని ఊహకు తగినట్లుగా - మనసులోనే ఒక రూపాన్ని చిత్రించుకొని పోల్చుకోవడం ప్రారంభించింది.

అప్పుడు సడెన్‌గా ఆమె ఒక విషయాన్ని గమనించింది.

ఒక అమ్మాయి గురించి ఇంత వివరంగా అతను మాట్లాడటం ఇదే మొదటి సారి. పెళ్లి సంబంధాల కోసం కొంత మంది అమ్మాయిల గురించి చెప్పినపుడు అస్సలేమాత్రం ఇంట్రెస్ట్ చూపించలేదు.

అలాంటిది.. ఇపుడు.. తానే స్వయంగా ఒక అమ్మాయి గురించి ఇంత పర్టిక్యులర్‌గా మాట్లాడుతున్నాడంటే - ఆ అమ్మాయి తనకు బాగా నచ్చి ఉంటుందనే కదా అర్థం చేసుకోవాలి.

ఆమె మనసులోపల అనేక ఆలోచనా తరంగాలు.

అందుకే ఆమె "కరుణా! నువ్వు మళ్లీ ఆ ఊరికి ఎపుడు వెళతావు? " అని అడిగింది ఆత్రుతగా..

"ఎందుకమ్మా? "

"ఏమీలేదు! నేను కూడా వద్దామని!"

"నేను కొనబోయే ఆ 'జమీన్ భూమి' ఎలా ఉందో చూడ్డానికా? "

"అవును"

- అతను అన్న 'జమీన్ భూమి' పదాన్ని ఆమె మనసులో 'జమీన్ భామ' గా మార్చుకుంది.

"అదిసరే! అమ్మా! నీకు ఈ నాగేశ్వరపురం పాముల విషయాలు భయం వేయడం లేదా? "

అతను అడిగిన ప్రశ్నకు జవాబుగా ఆమె మందహాసం చేసింది. ఆమె నవ్వులోనే - 'భయం లేదు' అనే సంకేతం.

"నాకు ఆశ్చర్యంగా ఉందమ్మా!"

"అందరి తల్లుల మాదిరిగానే నాగుపాములంటే వెంటనే నేనూ భయపడిపోతానని నువ్వు అనుకున్నావా? "

"నిశ్చయంగా! నాగుపాములంటే ఎవరు భయపడకుండా ఉంటారమ్మా!"

"అవుననుకో! అయితే పామును ఒక విషపురుగుగా చూసేవారు మాత్రమే భయపడుతుంటారని నా ఉద్దేశ్యం"

"మరి.. అది.. ఒక విషపురుగే కదమ్మా? "

"సరే! మరి అదే పాము విషం నుంచి

మనుషుల్ని కాపాడే మందుల్ని తయారుచేస్తున్నారు కదయ్యా!"

"ఇంతకీ నువ్వు ఏం చెప్పబోతున్నావమ్మా? "

"పాము విషపురుగు కాదు. అది శక్తికి చిహ్నం. ఆ విషయం తెలుసా నీకు? "

"ఇదేదో కొత్త నిర్వచనం లాగుందే!"

"ఇది బాగా పాత విషయమే. నువ్వు మొట్టమొదటగా వింటున్నావు. కాబట్టి నీకు కొత్తగా ఉండి ఉండవచ్చు"

"నువ్వు చెప్పేది చూస్తూంటే - పాములకి సంబంధించి మనం తెలుసుకోవల్సినవి, అర్థం చేసుకోవల్సినవి చాలా విషయాలున్నట్లుగా తెలుస్తోంది"

"అవును! చాలా!"

"నీకు ఈ విషయాలన్నీ ఎలా తెలుసమ్మా? ఓс! నీ రీసెర్చ్‌టాపిక్ అదేకదా! మర్చిపోయాను"

శారదాదేవి సెంట్రల్ యూనివర్శిటీ ప్రొఫెసర్. అంతేకాదు జువాలజీ డిపార్ట్‌మెంట్ హెడ్. సైకాలజీలో కూడా డాక్టరేట్ పట్టం తీసుకుంది. అష్టాదశ పురాణాలు, శాస్త్రాలు, ఇతిహాసాలు, వేదాలు ఇలా ఎన్నో గ్రంథాలు క్షుణ్ణంగా చదివిన విజ్ఞానఖని.

ఆమె రాసిన ఎన్నో అద్భుత వ్యాసాలు ప్రపంచంలో ప్రసిద్ధి చెందిన మేగజైన్స్‌లో ప్రచురితమై - విపరీతమైన పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టాయి.

శాస్త్రీయ దృక్పథంతో పాటు అపార భక్తి ప్రపత్తులు కలిగివున్న పరిపూర్ణ హిందూ మహిళ.

"అది సరే! మన వంశానికే ఒక పేరుంది. అదేమిటో నీకు తెలుసా? " అడిగింది ప్రొఫెసర్ శారదాదేవి.

"వంశం పేరా! మనుషులకి పేరు మాదిరిగా వంశానికి కూడా పేరు వుంటుందా? "

"నాయనా కరుణా! ప్రతి వంశానికి - వారి వారి వంశావళి పేర్లు తప్పనిసరిగా వుంటాయి. మన పూర్వీకులు - ఆయా వంశాలకు సంబంధించిన పేర్లు చెప్పే వుంటారు. ఈ ఆధునిక కాలంలో రాను రాను వాటిని మరిచిపోతున్నారు. కాలక్రమంలో అవి మరుగున పడిపోతున్నాయి. నేను 'చెంచినాడ సిద్ధపురుష' వంశానికి చెందిన దానిని. 'చెంచినాడ' ఊరు పేరు. మా ముత్తాతలలో ఎవరి పేరో 'సిద్ధపురుష' అయ్యుండవచ్చు. అదేవిధంగా మీ నాన్నగారు 'దుద్దుపూడి నాగ నంజుండేశ్వర' వంశానికి చెందినవారు"

"అర్థమయిందమ్మా! దుద్దుపూడి మా పూర్వీకుల ఊరి పేరు. మా వంశ మూల పురుషుడి పేరు 'నాగ నంజుండేశ్వర' అంతేకదా!"

"అవును ఇదేవిధంగా అన్ని కుటుంబాలకి తప్పనిసరిగా వంశం పేరు ఉంటుంది. ఇంతకీ మీ వంశ మూలపురుషుడికి 'నాగ నంజుండేశ్వర' పేరు ఎలా వచ్చిందో తెలుసా? "

"మా పూర్వీకులు ముత్తాతలలో ఎవరి పేరో 'నాగ నంజుండేశ్వర' అయియుండవచ్చు"

"అది మాత్రమే కాదు. కొన్ని వందల సంవత్సరాలకు ముందు మీ పూర్వీకులకు చెందిన ఈ మూలపురుషుడు 'మేఘమలై జమిందారు' ఆస్థానంలో సకల కళాధికా

**కొత్తగాలి...**

**అతితిండితో ఊబకాయం**
**కష్టిస్తే ఒళ్లు మాయం**
**లేకుంటే రోగాలు ఖాయం!**

– రాకి,
చాగల్లు, ప.గో. జిల్లా

రిగా వుండేవారు. ఒకరోజు జమిందారు ఉంగరాన్ని ఎవరో దొంగిలించేశారు. అది చాలా ఖరీదైన వజ్రాలతో తయారుచేసింది. ఆ నేరం మీ ముత్తాతగారి మీద పడింది. ఎందుకంటే ఆ వజ్రాల ఉంగరం మీ ముత్తాతగారి సంచిలో దొరికింది. ఆ నేరం ఆయన మీదికి రావాలనే ఆ విధంగా చేశారు ఎవరో! అది ఎవరనేది మీ ముత్తాత గారికి తెలిసింది. కానీ ఆధారాలు లేనందువల్ల ఏమీ మాట్లాడలేకపోయారు. జమిందారు ఆయనకు శిక్ష విధించాడు. 'ఏ చేతితో అయితే నువ్వు దొంగతనం చేశావో- ఆ చేతిని పాము పుట్టలో పెట్టాలి' అని ఆమేరకు జమిందారు మీ ముత్తాతగారిని ఆజ్ఞాపించాడు"

శారదాదేవి చెప్పిన ఆ మాట వినగానే కరుణాకర్‌లో కుతూహలం పెరిగింది. "ఆ తరువాత..? " కొంచెం ముందుకు వంగి ఆత్రుతగా అడిగాడు.

"మీ ముత్తాత కొంచెం కూడా బెదిరిపోలేదు. ఆయన జమిందారును ఒక విషయాన్ని మాత్రం అడిగారు. 'ఈ శిక్ష నేను సంతోషంతో స్వీకరిస్తున్నాను. తప్పు చెయ్యని నన్ను ఆ నాగరాజు కచ్చితంగా శిక్షించడు. అదే సమయంలో నా సంచిలో వజ్రాల ఉంగరాన్ని వేసింది ఎవరో నాకు తెలుసు. అతను కూడా నాతోపాటు పాము పుట్టలో చెయ్యి పెట్టాల'ని కోరారు. జమిందారు 'ఎవరతన'ని అడిగారు. 'అతను ఎవరో కాదు జమిందారు బంధువులలో ఒకడు. అతను మీ ముత్తాతగారి దగ్గర అసిస్టెంట్‌గా పనిచేస్తున్నాడు. అతని పేరు విన్న జగ్గన్న' అని చెప్పారు. ముందు జగ్గన్న బుకాయించడానికి ప్రయత్నించాడు. 'తను అటువంటి పని చెయ్యలేద'ని చెప్పాడు. 'నువ్వు కాదు చెప్పాల్సింది.. నాగదేవత చెప్పాలి' అన్నాడు జమిందారు. 'పాము పుట్టలో చెయ్యి పెడితే ఎవరినైనా కాటు వేస్తుంద'ని చెప్పాడతను.

అప్పుడు 'నీతోపాటు నాగ నంజుండేశ్వర కూడా చెయ్యి పెడుతున్నాడు కదా! మన మేఘమలై శివాలయం పుట్టలో దేవతా సర్పం వుంది. నువ్వు నిరపరాధివైతే ఆ పాము నిన్నేమీ చెయ్యదు. ఏ తప్పూ చెయ్యనపుడు ఎందుకు భయపడతావు' అని అడిగాడు జమిందారు.

అందరూ కలిసి శివాలయం పుట్ట దగ్గరకు వెళ్లారు. ఒకపక్క మీ ముత్తాతగారు పుట్టలో చెయ్యిపెట్టారు. జగ్గన్న కూడా పుట్టలో చెయ్యి పెట్టాడు.

తప్పుచేసిన జగ్గన్నకి పాము కాటు తప్పలేదు. అదే పాము మీ ముత్తాతగారి చేతి పైకెక్కి విన్యాసాలు చేసింది కానీ, కాటు మాత్రం వేయలేదు. చనిపోతూ తన తప్పు ఒప్పుకున్నాడు జగ్గన్న. జమిందారుకు నిజం తెలిసింది"

"అమ్మా! ఈ విషయాలన్నీ ఇంతకు ముందెప్పుడు నాకెందుకు చెప్పలేదమ్మా!" అడిగాడు కరుణాకర్.

"అవసరం వచ్చినప్పుడే కదయ్యా ఏ విషయమైనా బయటికి వస్తుంది" చిరునవ్వుతో చెప్పిందామె.

"తరువాత ఏ జరిగిందమ్మా!" కుతూహలంగా అడిగాడు కరుణాకర్.

"ఏ జరుగుతుంది! మీ ముత్తాతగారు మంచివారని పేరు వచ్చింది. అప్పుడు చెప్పారు.. ఆయన ఒకమాట- 'మా కుటుంబంలో ఎవ్వరినీ పాములు ఏమీ చెయ్యవు. పదిమందికీ మంచి చేసే ఆస్తీక మునివర్యుని గోత్రానికి చెందినవారం మేం' అని. అప్పట్నుంచి మన వంశం పేరు 'దుద్దుపూడి నాగ నంజుండేశ్వర వంశంగా పేరుపొందింది. మీ ముత్తాతల, తాతల కాలం నుంచి మన వంశం వారు నాగదేవతను కులదైవంగా కొలుస్తూ వస్తున్నారు ఇప్పటిదాకా.."

"అమ్మా! అయితే మన వంశంతో



నాగుపాములకు ఎప్పటినుంచో బంధం ముడిపడి వుందన్నమాట"

"మీ తాతగారు ఫణీశ్వర్రావుగారు నాగ దేవతకు మహాభక్తులు, గొప్పకవి. ఆయన మనవడివి నువ్వు. నాగ నంజుండేశ్వర వంశానికి చెందిన నిన్ను ఏ పాము ఏమీ చెయ్యదు. ధైర్యంగా ముందడుగు వెయ్యి. ఇంకా చెప్పాలంటే నాగేశ్వరపురం, జమీన్‌లో నువ్వు చెయ్యబోయే బిజినెస్ నీకు మంచి పేరు, సంపద తెచ్చిపెడుతాయి"

శారదాదేవి నమ్మకంగా చెప్పిన ఆ మాటలు కరుణాకర్‌లో నూతనోత్సాహాన్ని నింపాయి.

"అమ్మా! నువ్వు మా ముత్తాతగారి గురించి చెప్పేటపుడు ఆస్తీకముని గోత్రం మనదని చెప్పావు. ఎవరమ్మా ఆయన? "

"ఒకప్పుడు ఈ లోకంలో సర్పజాతి సమూలంగా తుడుచుపెట్టుకుపోయే పెను ప్రమాదం ఒకటి సంభవించింది. సరిగ్గా ఆ సమయంలో సర్పజాతిని భయం కరమైన ఆ ఆపద నుండి కాపాడిన మహోన్నతుడు ఆస్తీక మునివర్యుడు"

"అదెలాగమ్మా? "

"పాండవుల వంశాంకురం - పరీక్షన్మహారాజు ఒకరోజు వేటకు వెళ్ళి అక్కడ తపస్సు చేసుకుంటున్న శమీకుడనే మునిని చూశాడు. ఆ ముని పరీక్షిత్తును పట్టించు కోలేదు. మహరాజునైన నన్నే పట్టించుకోడా? అని కోపంతో రెచ్చిపోయి చచ్చిపోయిన పామునొకదానిని ఆ ముని మెడలో వేసి, తిరిగి వచ్చేశాడు పరీక్షిత్తు. తరువాత అక్కడికొచ్చిన ఆ ముని కొడుకు



శృంగి. జరిగిందంతా గ్రహించి, తపస్సు చేసుకుంటున్న తన తండ్రి మెడలో చచ్చిన పామును వేసిన పరీక్షిత్తు, పాము కాటుతోనే చావాలని శపించాడు. ఆ శాప ప్రభావంతో పరీక్షన్మహారాజు తక్షకుడనే పాము కాటుతో చనిపోయాడు. దాంతో పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు లోకంలో వుండే మొత్తం సర్పజాతినే నాశనం చేయడానికి కంకణం కట్టుకుని 'సర్పయాగం' చేశాడు. ఆ యాగ ప్రభావం వల్ల లక్షలకు లక్షలు సర్పాలు యాగ గుండంలో పడి కాలిపోసాగాయి. అది అలాగే కొనసాగితే లోకంలో ఒక్క సర్పం కూడా మిగిలేది కాదు. సరిగ్గా అదే సమయంలో 'ఆస్తీక ముని' తన తెలివితేటలతో జనమేజయుని సర్పయాగాన్ని ఆపించి సర్పజాతిని ఆ ఘోర విపత్తు నుంచి రక్షించాడు. సర్ప జాతి ప్రాణాలతో నిలవడానికి ముఖ్యకారకుడయ్యాడు. ఆ విధంగా మొత్తం సర్పజాతికి ఆస్తీకముని పూజనీయుడయ్యాడు. ఆ మునిగోత్రమే మనది"

"ఇదంతా మన పురాణ ఇతిహాస గ్రంథాలలో ఉందా?"

"అవును అందులోనిదే ఆస్తికముని వృత్తాంతం. ఆ మునే మీ గోత్ర పురుషుడు కావడం విశేషం. అసలు మన ధార్మిక గ్రంథాలలోనే పాములకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. పాల సముద్రం చిలకడానికి తాడుగా ఉపయోగించింది వాసుకి అనే సర్పం. పాల సముద్రంపై శ్రీమహావిష్ణువు పాన్పుగా ఉపయోగించింది ఆదిశేషువు అనే సర్పం. సుబ్రహ్మ

ణ్యస్వామి కాళ్ల దగ్గర పాము, శివుని మెడలో పాము, వినాయకుని నడుం చుట్టూ పాము.. ఈవిధంగా దేవుళ్లతో పాటు సర్పాలకు కూడా పూజనీయమైన స్థానం ఇచ్చారు. ఇక్కడ మనం ఆ భక్తి వెనుక వున్న పాముల ప్రాధాన్యాన్ని అర్థం చేసుకోవాలి"

"అయితే పాములు దైవమేనా? "

"సర్పాలు దైవ సమానమైనవని తరాలుగా వస్తున్న నమ్మకం. వీరబ్రహ్మేంద్ర స్వామి వంటి యోగ, సిద్ధపురుషులు - మన శరీరంలోనే పాము రూపంలో కుండలినీ శక్తి వుంటుందని వివరించి చూపారు. సర్వక్రియలకి ఆధారభూతమైంది మన శరీరంలో ఏమిటో తెలుసా? వెన్నుపాము. అది పాము ఆకారాన్నే పోలి వుంటుంది"

"అమ్మా! నీ లాజిక్ బాగానే వుంది. కానీ.. పాములతో మన జీవాణువుకు సంబంధం కలపడం - ఎందుకో నాకు నమ్మబుద్ధి కావడంలేదు" కరుణాకర్ ఆధునిక విజ్ఞానిలాగ మాట్లాడాడు.

"ఈ లోకంలో కొన్ని విషయాలు లాజిక్‌కు అందవు కరుణా! వాటిని మనం మన నమ్మకాలతో ముడిపెట్టి అంగీకరించక తప్పదు. మన కంటికి కనపడేదే నిజమని నమ్మితే ఎలా? కన్నులు గ్రహించలేని ఎన్నో విషయాల్ని ఈనాడు యంత్రం చూపిస్తోంది. ఒకప్పుడు మంత్రం ఆ పనులు చేయగలిగేది!"

"అంటే మంత్రాలకు చింతకాయలు రాలే శక్తి ఉందంటావా? "

"ఎందుకు లేదనుకుంటావు? శక్తిమంతమైన శబ్దాల్ని ఒక క్రమపద్ధతిలో లయబద్ధంగా నిబద్ధించి వాటిని ఒక స్థాయిలో చక్కని మాడ్యులేషన్‌తో ఉచ్చరించడమే మంత్రం. అపుడా శబ్దతరంగాలు - విద్యుత్ తరంగాలుగా మారి - టార్గెట్‌ను కరెక్ట్‌గా వెళ్లి తాకినప్పుడు అది ఫలిస్తుంది. దానికి నియమనిష్ఠలతో కూడిన సాధన కావాలి. వాక్కుకు ఈవిధంగా శక్తి ఉందని ఒక సైంటిస్ట్ ఒక చిన్న ప్రయోగం ద్వారా నిరూపించాడు"

"ఎవరమ్మా అతను? "

"అతని పేరు నాకు గుర్తులేదు. ఆ సైంటిస్ట్ ఏం చేశాడంటే.. తన రెండు అరచేతులలోను సమానంగా యాసిడ్ చుక్కలు వేసుకుని గాయాలు చేసుకున్నాడు. కుడి చేతిని వెనక్కి పెట్టి - ఎడమ అరచేతిని ముందుకు తెచ్చి, 'నా ఎడమ చేతిలోని గాయం త్వరగా మానిపోవాలి' అని ఏకాగ్రతతో రోజుకు కొన్నివేలసార్లు శ్రుతి బద్ధంగా ఉచ్చరించాడు. చిత్రంగా అతని ఎడమ చేతిలోని గాయం నలభైఎనిమిది గంటలలో తగ్గిపోయింది. కుడిచేతిలోని గాయం మానడానికి వారం రోజులు పట్టింది. ఈవిధంగా మన వాక్కుకు శక్తి ఉందని ఈ ప్రయోగం ద్వారా అతను నిరూపించాడు. పూర్వకాలంలో శాపాలు - వరాలు ఇటువంటి వాక్‌శక్తి వల్లనే ఫలించి ఉంటాయి"

"అయితే పాముల శాపం వల్లనే పాపం పూర్ణిమాదేవికి ఇంకా పెళ్లి కాలేదంటావా అమ్మా!"

"పాముల శాపానికి - పూర్ణిమాదేవి పెళ్లికి ముడిపెట్టడం - ఎందుకో అంతగా అంగీకరించడానికి మనసొప్పడం లేదు"

"నేను చూసిన కొన్ని సంఘటనలు లాజిక్‌కు అందకపోయినా - అంగీకరించక తప్పడం లేదమ్మా!"

"ఏమిటవి? "

"నడిరోడ్డు మీద పడగెత్తి పాములు నిలబడినప్పుడు వాటికి కర్పూరం హారతి ఇచ్చి మొక్కినపుడే అవి దారి వదిలాయ్"

"ఓ.. అదంతా కూడా జరిగిందా? "

"జరిగిందా..! ఊరికి వచ్చే పోస్ట్‌మాన్ చేతిలో తపాలా వుంటుందో? - వుండదో? తెలియదుగానీ, కర్పూరం, అగ్గి

పెట్టె మాత్రం తప్పనిసరిగా వుంటాయి. నాగేశ్వరపురం నాలుగు కిలోమీటర్లు ఊళ్లోకి ప్రవేశించడానికి సరిహద్దులో వున్న నాగశిలకు మొక్కకపోతే వారికి పెద్ద ఆపద తప్పదు. దారి వదలకుండా రోడ్డుకు అడ్డంగా నిలబడి ఉన్న నాగుపాము పైకి మన బ్రోకర్ స్వామినాథం జీపును ఎక్కించి చంపేశాడు. దానికి బదులుగా ఆ పాము తరపున ఇంకో పాము బ్రోకర్ స్వామినాథాన్ని వెతుక్కుంటూ వచ్చి కాటు వేసింది. అందువల్ల ఇప్పుడు అతను ఆసుపత్రి పాలయ్యాడు ఈ సంఘటలన్నీ కలిపి చూస్తే నువ్వు చెప్పిన పురాణ కథల కంటే ఇక్కడి ఉదంతాలు విచిత్రంగా వున్నాయి. వీటిలో ఏది నిజమో? ఏది అబద్ధమో? తెలియడంలేదు"

కరుణాకర్ అడిగిన విషయాలు- శారదా దేవిని దీర్ఘాలోచనలో పడేశాయి. కళ్ళు మూసుకుని ఆలోచించసాగింది.

"ఏం అమ్మా? నేను అడిగిన ప్రశ్నలు నీకు గందరగోళంగా కనిపిస్తున్నాయా? "

"లేదు కరుణా! పాముల వల్ల మనం చనిపోయినా, మనవల్ల పాములు చనిపోయినా అదంతా విధి నిర్ణయం. పాములు పగపట్టవు. ఇంకా చెప్పాలంటే- అది మన చేతిలో దెబ్బతిని చనిపోయేటపుడు 'పాపి! నన్ను చంపేశావు కదరా!' అని కూడా ఆలోచించలేదు. కానీ, దాన్ని చంపి పాపం చేశామని మనసు లోపల మనకు ఒక రకమైన బాధ వెంటాడుతూ వుండిపోతుంది"

"తప్పనిసరిగా.."

"మన మనసు లోపల వున్న ఆ ఆలోచనే ఆ పని చేయిస్తుంది. దానికి అంత శక్తి ఉంటుంది"

"నువ్వు చెప్పేది సరిగ్గా అర్థం కాలేదు"

"సపోజ్! జమిందారు కుటుంబం పాముల్ని కొట్టి చంపి వుండొచ్చు 'అవి

ఎందువల్ల చనిపోయాయో' అని యోచన చేసేంతటి మేధస్సు మిగిలిన పాములకు ఉండదు. అంతేగాదు, ఏ పరిస్థితులలోను-పాములు తామే జేమ్స్‌బాండ్ అనుకుని వెతికి, వెతికి హంతకుల్ని పట్టుకుని - బలికి బలి తీసుకోవు. పాముల పట్ల మనిషి ఆలోచన 'అలా జరుగుతుం దేమో?' అని వున్నందు వల్ల - ఏం జరిగినా దానికి కారణం అదే అయివుండొచ్చని అనుకుంటాం. అదే మన బలహీనత"

"కానీ, బ్రోకర్ స్వామినాథాన్ని ఒక పాము వెంటాడి వచ్చి కాటు వేసిందే?"

"అది కచ్చితంగా వెంటాడి వచ్చిన పాము కాదు. మీ కారు రోడ్డు పక్కన బురదలో కూరుకుపోయి - చాలా సేపు వుండిపోయింది కదా! ఆ సమయంలో ఏదైనా పాము లోపలికి దూరి వుండొచ్చు"

"సరేనమ్మా! నేను నాగశిలకు మొక్కకుండా ముందుకు పోయినందువల్ల నా కారు బురదలో పడిపోయింది. మన అసిస్టెంట్ గిరిధర్ ఆ నాగశిలకు మొక్కిన మరుక్షణం బురదలో నుంచి కారు బయటపడింది. దీనికి నువ్వేం చెబుతావు?"

"చాలా సింపుల్! మీకు జరిగిన ఆ అనుభవాలు కూడా కాకతాళీయం!"

"జమీను కొనడానికి వచ్చిన వారందరూ పాము కాటువల్లనే చనిపోయారు?"

"అదీ యాదృచ్ఛికమే!"

"అదెలాగమ్మా? ఒకేచోట జరిగిన వేర్వేరు సంఘటనలన్నీ కాకతాళీయం ఎలా అవుతాయి? ఒకటి జరగొచ్చు లేదా రెండు జరగడానికి అవకాశం ఉంది. అంతే కానీ అన్నీ..?"

"అయితే సందేహమే లేదు. ఎవరో మనుషులు పథకం ప్రకారం చేస్తున్న పనులు ఇవి!"

శారదాదేవి టక్కున ఆ విధంగా చెప్పేసరికి కరుణాకర్ ఒక్కక్షణం నివ్వెరపోయి

## చతుర ప్రవేశిక

### జూన్ చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. నాగేశ్వరపురం జమీన్ కొనాలనుకున్నదెవరు? | 6. కరుణాకర్ తల్లి? |
| జ. | జ. |
| 2. బ్రోకర్ పేరు? | 7. 'విధివిన్యాసాలు' నవలా రచయిత్రి? |
| జ. | జ. |
| 3. గిరిధర్ ఎవరు? | 8. మధుమతి తల్లిపేరు? |
| జ. | జ. |
| 4. జమీందారు పేరు? | 9. లలిత మామయ్య? |
| జ. | జ. |
| 5. పూర్ణిమాదేవి ఎవరు? | 10. లలిత అక్క కూతురు? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------------వయసు (    )

చిరునామా: ----------------------------------------------------

----------------------------పిన్‌కోడ్ :            ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

చూశాడు.

"అమ్మా! ఏంటమ్మా! కొంచెం కూడా ఆలోచించకుండా ఇలా అనేశావు? "

"ఇందులో ఆలోచించడానికి ఏముంది? కొన్ని సంవత్సరాలుగా నేను పాముల మీద పరిశోధన చేస్తున్నాను. వాటి ప్రవ ర్తన ఏవిధంగా ఉంటుందో- క్షుణ్ణంగా నేను అర్థం చేసుకుంటూ వస్తున్నాను కూడా. అతీతశక్తులు, అదృశ్యరూపాలు పాములకి ఉంటాయనుకోవడం ఈ నవీనకాలంలో లాజిక్‌కు అందని అంశాలు. నా రీసెర్చ్ పరిధికి రాని విషయాలు"

"అయితే నాగేశ్వరపురం ఊరు పాముల కంట్రోల్‌లో లేదంటావామ్మా? "

"నాగేశ్వరపురమే కాదు పూర్ణిమాదేవి పెళ్లి కూడా పాములు- వాటి శాపాల అధీనంలో లేవు. నేను ఈమాట ఛాలెం జ్‌గా తీసుకుని చెబుతున్నాను. ఏ పాముల శాపం వల్ల- తన కూతురుకు పెళ్లి కూడా జరగదని ఆ జమిందారు అను కుంటున్నాడో- అతడే గనుక తన కూతు రిని నీకు ఇవ్వడానికి ఒప్పుకుంటే, ఆ అమ్మాయిని నా కోడలుగా తెచ్చుకోవడానికి నేను తయారు. ఏ పాముల శాపం లేదని నేను ఈ విధంగా ప్రాక్టికల్‌గా చేసి చూపి స్తాను.. నిరూపిస్తాను"

అటుతిరిగి- ఇటుతిరిగి టాపిక్- పూ ర్ణిమాదేవి దగ్గరకు వచ్చి ఆగేసరికి- కరుణా కర్ ముడుచుకుపోయాడు.

"అమ్మా..!"

"నీకు ఆ అమ్మాయి నచ్చింది కదూ!"

"అది.. అది.. అసలు.."

"ఒరేయ్! నాయనా! నీళ్లు నమలొద్దు. కట్ అండ్ రైట్‌గా చెప్పు? "

"చాలా బాగా నచ్చిందమ్మా!"

"అయితే! ఇంకేం మాట్లాడి ముగిం చేద్దాం"

"నీ ఇష్టమే నా ఇష్టమమ్మా!"

"ఈ విషయంలో నీవేమీ భయపడటం లేదు కదా!"

"నాకు నువ్వున్నావ్! నువ్వు ఉండగా నాకెందుకమ్మా భయం? "

"ఇదిచాలు కరుణా! నేను ఇపుడు నీకు ఒక మహామంత్రాన్ని ఉపదేశిస్తాను. ఆ మంత్రాన్ని మనసుకు బాగా పట్టించుకుని సాధ్యమైనంత ఎక్కువసార్లు జపిస్తూ సాధన చెయ్యి"

"సరేనమ్మా!" కరుణాకర్ ఉత్సాహంగా అంగీకరించగానే శారదాదేవి వడివడిగా పూజ గదిలోకి వెళ్లింది.

తిరిగి వచ్చేటపుడు ఆమె చేతిలో ఓ పెద్ద గ్రంథం. దానిపై "పద్దెనిమిది పురాణాలు" అని ఉంది.

ఆ గ్రంథంలోని శక్తి పురాణంలో పరీ క్షిత్తు రాజు కథ ఉన్న సర్గను తెరిచిం దామె. అందులో ఉన్నది- ఆస్తీకముని ఉపదేశించిన సంస్కృత మూలమంత్రం.

"నాయనా! కరుణా! నేను చెప్పబోయే ఈ మంత్రం నిజమైంది. మహత్తరమైంది. ప్రతిరోజూ ఈ మంత్రాన్ని ఎవరైతే నియమ నిష్ఠలతో జపిస్తారో- వారిని ఏ సర్పమూ ఏమీ చెయ్యదని తరాలుగా వస్తున్న నమ్మకం"

"అంతటి మహిమ గల మంత్రమా అమ్మా ఇది? "

"అవును! జాగ్రత్తగా విను"

'జరత్కారో జరత్కార్వామ్
సముత్పన్నో మహాయశా
ఆస్తీక సత్యసంధో మామ్
పన్నగేంద్రో భిరక్షత్
అపసర్ప సర్ప భద్రంతే
దూరం గచ్ఛ మహాయశా
జనమేజయ యజ్ఞాంతే
హ్యాస్తీక వచనం స్మరణ్..!!'

అని శారదాదేవి మంత్రాన్ని చక్కని ఉచ్చారణతో శ్రుతిబద్ధంగా చదివింది.

కరుణాకర్ కూడా ఆ మంత్రాన్ని అలాగే పఠించి, మనసులో పదిలపరచుకున్నాడు.

"ఈ మంత్రాన్ని రోజుకు ఒకసారి పఠించినా చాలు కరుణా! అయితే ఏకాగ్రతతో, భక్తితో పఠించాలి. చాలా శక్తిమంతమైన మంత్రం ఇది. ఈ మంత్ర ప్రభావం వల్ల పాముల నుంచి నువ్వు ఎల్లవేళలా రక్షింపబడుతూ ఉంటావు"

"నిజమా అమ్మా? "

"కొన్ని విషయాలకి అనుభవమే సమాధానం చెబుతుంది"

"ఓకే అమ్మా! మనం నాగేశ్వరపురం వెళ్దాం. అక్కడే కొంతకాలం ఉందాం. అప్పుడే కదా ఇది పాముల శాపమా? లేదా మనుషుల పాపమా అనేది వివరంగా తెలిసేది"

"అలాగే! నువ్వు ఎవరు కారణం? అనేది కనిపెట్టు. నేను నా కోడల్ని కనులారా చూసుకుంటా!"

"అమ్మా! జమిందారు సింగపూర్‌కు పోయి, అక్కడే సెటిలవ్వాలనే మూడ్‌లో ఉన్నారు. ఒకవేళ ఆయన అంతస్తు, కులం అనే ఆలోచనలేమైనా పెట్టుకుంటే మనం సరితూగగలమా? "

"నీకేం తక్కువ కరుణా? అంతేకాదు ఊరే వద్దనుకుని ఇంతకాలం పెళ్లికాకుండా ఉండిపోయిన అమ్మాయిని- పిల్లనడగడానికి వెళ్లడమే పెద్ద విషయం. కచ్చితంగా జమిందారు ఈ పెళ్లికి ఒప్పుకుంటారనే నా అభిప్రాయం"

శారదాదేవి అపార నమ్మకం పెట్టుకుని ఉంది.

'విచిత్రంగా ఎక్కడో ప్రారంభించిన విషయం ఎక్కడికో పోయి ఆగింది' అనుకున్నాడు కరుణాకర్. పాములకు సంబంధించిన పురాణకథలు అమ్మ చెప్పినప్పటికీ- అవన్నీ నాగేశ్వరపురంతో సంబంధం కలపకుండా- అక్కడ జరిగే సంఘటనలన్నీ మనుషుల పథకం అని తేల్చి చెప్పిన అంశం కరుణాకర్‌ని అనేక ఆలోచనల్లో పడేసింది.

అయితే, అనూహ్య సంఘటనలు అక్కడ జరగబోతున్నాయని మాత్రం అతని ఊహకు అందలేదు.




**శా**రదాదేవి, కరుణాకర్ ఇద్దరూ కారులో నాగేశ్వరపురం బయలుదేరారు. వెళ్లేదారిలో కరుణాకర్- గిరిధర్‌కు ఫోన్ చేశాడు.

"హల్లో! గిరిధర్!"

"గుడ్ మార్నింగ్ సార్!"

"వెరీ గుడ్‌మార్నింగ్ మిస్టర్ గిరిధర్! ఇపుడు నేను నాగేశ్వరపురం వెళుతున్నాను. ఆఫీసుకు రావడం కష్టమే..! ప్లీజ్ టేక్ కేర్!"

"ఓకే సర్! ఏమిటి సర్! సడన్‌గా నాగేశ్వరపురానికి? "

"ఏం గిరిధర్! భయపడుతున్నారా? "

"ఎలా సార్ భయపడకుండా ఉండటం? మనకు జరిగిన అనుభవాలు ఒక్కొక్కటీ గుర్తుకు తెచ్చుకుని చూడండి సార్ ఒక్కసారి!"

"నిజమే..! ఆ విషయాలు మరపురానివి. భయపడాల్సినవి. కానీ.. అమ్మ కొంచెం కూడా భయపడటంలేదు మరి!"

"అదే సార్! నాకు కూడా చాలా ఆశ్చర్యంగా ఉంది!"

"ఇన్‌ఫాక్ట్! నాగేశ్వరపురం పోయి జమిందారును చూద్దామని చెప్పిందే అమ్మ! ఇపుడు అమ్మ నా కూడా కారులో

వస్తోంది"

"ఇదింకా ఆశ్చర్యంగా ఉంది సర్! అడుగుతున్నానని తప్పుగా అనుకోవద్దండి! మనకు ఎదురయిన సంఘటనలన్నీ అమ్మకు చెప్పారా? లేదా? "

"ఒక్కటి కూడా వదలకుండా అన్నీ చెప్పాను. నన్ను నమ్మండి!"

"అయితే.. అమ్మ భయపడక పోవడానికి కారణమేమిటి? "

"అదేమిటో డైరెక్టుగా మీరే అడగండి, అమ్మకు ఇస్తున్నాను ఫోన్" కరుణాకర్ ఫోన్ శారదాదేవికి ఇచ్చాడు. "అమ్మా! లైన్‌లో గిరిధర్ ఉన్నారు, మాట్లాడు"

"ఏం బాబు గిరిధర్! ఎలా ఉన్నావు? "

"బాగున్నానమ్మా! మీరెలా ఉన్నారు? "

"బాగున్నానయ్యా! అయినా నాకేం తక్కువ. వృత్తిలో చక్కగా పైకి వస్తున్న కొడుకు. అతనికి అన్నివిధాలా సహాయ సహకారాలందిస్తున్న నీలాంటి మంచివాడు. అంతకంటే ఇంకేం కావాలి? "

"అది అలా ఉంచండమ్మా! ఈ నాగేశ్వరపురం జమీను విషయంలో మీరు ఇంట్రెస్ట్ చూపించడం నాకు సర్‌ప్రైజ్‌గా ఉందమ్మా!"

"ఏమయ్యా! పాము అంటే వెంటనే భయపడి.. బయటకు రాననుకున్నావా? "

"అది కాదమ్మా! నాగేశ్వరపురంలో పాములకు సంబంధించిన విషయాలు అర్థం కానివెన్నో ఉన్నాయి. అందువల్ల ఆ విధంగా మాట్లాడాను"

"అవేమిటో తెలుసుకోవాలనే నేను బయలుదేరాను"

"ఎందుకమ్మా అనవసరంగా! ఇంతకంటే ముఖ్యవిషయాలు మనకు ఉండగా!"

"నా వరకు- ఇది కూడా ఒక ముఖ్యమైన విషయమే గిరిధర్! పాముల గురించి ఈ లోకంలో అనేక నమ్మకాలు ఉండొచ్చు. కానీ, నా దృష్టిలో అది ఒక శక్తిస్వరూపం. ఇంకా చెప్పాలంటే సర్పం మా కుటుంబానికి కులదైవం"

"అందువల్ల ఏ ప్రాబ్లమ్ రాదనుకుంటున్నారా? "

"అవును బాబూ! అందులో ఏమిటి సందేహం? "

"లేదమ్మా! మీ నమ్మకాన్ని తక్కువ చేసి మాట్లాడుతున్నానని దయచేసి మీరు అనుకోకపోతే, నాకెందుకో మీరు.. మీరు.."

"మూర్ఖంగా ప్రవర్తిస్తున్నానంటావు! అంతేనా? "

"అవునమ్మా! ఇది ప్రాణంతో చెలగాటం. పాము కాటు తిన్న బ్రోకర్ స్వామినాథం ఇంకా పూర్తిగా కోలుకోలేదు. ఇప్పటికీ ఆసుపత్రిలోనే ఉన్నాడు"

"అతని విషయం అలా వుంచు! కానీ కరుణ విషయం వరకు ఏ విధమైన రిస్క్ జరగదు. అలాగని ఏదో తక్కువ రేటుకు జమీను వస్తోంది కదా..! దానిని కొనడానికి వెళుతున్నానని అనుకుంటున్నావా కొంపదీసి..? "

"అయితే.. వేరే ఆంతర్యం ఏదైనా ఉందా అమ్మా? "

"కచ్చితంగా! ఈ జమీను తీసుకుని- దానిలో పూలతోటలు వేసి, వ్యాపారం చేయడమనేది మీకు ముఖ్యం. చెప్పాలంటే నా వరకు వేరే విషయం ఒకటి ఉంది. అది ముఖ్యం"

"అదేంటమ్మా? "

"చెబుతాను! నాగేశ్వరపురం జమిందారును- అతని కుమార్తె పూర్ణిమాదేవిని చూసిన తరువాత చెబుతాను"

"అర్థమయ్యిందమ్మా! మీరు మా బాస్‌కు అమ్మాయిని చూడ్డానికి వెళుతున్నారు. అవును కదూ? "

అంత సడన్‌గా గిరిధర్ ఆ మాట చెప్పేసరికి శారదాదేవికి ఆశ్చర్యం కలిగింది.

"ఫర్వాలేదే గిరి! నీ బుద్ధి చాలా చురుగ్గా పనిచేస్తోంది"

"అమ్మా! జాగ్రత్తమ్మా! ఆ అమ్మాయి

చాలా అందంగానే ఉంటుందమ్మా! మా బాస్‌కు సరైన జోడీ కూడా! కాకపోతే.. జమిందారు కుటుంబం వెనుక ఏదో పెద్ద రహస్యమే ఉందనిపిస్తోంది. పాముల శాపంలో చిక్కుకుని అల్లాడిపోతున్నారు వారందరూ.."

"అన్నీ తెలుసుకోడానికి, అర్థం చేసుకోడానికే కదా ఈ ప్రయాణం"

మంచిదమ్మా! అన్నీ బాగా జరిగితే సరి, కానీ మరొక్కసారి చెపుతున్నాను, చాల జాగ్రత్తగా వుండండి" చెప్పాడు గిరిధర్.

శారాదాదేవి - గిరిధర్ అడిగిన ఏ ప్రశ్నకు చలించకుండా, మనో నిబ్బంరంతో సమాధానమిచ్చింది.

శారాదాదేవి ఫోన్ కట్ చెయ్యగానే అన్నాడు కరుణాకర్ "ఏమ్మా! గిరిధర్ బాగా భయపడిపోతున్నా డనుకుంటాను"

"అవునయ్యా! జాగ్రత్త అని పదేపదే చెబుతున్నాడు. అంతేకాదు, ఎందుకు అనవసరమైన రిస్క్ అంటున్నాడు"

"ఊరూ వాడా భయపడిపోతుంటే- అతను మాత్రం భయపడకుండా వుంటాడా? అవునూ! జమిందారును, ఆయన కూతుర్ని చూసిన తరువాత చెబుతానని అంటున్నావే- ఆ మాత్రం హింట్ చాలదా అమ్మా మా అసిస్టెంట్ అల్లుకుపోవడానికి"

"విషయం చూచాయగా చెప్పడంలో తప్పు లేదుగా!"

శారాదాదేవి సంభాషణ చాల కాజువల్‌గా మార్చేసి, కారు విండోలోంచి బయటకు చూడడం ప్రారంభించింది.

అదే సమయంలో కారు తారు రోడ్డును వదిలి నాగేశ్వరపురం వెళ్లే మట్టి రోడ్డువైపు తిరిగింది.

నాగేశ్వరపురం 4 కి.మీ.

శిలాఫలకం మీద చెక్కిన అక్షరాల్ని మనసులో చదువుకుంది శారదాదేవి.

గాలిలో చల్లదనం పెరిగింది.

"ఏసీ ఆపకూడదూ! బయట వాతావరణానికి కారు లోపల మరీ చల్లగా వుంది" అందామె.

ముందు సీట్లో కూర్చుని వున్న కరుణాకర్ ఏసీ ఆఫ్ చేశాడు.

"అమ్మా! నాగేశ్వరపురం జమీన్ ఇక్కడి నుంచే ప్రారంభమవుతుంది" చెప్పాడు కరుణాకర్.

అంతలో నాగశిల వున్న ప్రదేశాన్ని సమీపించింది కారు. యథాప్రకారం ఎవరో ఒకరిద్దరు కర్పూరం వెలిగించి, ఆ నాగశిలకు మొక్కి, వారి దారిన వారు పోతున్నారు.

కొంచెం దూరంలో వున్న ఒక చిన్న వంతెన తిన్నెమీద వయస్సు మళ్లిన పెద్దాయన ఒకతను, చేతిలో కర్ర పట్టుకుని, కూర్చొని తాపీగా చుట్ట కాల్చుకుంటున్నాడు.

"అమ్మా! ఈ నాగశిల- ఈ నాగేశ్వరపురం పొలిమేర నాగదేవత. ఈ వూరు లోపలికి వచ్చేవారు, పోయేవారు ఈ నాగశిలకు మొక్కి రావాలి, పోవాలి. అలా గౌరవించకపోతే పాముల వల్ల ఆపద కలుగుతోంది. వారి పని ఏదీ జరగదు" క్లుప్తంగా ఆ నాగశిల వెనుక వున్న కథను వివరించాడు కరుణాకర్.

కారును ఆపమని చెప్పి, డోర్ తెరచి కిందకు దిగింది శారదాదేవి. నాగశిల దగ్గరకు వెళ్లి, రెండు చేతులు జోడించి, కళ్లు మూసుకొని భక్తితో నమస్కరించింది.

ఇదంతా గమనిస్తూనే వున్నాడు.. తిన్నె మీద కూర్చొని వున్న ఆ ముసలాయన.

తిరిగి కారు ఎక్కి బయలుదేరి, అతన్ని దాటి ముందుకు పోతుండగా కరుణాకర్ అతన్ని చూశాడు.

సరిగ్గా అదే సమయంలో...

ఆ ముసలాయన తన చేతిలోని కర్రను కారుకు అడ్డంపెట్టాడు, ఆపమన్నట్లు.

కారు ఆగింది. "ఏంటి పెద్దాయనా? "

కరుణాకర్ తలను బయటపెట్టి అడిగాడు.

"నువ్వు నిన్ననో.. మొన్ననో ఈ వూరికి వచ్చినట్లున్నావు కదా నాయనా? "

"అవును!"

"ఫర్వాలేదే! ధైర్యంగా మరలా తిరిగి ఈ వూరికి వస్తున్నావు!"

"ఊరన్న తరువాత వస్తుంటారు, పోతుంటారు. దానికీ ధైర్యానికీ ఏమిటి సంబంధం? "

"నీ కూడా వచ్చిన వాళ్లలో ఒకతను భయంకరంగా పాము కాటుకు గురయ్యాడు. అది మర్చిపోయావా నాయనా? "

"అందువల్ల...? "

కొత్తగాలి...

**స్నేహం చిగురించాలంటే**
**ఒక్క చిరునవ్వు చాలు!**
**జీవితం వెలిగిపోవాలంటే**
**ఒక్క మిత్రుడు ఉంటే మేలు!**

– గిరిపట్ల,
మణికొండ, హైదరాబాద్

"ఏం? ఎందుకు ఈవిధంగా ఆపదల్ని వెతుక్కుంటూ వస్తున్నారు మీరు? " అడిగాడు ఆ ముసలాయన.

వెంటనే ఏం సమాధానం చెప్పాలో అర్థం కాలేదు కరుణాకర్‌కు. ఆ పెద్దాయనను అపుడు మొదటిసారి పరిశీలనగా చూశాడు.

అటు తరువాత మౌనంగా కారును ముందుకు పోనివ్వమని సైగ చేశాడు డ్రైవర్‌కి కరుణాకర్.

"ఏ పనీపాటా లేకుంగా ఈవిధంగా ఏదో ఒకటి మాట్లాడేవాళ్లని అస్సలు పట్టించుకోకూడదు. ఇలాంటివాళ్లు అవతలవాళ్లని తమ మాటల ద్వారా సైకలాజికల్‌గా దెబ్బతీయడానికి ప్రయత్నిస్తుంటారు" అంది శారాదాదేవి, ఆ ముసలతన్ని క్లోజ్‌గా పరిశీలిస్తూ..

కారు నెమ్మదిగా వేగం పుంజుకునే సమయంలో దారికి అడ్డంగా ఆ మట్టి రోడ్డు మీద బ్రహ్మాండమైన రెండు నాగుపాములు పగడవిప్పి నిలబడి వున్నాయి. అకస్మాత్తుగా ఆ దృశ్యాన్ని చూసి శారదాదేవి కొంచెం తోట్రుపాటుకు గురైంది. ఆశ్చర్యపోయింది కూడా.

కరుణాకర్ మాత్రం అలాంటి దృశ్యాన్ని ఇంతకుముందు చూసివున్నాడు. కాబట్టి ఏమాత్రం కంగారు పడలేదు. సరికదా చిరునవ్వుతో.. "చూశావా అమ్మా! ఇది ఆరంభం మాతమే! ఆ జమిందారు బంగ్లాకు పోయి తిరిగి వచ్చేలోపల ఇంకెన్ని పాముల్ని చూడవలసి వస్తోందో చెప్పలేం. అంతేకాదు ముందు ముందు ఈ పాములవల్ల మనకేం జరుగుతుందో కూడా చెప్పలేం" అంటూ కారును ఆపించాడు కరుణాకర్.

"ఇలా దారికడ్డుగా ఒక నాగుపాము నిలబడిందనేగా బ్రోకర్ స్వామినాథం తన జీప్‌ను దాని మీదకు ఎక్కించేశాడు. దానికి బదులుగా ఇంకొక నాగుపాము తరుముకుంటూ వచ్చి కారులోపలే కాటువేసింది. మరి మనం ఇప్పుడేం చేద్దాం అమ్మా? " తిరిగి అడిగాడు కరుణాకర్.

"సింపుల్! మనం వీటిని దారి వదలమని మొక్కితే సరిపోతుంది"

"పోస్ట్‌మాన్ చేసింది అదే కదా! ఈ వూరికి వచ్చేవారి దగ్గర ఏం వున్నా లేకపోయినా ఖచ్చితంగా చేతిలో కర్పూరం వుండి తీరాలన్నమాట!

"నువ్వు ఏ అర్థంలో చెప్పినాసరే..! వీటిని ఇప్పుడు మనం పూజించినందువల్ల మనకు తగ్గిపోయేదేమీలేదు" అంది శారదాదేవి.

చెప్పినట్లుగానే ఆమె, కూడా తెచ్చుకున్న

అ
క్ష
రం

ఏ నినాదం వెనుక
ఎవరి ప్రయోజనాలు దాగున్నాయో
తెలుసుకోలేనంతకాలం
ప్రజలు మోసపోతూనే ఉంటారు

– లెనిన్



కర్పూరం, అగ్గిపెట్టెతో కారు దిగి తిన్నగా పడగ విప్పి ఆడుతున్న ఆ నాగుపాముల సమీపానికి పోయి నిలబడింది. కర్పూరం తీసి వెలిగించింది.

ఆమె పెదవులు ఆస్తీకముని మంత్రాన్ని జపిస్తున్నాయి. ఆమె రెండు చేతులూ భక్తి పూర్వకంగా నమస్కరిస్తున్నాయి. ఆమె మనసు కులదైవమైన నాగదేవతను స్మరిస్తోంది.

మరీ అంత దగ్గరగా నిలబడివున్న శారదాదేవిని చూసి కరుణాకర్ కొంచెం గాభరాపడ్డాడు.

ఒకవేళ పాములు రెండూ ఆమె మీదకు దాడిచేస్తే..? - ఆ ఊహే భరించలేకపోయాడు.

చటుక్కున వంగి ఆ రోడ్డు మీద దొరికిన రెండు రాళ్లను చేతిలోకి తీసుకున్నాడు. అవసరం వస్తే- వాటిమీద సూటిగా విసరడానికి.

అయితే ఆ రాళ్లను ఉపయోగించాల్సిన అవసరం అతనికి కలుగలేదు.

ఆ పాములు రెండూ ఆమె భక్తికి కట్టుబడినట్లు- నెమ్మదిగా పక్కకు తొలగి పొదల్లోకి వెళ్లిపోయాయి.

కరుణాకర్ ఆశ్చర్యం వేసింది.

శారాదాదేవి సంతోషంతో తిరిగి వచ్చింది. "డ్రైవర్! కారు తీయ్!" అందామె.

"అమ్మా! చూశావా! కర్పూరం వెలిగించగానే ఆ పాములు ఎంత సైలెంట్‌గా ఒదిగి ఒదిగి వెళ్లిపోయాయో!" అన్నాడు కరుణాకర్.

"ఓసి పిచ్చివాడా! కర్పూరం వెలిగించినందుకు కాదు. ఒక విషయం చెప్పనా? ఈ నాగేశ్వరపురం నాలుగు కిలోమీటర్ల దూరం ఎంతో ప్రశాంతంగా వుంటుంది. ఎప్పుడో వచ్చే ఒకటి రెండు వాహనాల చప్పుడుకి అవి డిస్టెర్బ్ అవుతున్నాయి. ఆ సమయంలో రోడ్డుమీదికి వచ్చిన సర్పాలు స్వేచ్ఛకి భంగం కలగగానే తమ పడగ విప్పి బుసలు కొట్టడం సహజం. అటువంటప్పుడు మనం వాహనాలు నిలిపి వాటి సమీపానికి వెళ్లి కర్పూరం వెలిగించి వాటి చుట్టూ తిప్పగానే ఆ కదలికల్ని అనుసరిస్తూ, అవి కొంత నెమ్మదించి పక్కకి తొలిగిపోతున్నాయి. అది గమనించడానికే నేనావిధంగా చేశాను. నాగస్వరం ఊదేటప్పుడు- ఆ శబ్దాన్ని కాకుండా పాముల వాడి నాదస్వరం కదలికల్నే అనుసరిస్తాయి. ఇక్కడ కూడా అదే జరిగిందన్నమాట!" వివరించింది శారాదాదేవి.

కారు తిరిగి బయలుదేరింది.

గాలి చాలా చల్లగా శరీరాలకు తగులుతోంది. కారు విండోలోంచి బయట ప్రదేశాన్ని మౌనంగా గమనిస్తోంది శారదాదేవి.

"ఈ నేలంతా నాగేశ్వరపురం జమీన్‌కు సంబంధించిందే! ఇందులోనే పూల తోటలు వేయాలని ఆలోచన. కానీ, జమిందారు కూతురు ఈ ల్యాండ్ కొంటే మంచిది కాదని చెబుతోంది. అదే..! ఆ లెటర్ నువ్వు కూడా చదివావు కదమ్మా!"

"అది ఆమె మనసు ఎంత మంచిదో తెలియజేస్తోంది. తమ ల్యాండ్ కొనేవాళ్లకి ఏ విధమైన కీడు జరగకూడదని ఆలోచిస్తున్నదంటే ఆమె మనసు నవనీతం"

"అవునమ్మా! మనిషి ఎంత అందమైన దో ఆమె మనసు కూడా అంతే అందమైన దని అర్థమవుతోంది"

అతడు తన్మయత్వంతో చెప్పిన విధా నాన్ని గమనించి తనలో తాను మెల్లగా నవ్వుకుంది శారదాదేవి.

అయితే అది అతని దృష్టిని దాటిపో లేదు. "ఏమ్మా! నవ్వుతున్నావు? "

"నీ ఇష్టాన్ని మరింత స్పష్టంగా- కవిత్వ పరంగా చెబుతుంటే.." టక్కున ఆమె ఆ విధంగా అనేసరికి కరుణాకర్ కొంచెం తడ బడ్డాడు.

"ఓకే! ఓకే! సపోజ్! నేను నచ్చలేదని ఆ అమ్మాయి చెబితే.."

"కరుణా! ఎప్పుడైతే ఆ అమ్మాయి నీ మీద శ్రద్ధ తీసుకుని లెటర్ రాసిందో, అప్పుడే నాకు ఆమె మనసు తెలిసిపో యింది కన్నా!"

"అమ్మా! నువ్వు ఏమిటేమిటో చెబుతు న్నావు! ఈ వూరి విషయంలోగానీ, ఆ అమ్మాయి విషయంలోగానీ నీ ప్రవర్తన ఆశ్చర్యంగా వుంది. నిన్ను ధైర్యశాలిని అని అనాలో, లేదా బుద్ధిశాలిని అని చెప్పాలో తెలియడంలేదు" అతను మెచ్చుకోలుగా అన్నాడు.

ఆమె మందహాసం చేసింది. అంతలో కారు గుడిసెలు వేసి వున్న ప్రదేశానికి వచ్చింది.

"నాయనా కరుణా! ఇదంతా జమీన్ ఏరియా అంటున్నావు. ఇక్కడ చూస్తే చాలామంది గుడిసెలు వేసుకుని కాపురాలు ఉంటున్నట్లున్నారు? "

"వీళ్లంతా ఈ స్థలం ఖాళీగా వుంది కదా అని గుడిసెలు వేసుకుని కాపురం వుంటు న్నారు! రేపు ఇది మనం కొని పూలతో టలు వేసేటప్పుడు - ఈ ప్రదేశం అంతా ఖాళీ చేయించి ఇస్తానన్నారు జమిందారు. అదీగాక మనకు 'మాన్‌పవర్' అవసరమ యితే వీళ్ళు ఏమైనా ఉపయోగపడతా రేమో చూద్దాం!" సాలోచనగా అన్నాడు కరుణాకర్!

"మంచి ఆలోచన కరుణా! వీళ్లంతా అమాయక జనంలా కనిపిస్తున్నారు. ఇలాంటి వాళ్లకి ఏదో ఒక పని ఇచ్చి - ఉపాధి కల్పిస్తే కొన్ని కుటుంబాలు బతుకు తాయి కదా!"

దూరంగా నాగేశ్వరపురం ఊరు లీలగా కనిపిస్తోంది. ఖరీదైన ఆ కారు మెత్తగా ఆ ఊరివైపు పరుగిడుతోంది.

★ ★ ★

నాగేశ్వరపురం.

కారు నాగేశ్వరపురం ఊరు లోపలికి ప్రవేశించింది. ఎప్పటిలాగే ఆ ఊరి ప్రజల ముఖాలలో ఆశ్చర్యం తొంగిచూసింది.

కారు తిన్నగా జమిందారు బంగ్లా దగ్గ రకు దూసుకుపోయింది. కారును చూడ గానే గుర్తుపట్టి వాచ్‌మాన్ బ్రహ్మాండమైన ఆ గేటును గబాగబా తెరచి, శాల్యూట్ చేశాడు.

కారు గేట్‌లోనుంచి పోయి కోటవంటి జమిందారు బంగ్లా ముందు ఆగింది. ఎందుకో బంగ్లా మీదికి వచ్చిన పూర్ణిమా దేవి - కారు శబ్దం విని కిందకు చూసింది.

కరుణాకర్, అతని వెనుక శారదాదేవి కారులో నుంచి దిగడం చూసి - ఆశ్చ ర్యంతో ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

ఆమె ఎదురు చూడని దృశ్యం అది!

శారదాదేవి చేతిలో తన కూడా తెచ్చిన పెద్ద వెండి పళ్ళెం.. ఆ పళ్ళెంలో నిండుగా పువ్వులు, పండ్లు..

తల్లీకొడుకులిద్దరూ జమిందారు బంగ్లా లోపలికి ప్రవేశించారు. వీరి రాకను చూసి, జమిందారు దొరై సింగం ఆశ్చర్యపోయి - గబాగబా వాళ్లకి ఎదురు వచ్చారు.

"రండి కరుణాకర్! రండమ్మా!" జమిం దారు సాదరంగా ఆహ్వానించారు.

"జమిందారుగారూ! ఈమె మా అమ్మ గారు - పేరు శారదాదేవి. యూనివర్శిటీ

ప్రొఫెసర్"

"ఓ! ప్రొఫెసర్ శారదాదేవిగారా! పత్రికలలో మీ ఆర్టికల్స్ చదివాను. సంతోషం. నమస్కారమమ్మా!"

"నాగేశ్వరపురం జమిందారుగారికి నా హృదయపూర్వక నమస్కారాలు!"

"అరె! నేనిపుడు జమిందారును కాదమ్మా! జమిందారు పరంపర ఎప్పుడో ముగిసిపోయింది. జమిందారు వంశ వారుసుడిని మాత్రమే!"

"అయినప్పటికీ - జమిందారు మన్నన, మర్యాద ఎక్కడికి పోతాయి?"

"అది వాస్తవమే! రండమ్మా లోపలికి రండి! కూర్చోండి!" హాలులో వున్న పెద్ద సోఫా చూపించాడు జమిందారు దొరై సింగం.

శారదాదేవి తన చేతిలో వున్న పువ్వులు, పండ్లు పళ్ళెంతో సహా జమిందారుకు అందించింది.

వాటిని అందుకుంటూ పూర్ణిమాదేవిని పిలిచాడాయన.

అప్పుడే పై నుంచి కింది దిగి - హాలు లోనికి ప్రవేశిస్తోందామె.

"పూర్ణిమా! ఇటురా తల్లీ! అమ్మా! ఈమె నా కూతురు. పేరు పూర్ణిమాదేవి!" అంటూ పరిచయం చేశాడు జమిందారు దొరై సింగం, తన చేతిలో వున్న పళ్ళెం - కూతురుకి అందిస్తూ.

శారదాదేవి తల తిప్పి పూర్ణిమాదేవిని చూసింది.

'కళ్ళు చెదిరిపోయేంతటి అందాల రాశి! పురాణాలలో వర్ణించిన అతిలోక సౌందర్యవతులు - రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ ఎలా వుంటారో తెలియదుగానీ, వాళ్ళ నలుగురిని కలగలిపి ఒకటిగా చేర్చి - పూర్ణిమాదేవిని సృష్టించి వుంటాడు ఆ

అ
క్ష
రం

**చే**యకుండానే చేశాననేవాడు అధముడు
కొద్దిగా చేసి కొండంత చేశానని చెప్పేవాడు గర్వపోతు
ఎంతో చేసి కొంచెమే చేశానని చెప్పేవాడు సజ్జనుడు

*– ఆదిశంకరాచార్య*



బ్రహ్మా!' అనుకుంది శారదాదేవి మనసులో.

వినయంగా నమస్కరించింది పూర్ణిమా దేవి.

"దీర్ఘాయుష్మాన్‌భవ! నీ పేరూ అందంగా వుంది. దానికి మించి అందంగా వున్నావు నువ్వు" మనస్ఫూర్తిగా మెచ్చుకుంది శారదాదేవి.

జవాబుగా పూర్ణిమాదేవి ఒక చిన్న నవ్వు నవ్వి వూరుకుంది. అదే సమయంలో కరుణాకర్ వైపు ఒక్కక్షణం చూసి, చూపులు తిప్పుకుంది.

ఆ చూపులలోని భావాన్ని అర్థం చేసుకుని, గుంభనంగా నవ్వుకున్నాడతను.

"ఏమిటి మిష్టర్ కరుణాకర్? అమ్మగారు ఈ భూములను చూడాలనుకున్నారా? అందుకనే మీ కూడా పిల్చుకుని వచ్చారా? " నవ్వుతూ అడిగారు జమిందారు దొర్రై సింగం.

"అవును.. అవునండి..!"

"మీరు తిరిగి ఈ నాగేశ్వరపురం వస్తారని మేం అసలు ఊహించలేదు"

"అరె! భలేవారే! ఈ జమీన్ కొంటానని మొదట్నుంచీ చెబుతూనే వున్నాను కదా!" ఉత్సాహంగా బదులిచ్చాడు కరుణాకర్.

"కావచ్చు! కానీ ఇక్కడ వుండవయ్యా..! అని ఎంత చెప్పినా వినకుండా బయలుదేరిపోయిన బ్రోకర్ స్వామినాథం పాము కరిచి, ఆసుపత్రిపాలయ్యాడు. అది చూసి కూడా తిరిగి రావడానికి మీరు సిద్ధంగా వుంటారా? అని.."

"అవునండి! తలచుకుంటే ఇప్పటికీ గుండె గుభిల్లుమంటోంది"

"అదే కదా! నేను కూడా పోవద్దయ్యా! పరిహార పూజలు - అవీ చేసిన తరువాత పోదువుగానీ - అని నెత్తీనోరు కొట్టుకుని చెప్పాను. వినలేదు. నాతో ఒక్కమాట కూడా చెప్పకుండా ఎప్పుడు వెళ్ళిపోయాడో? ఇక్కడ్నుంచి బయలుదేరిపోయాడు. ఇప్పుడు ఆసుపత్రిపాలయ్యాడు. అదే కదా నా బాధ" కొంచెం నిష్ఠూరంగా మాట్లాడారు జమిందారు దొర్రై సింగం.

"ఏదైతేనేం! ప్రాణాపాయం తప్పింది అదిచాలు"

"అలా మీరనుకోవడం పొరపాటు మిష్టర్ కరుణాకర్!" జమిందారు ఏదో చెప్పడానికి సంశయించారు.

"ఏమిటి? జమిందారుగారూ! మీరేదో చెప్పడానికి ఆలోచిస్తున్నారు! ఫర్వాలేదు చెప్పండి"

"అదేమిటంటే.. మిష్టర్ కరుణాకర్! ఆ బ్రోకర్ స్వామినాథాన్ని కాపాడడం సాధ్యం కాదు"

"ఏమిటి..? మీరు... మీరు... మాట్లాడేది? "

"అతనికి బాగా తగ్గి - ఇంటికి వచ్చినా కూడా మామూలుగా జీవించడం వీలు కాదు. మగ పాము చచ్చిపోయినా ఆడ పాము అతణ్ణి వదలదు"

"లేదండి! ఆ విధంగా జరగదు జమిందారుగారూ! మీరు ధైర్యంగా వుండండి!" చెప్పింది శారదాదేవి, మధ్యలో కల్పించుకుంటూ.

జమిందారు దొర్రై సింగం ఆమె వైపు విచిత్రంగా చూశారు.

"అయ్యా! నా మాటలు మీరు నమ్మలేక పోతున్నారు కదూ!"

"అది కాదమ్మా! ఈ మాట మిష్టర్ కరుణాకర్ అంటే నేను అంతగా ఆశ్చర్యపోయే వాడిని కాను. ఈ కాలం పిల్లలు ఈ శాపాలు - పాపాలు ఇవేమి నమ్మరు. కానీ మీరు.. అంటుంటే.."

"మీ ఉద్దేశం..? "

"మీరు కొంచెం కూడా భయపడకుండా ఈ విధంగా మాట్లాడుతున్నారంటే.. నాకు ఆశ్చర్యంగా ఉందమ్మా!"

"దానికి కారణం వుంది జమిందారు గారూ!"

"ఏమిటా కారణం? నేను తెలుసుకో వచ్చా? "

శారదాదేవి - కరుణాకర్‌కు అతని పూర్వీకుల కథ అంతా చెప్పినట్లుగా - జమిదారుగారికి వివరంగా చెప్పి, "పాములు పగపడతాయని చెప్పేదంతా అబద్ధం. ఈ విషయం మీకు చాలా క్లియర్‌గా సాక్ష్యాలతో ఎప్పుడైనా, ఎక్కడైనా నిరూపించగలను. అందుకనే మీకు, కరుణాకర్ ముత్తాతల కథ చెప్పాను"

శారదాదేవి చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా విన్నాడు జమిందారు దొరై సింగం. ఆయన ముఖంలో తీవ్ర సంఘర్షణ. ఏదో దీర్ఘంగా ఆలోచించసాగాడు.

అదే సమయంలో-

సింహద్వారం సమీపంలో డమరుకం ధ్వని వినవచ్చింది. యథాప్రకారం ఆ ధ్వని జమిందారుగారి ఆస్థాన పూజారి వస్తున్నాడని సంకేతం.

ఈలోపల పూజారి - చేతిలో ప్రసాదాలతో హాలులోనికి ప్రవేశించాడు.

"ఒక్క నిముషమమ్మా!" అంటూ జమిందారు చటుక్కున లేచి గబాగబా ఆ పూజారికి ఎదురు వెళ్ళి, ఆ ప్రసాదాలను భక్తితో అందుకున్నాడు. వంగి, వంగి అతని కాళ్లకు తొమ్మిదిసార్లు నమస్కరించాడు.

ఆ సమయంలో ఆ పూజారి తదేకదృష్టితో కరుణాకర్‌ను, శారదాదేవిని మార్చి మార్చి చూశాడు.

చూస్తూ.. చూస్తూనే పూనకం వచ్చినట్లు పూజారి విపరీతంగా ఊగిపోయాడు. పెద్ద గొంతుతో, "చూడప్పా! ఈ రోజు నా దేహం మామూలు కంటే అధికంగా కంపిస్తోంది. నీ చుట్టూ ఏవో కొన్ని నీలిమేఘాలు కమ్ముకుని వస్తున్నాయని దాని అర్థం. భద్రం..! భద్రం..! భద్రం..!" అంటూ మూడుసార్లు బిగ్గరగా అరిచాడు.

అంతలోనే అతను విల్లు మాదిరిగా వెనక్కి వంగి "ఆఁమ్..! " అంటూ అరుస్తూ - మైకం వచ్చి కిందపడ్డాడు.

వెంటనే పనివాళ్ళు పరుగెత్తుకుని వచ్చి - కర్పూరం వెలిగించి.. అతని చుట్టూ మూడుసార్లు తిప్పి.. అతని కాళ్లను తాకి.. తొమ్మిదిసార్లు మొక్కారు.

అంతే! చటుక్కున లేచి కూర్చున్నాడు పూజారి.

జమిందారు దొరై సింగాన్ని చూసి, నమస్కరించి.. చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

ఇప్పుడతని మొహంలో ఎంతో వినయం.

"సరే పూజారి! మీరిక పోయిరండి!" అన్నారు జమిందారు దొరై సింగం.

"ఆజ్ఞ యజమాన్! మన కులదైవం అమ్మ- ఇప్పుడు ఏం చెప్పారో ఆ విధంగా

## కొత్తగాలి...

**బాల్యంలో**
**అమ్మ కొంగు**
**జీవితమంతా**
**ఆలి కొంగు**

**- డి. శ్రీనివాస దీక్షితులు,**
నరసరావు పేట, గుంటూరు జిల్లా

నడుచుకోండయ్యా!" అన్నాడు పూజారి ఎంతో నమ్రతగా.

"ఏళ్ళ తరబడి మీ ద్వారా మా కుల దైవం - అమ్మ చెప్పినట్లుగానే మేం నడుచుకుంటూ వస్తున్నాం కదా పూజారీ! ఇప్పుడూ అలాగే చేద్దాం"

"అందువల్లనే కదా యజమాన్! మీ కుటుంబాన్ని ఆ నాగమ్మ ఏం చెయ్యడం లేదు" అన్నాడు పూజారి.

దొరైసింగం బదులేమీ చెప్పలేక గాఢంగా నిట్టూర్చారు. పూజారి జమిందారుకు మరొక్కసారి నమస్కరించి, వెనక్కి.. వెనక్కి.. నడుచుకుంటూ ఆ హాలు దాటి బయటికి వెళ్ళిపోయాడు.

"ఇదంతా ఏమిటి జమిందారుగారూ!" శారదాదేవి ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది జమిందారును.

"మా కులదైవం పూజారి ద్వారా- మా కుటుంబం మంచిచెడ్డలు చూస్తూంటుందమ్మా! అందుకు ఈ పూజలు.. ప్రసాదాలు అవీ.."

"చూస్తుంటే.. నాకు.. నాకు.. అలా అనిపించడం లేదే? "

"అంటే.. ఏమిటి మీరు చెప్పేది? " విస్మయంగా అడిగాడు జమిందారు.

"ఇక్కడ కొన్ని విషయాలు మీతో నిర్మొహమాటంగా చర్చించాల్సి వుంది. మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు"

"ఫర్వాలేదు! మీరేం చెప్పదలుచుకున్నారో ఫ్రాంక్‌గా మాట్లాడండి"

"అమ్మా! పూర్ణిమాదేవి! కొంచెం ఇలా రామ్మా! వచ్చి నా పక్కన కూర్చో!"

"ఫర్వాలేదండి! నిలబడతాను"

"లేదమ్మా! మన మాటలు పూర్తవడానికి చాలా సమయం పడుతుంది. ఇలా రా!"

పూర్ణిమాదేవి సిగ్గుపడుతూ శారదాదేవి పక్కకు వచ్చి కూర్చుంది.

ప్రొ. శారదాదేవి ఒకసారి చుట్టూ పరిశీలనగా చూసింది. పనివాళ్ళు దూరంగా - వాళ్ళ పని వాళ్లు చూసుకుంటున్నారు. తమ మాటలు వాళ్ళకి వినిపించే అవకాశం లేదని నిర్ధారించుకున్న తరువాత శారదాదేవి స్వరం తగ్గించి, మెల్లగా..

"అయ్యా! జమిందారుగారూ! నేను చెప్పే విషయం కొంచెం జాగ్రత్తగా వినండి. ఈ మీ ఆస్థాన పూజారి మంచివాడు కాదు"

శారదాదేవి ఆరంభమే అదిరిపడేటట్లు చేసింది జమిందారుని.

"ఏమిటి..? ఏమిటమ్మా మీరు చెప్పేది? "

"నేను గమనించిన ఒక సత్యం మీకిపుడు చెప్పబోతున్నాను. ఈ పూజారిని నేనింతకు ముందు ఒక విచిత్రమైన సిట్యుయేషన్‌లో చూశాను"

"ఎప్పుడమ్మా? "

"మేం కార్లో వచ్చేటపుడు ఊరు వెలుపల ఈ మనిషిని నేను చూశాను"

"ఊరు వెలుపల మా పూజారిని చూడడంలో విచిత్రం ఏవుంది? "

"పూజారిలా కాదు! ఒక గొడ్లకాపరిలా! నాగశిల దగ్గర గొడ్లకాపరిలా వేషం మార్చుకుని వున్నాడు. మమ్మల్ని మాటల ద్వారా బెదిరించడానికి చూశాడు. ఇప్పుడేమో మీ ఆస్థాన పూజారిగా ఇక్కడ ప్రత్యక్షమయ్యాడు. అంతేకాదు ఇండైరెక్టుగా మా గురించి మీకు హెచ్చరికలు చేశాడు"

శారదాదేవి చెప్పిన విషయాలు విన్న తరువాత జమిందారు కంటే - కరుణాకర్ ఎక్కువగా ఆశ్చర్యపోయాడు.

దారిలో వంతెన దగ్గర.. ఒక పెద్దాయనలా మాట్లాడిన మనిషి- ఈ పూజారి.. ఒక్కరే అని - తను గమనించని విషయాన్ని తన తల్లి అంత సూక్ష్మంగా గ్రహించగల్గింది.

"అమ్మా! అతన్ని నేను కూడా చూశాను. కానీ.. ఇద్దరూ ఒక్కరే అని నువ్వెలా చెప్పగలుగుతున్నావు? " కుతూహలంగా అడిగాడు కరుణాకర్.

# విశిష్ట నగరాలు




ప్రపంచంలో కొన్ని నగరాలు మిగిలినవాటితో పోల్చితే విశిష్టమైనవిగా నిలిచాయి. వాటి విశిష్టత ఏమిటో చూద్దాం..

★ ప్రపంచంలో అత్యంత ప్రమాదకరమైన నగరం శాన్ పెడ్రోసులా. హోండురస్ దేశంలో గల ఈ నగరంలో సగటున రోజుకి మూడు హత్యలు జరుగుతుంటాయి. అక్రమ ఆయుధాలు, డ్రగ్స్ ఇక్కడ ప్రధాన వ్యాపారం.

★ ప్రపంచంలో అత్యధిక జనాభా గల నగరం షాంఘై, చైనా. రెండు కోట్ల నలభై లక్షల మంది ఈ నగరంలో నివసిస్తున్నారు.



★ ప్రపంచంలో అత్యంత తక్కువ జనాభా గల నగరం వాటికన్ సిటీ. దీని జనాభా 842.

★ అత్యంత ఐశ్వర్యవంతమైన నగరం టోక్యో, జపాన్. ఇక్కడి జి.డి.పి చాలా అధికం.

★ అత్యంత బీదనగరం కిన్‌షాసా. ది డెమొక్రటిక్ రిపబ్లిక్ ఆఫ్ కాంగోలో గల ఈ నగరంలో సగటు తలసరి ఆదాయం రోజుకి ఒక డాలర్ కన్నా తక్కువే.

★ అత్యంత ఖరీదైన నగరం సింగపూర్. అమెరికాలోని కారు ధరలకి, సింగపూర్‌లో 4 నుండి 5 రెట్లు అధికంగా కారు ధరలు ఉంటాయి.

★ అత్యంత చవకైన నగరం ముంబై, ఇండియా. సింగపూర్‌లోని వస్తువుల ధరల్లో ఇక్కడ 25 శాతం మాత్రమే చెల్లిస్తే చాలు.

★ అత్యంత ప్రాచీన నగరంగా నేటికీ కొనసాగేది డమాస్కస్, సిరియా. ఇది 11 వేల ఏళ్ల క్రితం స్థాపితమైన నగరం.

★ అత్యధికంగా సందర్శించే నగరం లండన్, ఇంగ్లండ్. ఏటా రెండు కోట్ల మంది పర్యాటకులు దీన్ని సందర్శిస్తారు.

★ సైకిళ్లని అత్యధికంగా ఉపయోగించే నగరం గ్రోనింజెన్, నెదర్లాండ్స్. ఇక్కడి 50 శాతం జనాభా సైకిళ్లనే ఉపయోగిస్తారు.

★ ఇంటర్నెట్ కనెక్టివిటీ అధికంగా గల నగరం సియోల్, సౌత్‌కొరియా. ప్రభుత్వ నగరంలోని 10 వేల ప్రదేశాల్లో ఉచిత వైఫై సేవని అందిస్తోందక్కడ.

"చూడు నాయనా! అక్కడ పశువుల కాపరి వేషంలో కళ్ళకు లెన్స్, తలకు విగ్గు పెట్టుకున్నాడు. మోకాళ్ళ వరకు పంచె కట్టుకుని వున్నాడు. ఇప్పుడు ఆ పూజారి వేషంలో గెడ్డం, మీసాలతో, ముఖమంతా విభూది పూసుకుని, రుద్రాక్షమాలలు అవీ వేసుకుని, అడ్డపంచె కట్టుకుని వచ్చాడు. కానీ, నా నుంచి తప్పించుకోలేక పోయాడు. అతని మోకాలు కింది భాగంలో ఒక కత్తిగాటు వుంది. అక్కడ ముసలాయన వేషంలో వున్నపుడు అదే కత్తిగాటు.. ఇప్పుడు, ఇక్కడ పూజారి వేషంలో కూడా ఉంది. ఆ కత్తిగాటు ఇప్పుడు అతణ్ణి పట్టిచ్చింది" శారదాదేవి విడమర్చి చెప్పింది.

పూర్ణిమాదేవి ముఖంలో కూడా విస్మయం.

"సరే అమ్మా! మీరు చెప్పిన ఎవిడెన్స్ కరెక్టుగా సరిపోయింది. ఇంతకీ మీరిపుడు ఏం చెబుదామనుకుంటున్నారు? "

"మిమ్మల్ని మీ పూజారి నాగుల శాపం పేరు చెప్పి, భయపెట్టి, కట్టిపడేస్తున్నాడు. ఇది నిజం! దానికి మీ వంశీయులు ఎపుడో పాము పుట్టను కొట్టారనే దానిని సాకుగా తీసుకుని చక్కగా దానిని ఉపయోగించుకుంటున్నాడు"

"దానివల్ల అతనికి కలిగే లాభం..? " అడిగాడు జమిందారు దొరై సింగం.

"మీ జమీన్ ఎవ్వరికీ అమ్మకుండా చూడాలనేది అతని అభిమతం అనుకుంటున్నాను. అందువల్లనే ఎవరు ఈ భూముల్ని కొనడానికి వచ్చినా, వాళ్లందరూ భయాందోళనలకు గురవుతున్నారు. ఒకవేళ అలా భయపడకుండా ఎవరైనా వస్తే - వాళ్ళ మీదకు పాముల్ని వదులుతున్నారు. అలా ఆ పాముల వల్ల కొంతమంది చనిపోవడానికి - బహుశా ఈ పూజారి ప్లానే కారణం అయివుంటుందనుకుంటున్నాను"

శారదాదేవి నేరపరిశోధనలో ఆరితేరిన ఒక పోలీస్ అధికారి మాదిరి అన్నిటినీ కలిపి సహేతుకంగా విడమర్చి చెప్పేసరికి జమిందారు దొరైసింగం ఆశ్చర్యానికి లోనయ్యారు. ఆయన కలలో కూడా ఊహించని అంశం ఇది.

"అయితే మా పూజారేనా ఈ సమస్యలు అన్నిటికి మూలకారకుడు? " ఆశ్చర్యపోతూ అడిగారు దొరై సింగం.

"అవును పూజారే మూలకారకుడు. అంతేకాదు, దీని వెనుక కచ్చితంగా ఒక పెద్ద ముఠా పనిచేస్తోందనుకుంటున్నాను"

"ఎందుకు ఈ పూజారి నా కూతురు జీవితంతో ఈవిధంగా ఆటలాడుకుంటున్నాడు? పెళ్ళి సంబంధాలు చూడడానికి కులదైవం ఆజ్ఞ ఇంకా ఇవ్వలేదని చెప్పడానికి కారణం ఏమై వుంటుంది? "

"అక్కడే వుంది అతని అసలు పన్నాగం. ఒక పని చేయండి. ఇపుడు నేను చెప్పినట్లు ఆ పూజారి దగ్గర మీరూ మాట్లాడండి. అపుడు బయటపడుతుంది అతడి నిజస్వరూపం. నేను చెప్పింది యథార్థమో? లేదా నా ఊహ మాత్రమేనా? అనేది కూడా రుజువవుతుంది"

"సరి! మీరేం చెయ్యమంటారో చెప్పండమ్మా!"

"నేను అనుకుంది కరెక్టయితే.. మీ పూజారికి ఒక కొడుకు వుండి వుండాలే..!"

"ఉన్నాడమ్మా!" ఆశ్చర్యపోతూ చెప్పాడు జమిందారు.

"అతని కింకా పెళ్ళి కాలేదు కదూ!" అడిగింది శారదదేవి.

"అవునమ్మా!" ఈసారి మరింత ఆశ్చర్యపోయారు జమిందారు దొరై సింగం.

"అంతేకాదమ్మా! పూజారి తన కొడుకుని ఇంజనీరింగ్ చదివించాడు"

"ఇపుడు నేను ఊహించింది మరింత కరెక్టన్నమాట! ఆ పూజారి ఎప్పుడైనా మీ కుమార్తెను తన కొడుక్కి పెళ్ళి చెయ్యమని అడిగివున్నాడా?

"లేదమ్మా!"

"పోనీ, మాటల సందర్భంలో ఎవరి చేతనైనా అడిగించాడా? "

"లేదమ్మా! ఆc..! జ్ఞాపకం వచ్చిందమ్మా! చాలాకాలం కిందట.. తన కొడుక్కి చదువు అయిపోయిన తరువాత.. మా దివాన్‌గారి చేత అడిగించాడు. అప్పుడతనికి చాలా సివియర్‌గా వార్నింగ్ ఇచ్చి పంపించాను"

"అప్పటి మీ తిరస్కారాన్ని - తన పగగా మార్చుకున్నాడు. అప్పట్నుంచి మీ కూతురికి పెళ్ళి కానివ్వకుండా - ఎన్నిరకాలుగా పన్నాగాలు పన్నాలో అవన్నీ చేస్తున్నాడు. వాటినన్నిటినీ కల్లాకపటం లేని

---

## కొత్తగాలి...

**రాజులేని రాజ్యం**
**మినుకు మినుకుమంటూ**
**అమాస రేయి!**

– *శంకర్,*
ఆచంట, ప.గో. జిల్లా

---

మీరు అమాయకంగా నమ్ముతున్నారు"

"ఎంతటి నమ్మక ద్రోహం!"

"ఇపుడు మీరు చెయ్యవలసిన పని నేను చెబుతాను. జాగ్రత్తగా వినండి!"

"చెప్పండమ్మా!"

"జమిందారుగారూ! మీరు మీ పూజారిని పిలిపించి మీ అమ్మాయిని వాళ్ళబ్బాయికి ఇవ్వడానికి సుముఖంగా వున్నానని వూరికే చెప్పండి. స్త్రీ ధనంగా ఈ జమీన్ ఇస్తానని కూడా చెప్పండి"

"ఇదేమి విషమ పరీక్ష? "

"ఇటువంటి విషయం వున్నందువల్లనే కదా ఇంతకాలం ఇన్ని బాధలు మీరు అనుభవిస్తున్నారు. అతని వలలోంచి మీరు బయటపడాలంటే ఇటువంటి ఒక విషమ పరీక్ష ఎదుర్కోక తప్పదు"

"ఏమిటమ్మా మీరు? నా కూతుర్ని పూజారి కొడుక్కి ఇస్తానని చెబితేనే చాలు- అంతకు మించిన అదృష్టం అతని జీవితంలో మరొకటి ఉంటుందా? ఎగిరి గంతేస్తాడు. మరొక్కమాట మాట్లాడకుండా మరుక్షణమే ముహూర్తాలు పెట్టెయ్యడానికి సిద్ధమయిపోతాడు"

"సిద్ధమవ్వనివ్వండి. నష్టం లేదు. అయితే మీరు మరొక్క విషయం కూడా అతనితో చెప్పండి"

"ఏమిటమ్మా అది?

"మేం కూడా పిల్లనడగడానికి వచ్చామని చెప్పండి!

"ఇది ఎందుకు? "

"పోటీ కోసం! అప్పుడే కదా అతను ఇంతకాలం ఆడుతున్న 'ప్రాణాలతో చెలగాటం' కంటిన్యూ చేసి, మాపై కూడా కుట్ర పన్నడానికో.. లేదా చంపడానికో ప్రయత్నిస్తాడు"

"ఇదేమి విపరీతం? దానివల్ల మీ ప్రాణాలకే ముప్పు ఏర్పడుతుంది కదా!"

"ఫర్వాలేదు! ఇదొక రకమైన వల. వాళ్ళు కుట్రదారులైతే, తిన్నగా మనం వేసిన వలలో వచ్చిపడతారు. వాళ్ళను పట్టుకోవడానికి మనం వెతుక్కుంటూ పోవాల్సిన పని లేదు"

"బాగానే వుంది... కానీ..? "

"జమిందారుగారూ! ఏమిటండి ఆలోచిస్తున్నారు? ఇపుడు నేను చెప్పిందంతా నమ్మడం మీకు కొంచెం కష్టంగా వుందా? "

"కొంచెం అలాగే వుందమ్మా! ఎందుకంటే.. ఈ పూజారి చదువుసంధ్యలు లేని ఒక పల్లెటూరి అమాయకుడు. గుడిలో గంట మోగించుకుంటూ.. భక్తులు ద్వారా వచ్చే ఆదాయంతో జీవితం గడిపే పేదవాడు. అటువంటి ఈ పూజారి ఒక పెద్ద జమీన్‌ను స్వాధీనం చేసుకోవడానికి- ఇంత భయంకరమైన పథకం వేశాడు. అమలు జరపడం సాధ్యమవుతుందా? అనేది నాకు అర్థం కావటం లేదు"

"అయితే.. పాములు బలి తీసుకుంటున్నాయనేదేనా మీ భావన? వాటి శాపమే వీటన్నిటికి కారణమనేదేనా మీ నమ్మకం? "

"ఏది ఏమిటో.. నేను కచ్చితంగా ఒక నిర్ణయానికి రాలేకపోతున్నానమ్మా!"

"నేను వచ్చాను. కారణం.. పాములు ఎలా ప్రవర్తిస్తుంటాయో నాకు తెలుసును కాబట్టి. పాపం పాములు..! వాటి ప్రాణాలకు ముప్పు వస్తుందనుకున్నప్పుడే పడగ విప్పి అటాక్ చేయడానికి ప్రయత్నిస్తాయి. వాటి జోలికి పోనంతవరకు అవి మన జోలికి రావు. ఒదిగిపోతాయి. అంతేకాదు బలి తీసుకోవాలనే భావన, శాపం పెట్టాలనే యోచన ఇవేమీ వాటికి ఉండవు. నిజంగా అలాగేకానీ వుండి వుంటే ఈ మానవజాతి పాముల చేత ఎప్పుడో నాశనమై పోయుండేది. మనుష్యులే పాముల్ని పట్టి, ఆడించడమే కాకుండా వాటి విషాన్ని పిండి అనేకరకాలుగా ఉపయోగించుకుంటున్నాం" శారదాదేవి వివరంగా చెప్పింది.

ఇది విన్న తరువాత జమిందారు దొరై



సింగానికి ఎక్కడా లేని హుషారు వచ్చింది. "అమ్మా! చాలమ్మా! మీరింకేమీ చెప్పనక్కర్లేదు. ఇక నేను చూసుకుంటాను. మీరు దారి చూపించారు. ఆ దారిని రహదారిగా మార్చి. నా దారిలోకి రప్పించుకుంటాను. మీరు చెప్పినట్లుగానే నేను పూజారి దగ్గర మాట్లాడతాను. ఒక వేళ పాముల వల్ల మీకేదైనా ఆపద.."

చటుక్కున కల్పించుకున్నాడు కరుణాకర్. "జమిందారుగారూ! ఎటువంటి ఆపదనైనా ఎదుర్కోవడానికి కావల్సిన ధైర్యం, శక్తియుక్తులు మావద్ద వున్నాయి. ఆ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి!" అన్నాడతను.

శారదాదేవి చిరునవ్వు నవ్వింది. "అదంతా నేను చూసుకుంటాను. మాకేమీ కాదు. ఇక ఒక ముఖ్యవిషయం మీతో మాట్లాడాలనుకుంటున్నాను. మీరు మరోలా అనుకోకూడదు"

"అయ్యో! ఫర్వాలేదు. చెప్పండమ్మా!" అడిగారు జమిందారు దొరై సింగం నవ్వుతూ.

"మిమ్మల్ని చూడడానికి నేనిక్కడికి వచ్చింది- మీ జమీన్ కొనాలనే నిర్ణయం తీసుకోవడం కోసమే కాదు. నిజంగానే నా కుమారుడు కరుణాకర్‌కు- మీ అమ్మాయి పూర్ణిమాదేవిని అడగడానికి వచ్చాం. మీకు అభ్యంతరం లేకపోతే మీ కూతుర్ని మా



కోడలుగా చేసుకుందామనుకుంటున్నాను"

శారదాదేవి తను వచ్చిన విషయాన్ని సూటిగా చెప్పింది. పూర్ణిమాదేవి నివ్వెరపోయింది. అటు తరువాత విషయం అర్థం చేసుకుని సిగ్గుపడింది. కరుణాకర్‌ను క్రీగంట చూసి తలదించుకుంది.

జమిందారు దొరైసింగం కూడా ఆశ్చర్యపోయి "ఏమిటి..? ఏమిటమ్మా మీరు చెప్పేది? "

"మీకు.. ఇంకేదైనా ఆలోచన..? "

"ఎంతమాట! మీరు చెప్పేది నిజమేనా? " కూతురు ముఖంలో కదలాడిన సంతోషభావాన్ని గమనిస్తూ తిరిగి అడిగారు జమిందారు.

నవ్వుతూ తల వూపింది శారదాదేవి అవునన్నట్లుగా!

"నా కూతురు పూర్ణిమాదేవిని పెళ్ళి చేసుకోడానికి ధైర్యంగా ఎవరు ముందుకొస్తారా? అని ఎదురుచూస్తున్నాను. ఇంత మంచి సంబంధం వస్తే అది నాకు, మా అమ్మాయికీ వరప్రసాదం!" మనస్ఫూర్తిగా అన్నారు జమిందారు దొరై సింగం.

"అది చాలు! నేనిందాక మీ చేతికిచ్చిన పువ్వులు, పండ్లు నిశ్చితార్థానికి నాంది అనుకుని స్వీకరించండి! ఇదిగో.. ఈ నిముషం నుంచి పూర్ణిమాదేవి నా కోడలు. ఇక మీ చుట్టూ అల్లుకుని వున్న ఈ విషవలయాన్ని ఛేదించడమే రెండో

పని. దానికోసం నేను చెప్పినట్లుగా మీరు నడుచుకోండి చాలు! ముఖ్యంగా మీరు ఆ పూజారి దగ్గర మేం పిల్లనడగడానికి వచ్చా మనే సంగతి మాత్రం కచ్చితంగా చెప్పండి. స్త్రీధనంగా మొత్తం ఈ జమీన్‌ని అడుగుతున్నామని కూడా చెప్పండి. అపుడే అతని అసలు స్వరూపం బయటప డుతుంది"

"సరేనమ్మా! ఇంతకాలం మేం భయం భయంగా బతుకుతూ అలసిపోయాం. ఇప్పటికైనా దీనికి ఒక ముగింపు చూపిస్తా నంటే అంతకంటేనా? చూద్దాం! ఏం జర గబోతుందో..? అంతవరకు మీరు ఇక్కడే ఈ బంగ్లాలోనే ఉండండి"

"లేదు.. లేదు.. మాకు వేరే ఇంకెక్క డైనా వసతి ఏర్పాటు చేయండి! అప్పుడే కదా! ఆ పూజారి ధైర్యంగా మమ్మల్ని ఏదైనా చెయ్యడానికి ముందుకు వస్తాడు. అతడు చేస్తున్న ఈ అకృత్యాలు మొత్తం మీకు మాత్రమే కాదు, మీ వూరు వారంద రికీ అర్థమయ్యే విధంగా నా కొడుకు, నేను నిరూపిస్తాం. పాముల పేరుతో మను ష్యులు ఎలాంటి ఘాతుకాలు చేస్తున్నారో తెలుస్తుంది"

"సరి! అలాగయితే మా మామిడి తోట లోని గెస్ట్‌హౌస్‌లో మీరు నిరభ్యంతరంగా వుండవచ్చు"

జమిందారు దొరై సింగం పనివాళ్ళను పిలిచి, వాళ్ళిద్దర్నీ ఆ గెస్ట్‌హౌస్‌కు తీసుకుపోవడానికి తగిన ఏర్పాట్లు చేయ మని ఆజ్ఞాపించాడు.

అదేవిధంగా పూజారిని వెంటనే రమ్మని కబురు పంపించాడు.

కరుణాకర్, శారదాదేవితో ఆ గెస్ట్‌హౌ స్‌కు బయలుదేరాడు.

పూర్ణిమాదేవి ఏదో చెప్పడానికి తటపటా యించింది. మొత్తానికి ఎలాగో ధైర్యం తెచ్చుకుని కరుణాకర్ దగ్గరకు పరుగున వచ్చి "జాగ్రత్తగా వుండండి!" అని మెల్లని స్వరంతో చెప్పింది.

"మీరు భయపడవద్దు! ఎంతటి ఘోరా న్నయినా ఎదుర్కోవడానికి మేము సిద్ధంగా వున్నాం" అన్నాడు కరుణాకర్ చిరునవ్వుతో.

కరుణాకర్ ఊహించినట్లుగా భయంకర మైన ఘోర విపత్తు వారికోసం ఎదురుచూ స్తోంది.




**జ**మిందారు బంగ్లా.

హాలులో దొరై సింగం కూర్చొని వున్నారు. సరిగ్గా అప్పుడే హాలులోనికి ప్రవేశించాడు పూజారి.

"రండి! రండి! పూజారీ! కూర్చోండి!"

"ఫర్వాలేదండి! ఏదో.. మీరు పిలిచారని చెప్పారు"

"అవును పూజారీ! ఒక ముఖ్యమైన విషయం మీతో మాట్లాడాలి"

"ఏమిటండి! ఆ ముఖ్య విషయం? "

"మీరు ఉదయం ఇక్కడికి వచ్చినపుడు.. ఇక్కడ ఇద్దరు కూర్చుని వున్నారు. వారిని మీరు చూసి వుంటారు!"

"చెప్పండి! ఏమయ్యింది వారికి? "

"ఈ జమీన్ కొనడానికి వచ్చాడు కదా కరుణాకర్! అతను మా అమ్మాయి పూర్ణి మాదేవిని పెళ్ళి చేసుకుంటానంటున్నాడు" చెప్పారు జమిందారు దొరై సింగం.

అంతే..! పూజారి ముఖం, పూసుకున్న విభూతితో సహా నల్లగా మాడిపోయింది.

# హాలీవుడ్ ప్రేమజంటలు

చతుర సమగతులు

హాలీవుడ్‌లో దుస్తుల్ని మార్చినట్లుగా జీవితభాగస్వామిని మారుస్తారనే నానుడి ఉంది. కానీ వారిలో గొప్ప ప్రేమ జంటలు అనేకం..

★ హంఫ్రీ బోగర్ట్- లోరెన్ బకాల్ : 'టు హేవ్ అండ్ హేవ్ నాట్' చిత్రంలో నటిస్తున్న పుడు నలభైనాలుగేళ్ల హంఫ్రీతో పందొమ్మిదేళ్ల లోరెన్ ప్రేమలో పడింది. కొంతకాలం రహస్యంగా సాగిన వారి ప్రేమాయణం పెళ్లికి దారి తీసింది. వాళ్ళిద్దరూ కలిసి పదమూడు చిత్రాల్లో నటించాక ఆమె నటనకు స్వస్తి చెప్పింది. 1956లో కేన్సర్ వచ్చిన హంఫ్రీ మరణించే వరకు అతణ్ణి కంటికి రెప్పలా చూసుకుంది.

★ చార్లీ చాప్లిన్ - ఊనా : పదిహేడేళ్ల ఊనా ఓ నీల్‌తో, అంతకు ఎన్నోరెట్లు వయసుగల చార్లీ చాప్లిన్ ప్రేమలో పడ్డాడు. 'షాడో అండ్ సబ్‌స్టాన్స్' అనే చిత్రం షూటింగ్ సందర్భంలో జరిగిన వారి పరిచయం పెళ్లికి దారి తీసింది. పెళ్లయ్యాక ఊనా నటనకు స్వస్తి చెప్పింది. వారికి ఎనిమిదిమంది పిల్లలు పుట్టారు. అమెరికా ప్రభుత్వం చాప్లిన్ను కమ్యూనిస్టుగా ముద్ర వేసి దేశం నుంచి బహిష్కరించడంతో ఊనా కూడా పౌరసత్వాన్ని వదులుకుని భర్త వెంట స్విట్జర్లాండ్ వెళ్లింది. చివరి వరకూ వాళ్లిద్దరూ కలిసే జీవించారు.



చార్లీ చాప్లిన్ – ఊనా

★ మార్లిన్ మన్రో - జోడి మేగియో : హాలీవుడ్ నటి మార్లిన్ మన్రో, బేస్‌బాల్ క్రీడాకారుడు జోడి మేగియోలు 1954 జనవరిలో రహస్యంగా పెళ్లి చేసుకున్నారు. అయితే జోడి భరించరాని అసూయతో తొమ్మిది నెలలకే ఆమె నుంచి విడాకులు తీసుకున్నాడు. అయినా చివరి వరకు ఇద్దరూ మంచి మిత్రులుగా కొనసాగారు. జోడి మరణించే వరకు వారానికి మూడుసార్లు మార్లిన్ సమాధికి ఓ గులాబీ పూలగుత్తిని పంపాడు.

★ లారెన్స్ ఆలివర్ - వివియన్ లీ : ఇండియాలో పుట్టి యూరప్‌లో చదువుకున్న వివియన్, సాటి నటుడు లారెన్స్ ఆలివర్‌తో ప్రేమలో పడి తన మొదటి భర్తకు విడాకులు ఇచ్చేసింది. 1940లో ఆలివర్‌ని పెళ్లి చేసుకుంది. విపరీతమైన అసూయతో స్కిజోఫ్రెనియాక్(చిత్తచాంచల్యం)గా మారి వివియన్ ఆత్మహత్యా ప్రయత్నాలు చేసింది. 1967లో క్షయతో మరణించిందామె. 'ఆమె లేకపోవడంతో పిచ్చెక్కకుండా ఉండటానికి వివియన్‌ని పోలిన జోన్ ఫ్లోరైట్‌ని పెళ్లి చేసుకున్నాను' అని ఆలివర్ ఆత్మకథలో రాసుకున్నాడు.

★ ఎలిజబెత్ టేలర్ - రిచర్డ్ బర్టన్ : హాలీవుడ్ ప్రేమజంటల్లో ప్రథమస్థానం ఎలిజబెత్ టేలర్, రిచర్డ్ బర్టన్‌లది. 1963లో క్లియోపాత్రా సెట్ మీద వీరిద్దరికీ తొలిపరిచయం. వారి ప్రణయం ఎంతదాకా వెళ్లిందంటే బర్టన్ తన భార్య దగ్గరకు వెళ్తే ఎలిజబెత్ నిద్రమాత్రలు మింగి ఆత్మహత్యా ప్రయత్నం చేసుకుంది. 1964 మార్చిలో వీరు పెళ్లి చేసుకున్నారు. రిచర్డ్ బర్టన్‌లోని తాగుబోతుతనం వల్ల ఎలిజబెత్ విడాకులు తీసుకుంది. 1974లో విడిపోయిన వారు దూరంగా ఉండలేక తిరిగి 1975లో పెళ్లి చేసుకున్నారు. ఆ పెళ్లి నాలుగు నెలలే నిలిచింది. 1984 ఆగస్టులో బర్టన్ మరణించాడు. 'నా మరణానంతరం కూడా నాకు అతని పక్కనే స్థానం కావాలి' అని ఆత్మకథలో రాసుకుంది ఎలిజెబెత్.

★ రీటా హేవర్త్ - ఆర్సన్ వెల్స్ : స్వతహాగా సిగ్గరి అయిన రీటా హేవర్త్, ఆర్సన్ వెల్స్ 1943లో తొలిసారి కలుసుకున్నారు. అప్పటికే ఇద్దరికీ పెళ్లిళ్లు జరిగి అవి పెటాకులయ్యాయి. ఓ రోజు షూటింగ్ లంచ్‌బ్రేక్‌లో వారి వివాహం జరిగింది. ఆర్సన్‌కి పని దొరక్కపోవడం, రీటా బిజీస్టార్ కావడంతో అతని అహం దెబ్బతిని వారిమధ్య దూరం అధికమైంది. 1948లో వారు విడాకులు తీసుకున్నారు. దాంతో ఆర్సన్‌వెల్స్ యూరప్‌కి వెళ్లిపోయి నైట్ క్లబ్బులలో రీటాహేవర్త్ పోలికలున్న సింగర్ స్ట్రిప్ టీజర్స్‌తో తిరిగాడు. ఆర్సన్‌వెల్స్ తాను మరణించేవరకు రీటాని ఆరాధించాడు.

"మా కుటుంబం ఎటువంటి సమస్యలలో చిక్కుకుపోయి వుందో మీకు తెలుసు. కానీ అతనికి ఈ సమస్యలు తెలియవు కదా!"

"మరి.. మరి.. మీరు అతనికి వీటి గురించి వివరంగా చెప్పలేకపోయారా? "

"చెప్పాను! ముఖ్యంగా మా కుటుంబంపై వున్న సర్పశాపం గురించి వివరంగా చెప్పాను"

"ఏమన్నాడు..? దానికా అబ్బాయి ఏమన్నాడు? " ఆత్రుతగా అడిగాడు పూజారి.

"మీరు చెప్పేది నేను ఏమీ నమ్మను. అంతా ట్రాష్! అన్నాడు ఆ అబ్బాయి" చెప్పారు జమీందారు దొరై సింగం.

"అయితే మరి బ్రోకరు స్వామినాథం పాము కాటుకు గురయ్యాడు కదా! మీరది జ్ఞాపకం చేయలేకపోయారా!"

"దానిని కూడా కొట్టిపారేశాడతను"

"మొత్తమ్మీద ఏదీ నమ్మడానికి సిద్ధంగా లేడు. అంతేనంటారా? "

"అవును! పెళ్ళి సంబంధం గురించి మాట్లాడడానికి వాళ్ళ అమ్మగారిని కూడా వెంటబెట్టుకుని మరీ వచ్చాడు"

"అయితే వాళ్ళమ్మగారికి మొత్తమంతా వివరంగా చెప్పండి. కొడుక్కి నచ్చచెప్పుకుని ఏదోవిధంగా అతన్ని ఇక్కడి నుంచి తీసుకెళ్తుంది"

"ఆమె అస్సలేమీ భయపడడం లేదు. మాంచి ధైర్యశాలిగా కనపడుతోంది" చెప్పారు జమీందారు పూజారి ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

"ఇది నేను నమ్మలేకపోతున్నాను యజమాన్!"

"నేను కూడా నమ్మలేకపోతున్నాను పూజారీ!"

"సరి! ఇంతకీ మీరేం జవాబు చెప్పారు? "

"రెండు రోజులిక్కడ అతిథులుగా ఉండండి! ఆలోచించి చెబుతానని అన్నాను"

"ఇందులో ఆలోచించి చెప్పడానికేం ఉంది? రెండు రోజులపాటు వాళ్లిక్కడ ఉన్నారంటే - పాపం! అన్యాయంగా సర్పాలకు బలి అయిపోతారు"

"అది వాళ్ల తలరాత! దానికి నేనేం చేయగలను చెప్పండి పూజారీ! ఆ! ఇంకొక విషయం. ఇదే సమయంలో నేనొక నిర్ణయానికి వచ్చాను"

"ఏమిటండి అది? " ఆత్రుతగా అడిగాడు పూజారి.

"ఇంక కాలయాపన చేయకుండా నా కూతుర్ని ఉన్న ఊళ్లోనే - మా కుటుంబ సమస్య గురించి బాగా తెలిసిన మనిషిని చూసి - అలాంటి వాళ్లకి ఎవరికైనా పెళ్లి చేసి పంపించేద్దామని అనుకుంటున్నాను" ఒక డెస్పరేట్ మూమెంట్‌కు వచ్చినట్లు మాట్లాడారు జమిందారు.

జమిందార్ దొరై సింగం చెప్పిన మాట వినగానే పూజారి ఆలోచనలో పడ్డాడు.

"ఇది ఒక విధంగా మంచి నిర్ణయమే యజమాన్!" అన్నాడు పూజారి.

"అవును పూజారీ! పెళ్లికాని అమ్మాయి ఇంట్లో ఉన్నందువల్లనే కదా ఈ విధంగా పిల్లనడగడానికి ఎవరెవరో వస్తున్నారు. వాళ్లంతా ప్రమాదంలో పడుతున్నారు. శీఘ్రంగా పెళ్లి చేసి ఈ బంగ్లాతోపాటు ఈ జమీన్ మొత్తం వరకట్నంగా ఇచ్చేసి- నేను

**కొత్తగాలి...**

**ఒక వృక్షం చల్లగా తెలిపింది**
**తాను కష్టాల్లో ఉన్నా**
**ఇతరులకు సుఖాన్ని ఇవ్వమని!**

*– బి. మాన్‌సింగ్‌నాయక్,*
*హనుమాపురం, గుంటూరు జిల్లా*

సింగపూరు వెళ్లిపోయి, ఇక అక్కడే సెటిల్ అయిపోవాలనుకుంటున్నాను"

"ఇది కూడా మంచి ఆలోచన యజమాన్! అమ్మాయికి బాగా చదువుకున్న పెళ్లికొడుకును చూడండి! మీ ఇష్టానికి తగినట్టు పెళ్లి చేసేయండి!"

"ఏమిటండి పూజారీ మీరు? ఈ ఊర్లో బాగా చదువుకున్న అబ్బాయి ఎవరున్నారు మీ కొడుకు తప్ప. డైరెక్టుగా అడుగుతున్నాను. మీరు సమ్మతిస్తే.."

జమిందారు దొరైసింగం అంత సడన్‌గా, సూటిగా విషయానికి వచ్చి, అడగ్గానే పూజారి తెల్లముఖం వేశాడు.

"అది.. అది.."

"ఏం పూజారి? మీరు కూడా మా కుటుంబానికి ఉన్న సర్పశాపానికి భయపడిపోతున్నారా ఏమిటి? అలాగైతే వద్దులెండి! నా గురించి మీరు ఇబ్బంది పడనవసరం లేదు"

"అబ్బెబ్బె! అది కాదండి! మీరింత సడన్‌గా అడుగుతారని కలలో కూడా అనుకోలేదు. అందువల్ల.." పూజారి మొహంలో వంద మతాబులు ఒకేసారి వెలిగాయి.

"ఎదురుచూడని సంఘటనలు జరిగేదే జీవితమంటే.." అర్థవంతంగా మాట్లాడారు జమీందారు.

"అది నిజమనుకోండి! కానీ.. మీరెక్కడ..? నేనెక్కడ..?"

"అలాంటి మాటలేమీ - ఇక మీదట మాట్లాడకూడదు. మీరు 'సరే' అని చెప్పండి చాలు!"

"సరేనండి!" పూజారి అమితానందంతో ఎగిరి గంతేసినంత పనిచేశాడు.

"ఈ రెండు రోజులు మా కులదేవత వీరిద్దర్నీ ప్రాణాలతో వదిలేస్తే.. వీరి దగ్గర కూడా ఈ విషయం చెప్పి - పెళ్లికి రండని పిలుస్తాను. చూద్దాం! విధి నిర్ణయం ఎలా ఉందో.."

"ఎందుకండి? మీరు నిర్ణయం తీసుకున్నారు కదా! ఇంకెందుకు వారిక్కడ? వాళ్ల ఊర్లోనే వేరే సంబంధం ఏదైనా చూసుకోమని చెప్పేసేయండి"

"పూజారీ! మా అమ్మాయిని - వారికిచ్చి పెళ్లిచేయడానికి - మా కుటుంబ సర్పశాపం వల్ల వీలుకాదని చెప్పాను. అది వాళ్ల ప్రాణాలకే ప్రమాదమని కూడా చెప్పాను. 'ఆ ప్రమాదం ఏవిధంగా వస్తుందో మేమూ చూస్తాం! రానివ్వండి! శాపం లేదు.. గీపం లేదు..! పాములు మమ్మల్ని ఏమీ చేయలేవని మేం కచ్చితంగా నిరూపిస్తాం. ఆ తరువాతనే మీరు మీ అమ్మాయి నివ్వడానికి ముందుకు రండి!' అని ఛాలెంజ్ చేశారు" చెప్పారు జమిందారు.

పూజారి ముఖంలో రంగులు మారాయి.

"అయితే వదలండి! ఇక్కడే ఉండి వీర్ని కూడా చావనివ్వండి! ఎంతోమంది ఈ విధంగా వచ్చినవారు పైకి పోయారు. ఆ లిస్టులో వీరి పేర్లు కూడా లాస్ట్‌లో చేరనివ్వండి!"

పూజారి ఇచ్చిన సమాధానంలో ఏదో ఒక దృఢనిశ్చయం కనిపిస్తోంది. అది జమిందారు దొరైసింగం దృష్టినేమీ దాటిపోలేదు.

★ ★ ★

మామిడి తోపులోని గెస్ట్‌హవుస్!

సుమారు పదిహేను, ఇరవై ఎకరాల విస్తీర్ణం గల పండ్లతోట.

మామిడి చెట్లతోపాటు, సపోటా, బత్తాయి, అరటి, నారింజ, జామ వంటి వివిధ రకాల పండ్ల చెట్లతో ఎటు చూసినా నిగనిగలాడుతున్న పచ్చదనం కనిపిస్తోంది.

ఆ తోట మధ్య అధునాతనంగా కట్టిన ఆ గెస్ట్‌హౌస్. లోపల సోఫాసెట్, ఫ్రిడ్జ్, పెద్దసైజ్ ఎల్ఇడీ టీవీ.. ఇంకా నివసించడానికి అనువుగా అన్నిరకాల సదుపా

యాలు అమర్చి ఉన్నాయి.

ఆ మేడ చుట్టూ ఉడుతలు ఉత్సాహంగా పరుగులు పెడుతున్నాయి.

శారదాదేవితో - కరుణాకర్ ఇంటి లోపలికి ప్రవేశించాడు. చిన్నపిల్లాడిలా శారదాదేవి చేయి పట్టుకుని నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ- హాలు లోపలికి వచ్చాడు.

"అమ్మా!"

"ఏంటి కరుణా!"

"అమ్మా! నువ్వు చాలా రేషనల్‌గా ఆలోచించావమ్మా!"

"అది కాదు కరుణా! జరిగిన సంఘటనలన్నీ కలిపి ఆలోచిస్తే - విషయం అర్థమవుతోంది. కానీ.. అర్థం కానిది.. ఇంకా.. ఏదో ఉందనిపిస్తోందిరా!"

"అసలు నువ్వు పోలీసు శాఖలో ఉండాల్సిన దానివి, ప్రొఫెసర్ ఎలా అయ్యావు? అర్థం కాకుండా ఉంది నాకు"

"పోరా పిచ్చివాడా! ఒక విషయం చెప్పనా! పుస్తకాలు బాగా చదివే అలవాటున్నవాళ్లకి ఎపుడు కూడా మైండ్ అనేక విధాలుగా ఆలోచిస్తుంది. షార్ప్‌గా కూడా ఉంటుంది తెలుసా? "

"నేను ఈ ఊరికి వచ్చినపుడు నువ్వు ఆలోచించిన యాంగిల్‌లో చూడలేదు. నా వల్ల కాలేదు కూడా! నువ్వు దీనికి మూలకారకుడు పూజారి అని కనిపెట్టావు చూడు! నిజంగా గ్రేట్ అమ్మా!"

"కరుణా! ముందు నన్ను పొగడడం ఆపు. ఆc! నాయనా! నేను ఒక లైన్ వేస్తే - దాంట్లో నువ్వు రోడ్డు వేసేస్తానేవాడివి. ముందు అది చెయ్! అయితే ఒకటి మాత్రం నిజం! నిన్ను, నన్ను కాటు వేయడానికి పాములు రావడం మాత్రం ఖాయం!"

"అలా సర్పాలు ఎపుడు.. ఎలా వస్తాయనేది మన ఊహకందని విషయం"

"అవును! అది మనం తెలుసుకోవాలి. ఈ ఊరి వాళ్లకు, ముఖ్యంగా జమిందారు దొరైసింగానికి కూడా తెలియజెప్పాలి"

"నిశ్చయంగా తెలుసుకొంటానమ్మా! దానికోసం ఏం చెయ్యాలో - ఆ ఏర్పాట్లన్నీ పూర్తిచేసే వచ్చాను"

"చూస్తాను. నువ్వేం చేశావో..? నీ సామర్థ్యం ఏమిటో..? "

"సరే అమ్మా! నువ్వు రెస్ట్ తీసుకో..! నేను అలా బయటికి వెళ్లి వస్తాను"

"జాగ్రత్త కరుణా!"

"అలాగేనమ్మా!"

తల్లి శారదాదేవిని ఆ గెస్ట్‌హౌస్‌లో వదిలి, కరుణాకర్ ఉత్సాహంగా బయటికి వచ్చాడు.

శారదాదేవి ఏవిధమైన టెన్షన్ లేకుండా వెళ్లి ప్రశాంతంగా సోఫాలో కూర్చొని టీవీ ఆన్‌చేసింది. ఆ టీవీలో 'నాగమ్మ' సీరియల్ రావడం ప్రారంభించింది.

అదే సమయంలో రెండు కళ్లు ఆమెను జాగ్రత్తగా వాచ్ చేస్తున్నాయి.




గెస్ట్‌హౌస్ నుంచి బయటికి వచ్చాడు కరుణాకర్.

చుట్టుపక్కల చాలా నిశ్శబ్దంగా ఉంది. గాలి చల్లగా వీస్తోంది.

ఆ గాలికి - నీరెండలో మామిడి చెట్ల కొమ్మలు నెమ్మదిగా ఊగుతున్నాయి. కరుణాకర్ ఆలోచిస్తూ అడుగులు ముందుకు వేశాడు.

పూజారి జమీన్‌లోని మొత్తం ల్యాండ్

ఆశించి ఈ విధంగా జనాల్ని భయపెడుతున్నాడా? లేదా ఈ జమీన్ ద్వారా అతనికి ఇంకేదైనా ప్రయోజనం కలిగే అవకాశం ఉండి ఈ విధంగా చేస్తున్నాడా?

జమీన్ ల్యాండ్ స్వాధీనమైనంత మాత్రాన పూజారి ఏమీ చెయ్యలేడు. కారణం.. మొత్తం ఈ జమీన్ ల్యాండ్‌లో వ్యవసాయం చెయ్యాలంటే లక్షల్లో పెట్టుబడి పెట్టవలసి ఉంటుంది. ఆర్థికంగా పూజారి వల్ల ఈ పనిచెయ్యడం సాధ్యమవుతుందా?

పూజారి కేవలం ఈ జమీన్ భూమి కోసం తన పథకాలు అమలు చేస్తున్నాడా? లేదా అమ్మ చెప్పినట్లుగా - ఇంకేదో కారణం ఉండి ఉంటుందా? అదే మిటో శోధించవలసిన అవసరం ఉంది.

అది ఏమై ఉంటుంది?

అడుగు ముందుకు వెయ్యబోతూ - టక్కున ఆగిపోయాడు కరుణాకర్. ఎవరో తనని గమనిస్తున్న ఫీలింగ్ కలిగింది.

చుట్టుపక్కల చాలా జాగ్రత్తగా పరిశీలించి చూశాడు.

అంతే!

అతని వెన్ను జలదరించింది. శరీరం ఒక్కసారిగా గగుర్పొడిచింది.

ఎదురుగా.. సరిగ్గా అరవై అడుగుల దూరంలో.. కారు దగ్గర చాలా పెద్ద పాము ఒకటి అతన్నే తీక్షణంగా చూస్తోంది.

సుమారు పదిహేను కేజీల బరువు, ముప్పై అడుగుల పొడవు ఉండవచ్చు ఆ పాము తల త్రికోణాకారంలో బాణం మొన మాదిరిగా ఉంది.

పరిశీలనగా చూశాడు కరుణాకర్ దానిని.

అది.. రాక్ పైథాన్!

ఆఫ్రికా అడవులలో తిరుగాడే కొండచిలువ.

ఎట్టి పరిస్థితులలోనూ - ఇండియాలో ఉండడానికి వీలులేని పాము.

ఇండియాలో - అదీ నాగేశ్వరపురం జమీన్‌లో ప్రత్యక్షమైంది. అదెలా సాధ్యం? అంటే.. ఎవరో కావాలని ఆఫ్రికా నుంచి ఇండియాకి రప్పించారన్నమాట!

భారతదేశంలో వుండే కొండచిలువలు దొరికిన వాటిని అమాంతంగా మింగేసి.. ఆపై నెమ్మదిగా ఏ చెట్టుకో తన శరీరాన్ని చుట్టి మింగిన ఆహారాన్ని ముక్కలుగా చేసి జీర్ణం చేసుకుంటాయి.

ఆఫ్రికాలో వుండే ఈ రాక్ పైథాన్ - దొరికిన ఆహారాన్ని ముక్కలు ముక్కలుగా కొరికి - ఆపై నెమ్మదిగా మింగుతుంది.

ఎవరో కావాలని - తమ మీద ఎటాక్ చేయడం కోసం దీన్నిక్కడకి తీసుకువచ్చి

## కొత్తగాలి...

**ఉన్నంత కాలం పులులు**
**పులుల్లాగే జీవిస్తాయి!**
**పులిలాంటి మనిషి మాత్రం**
**చివరిదశలో**
**పిల్లిగా మారుతున్నాడు!**

– కుంటముక్కల సత్యవాణి, కాకినాడ

వదిలి పెట్టిపోయారు.

ఎవరైనా కనిపిస్తారేమోనని చుట్టుపక్కల జాగ్రత్తగా వెతికాడు కరుణాకర్. ఎవ్వరూ కనిపించలేదు. అంతటా నిశ్శబ్దంగా వుంది.

చాల ఆకలిగా వున్నట్లుంది, ఆ రాక్‌పైథాన్ తన దృష్టి పథంలోకి వచ్చిన కరుణాకర్‌వైపు శరవేగంగా దూసుకు రాసాగింది.

చటుక్కున తన ఫ్యాంట్ జేబులో నుంచి రివాల్వర్ బయటకితీశాడు కరుణాకర్. సూటిగా దాని తలకు గురిపెట్టి, ట్రిగ్గర్‌పై వేలుంచాడు. సరిగ్గా అదే సమయంలో - తల్లి చెప్పిన మాటలు గుర్తుకు

వచ్చాయి. 'కరుణా! అవి మూగజీవాలు! ఎట్టి పరిస్థితులలోను వాటికి హాని తలపెట్టవద్దు! ఎటూ పోవడానికి వీల్లేనప్పుడే అవి మన మీద తిరగబడతాయి. సాధ్యమైనంతవరకు అవి తప్పించుకు పోవడానికే చూస్తాయి' అని.

రివాల్వర్‌ని నెమ్మదిగా తన ఫ్యాంట్ జేబులోనికి తోసేశాడు కరుణాకర్. షర్ట్ జేబులో చేయిపెట్టి బయటికి తీశాడు. ఇప్పుడతని చేతిలో వున్నది సెల్‌ఫోన్!

★ ★ ★

గెస్ట్‌హౌస్

రాత్రి సమయం

హాలులో కూర్చుని వున్నారు కరుణాకర్, శారదాదేవి.

సరిగ్గా అదే సమయంలో-

'ఝల్! ఝల్' కాలిమువ్వల శబ్దం వినవచ్చింది. చటుక్కున తల తిప్పి చూశారు ఇద్దరూ.

ద్వారం దగ్గర పూర్ణిమాదేవి.

చేతిలో పళ్ళెం! పళ్ళెం నిండుగా ఫలహారాలు!

"రామ్మా! పూర్ణిమాదేవి! రా!" ఆహ్వానించింది శారదాదేవి.

"మీకు రాత్రికి టిఫిన్ తీసుకువచ్చాను"

తలెత్తి హాలులో వున్న గోడ గడియారం వైపు చూశాడు కరుణాకర్! సరిగ్గా ఎనిమిది గంటలు!

"నువ్వే స్వయంగా తీసుకొచ్చావు! ఎవరి చేతనైనా పంపించలేక పోయావా పూర్ణిమా? "

"లేదు.. అది.." అంటూ నసుగుతూ క్రీగంట కరుణాకర్‌ను చూసి తలదించుకుంది పూర్ణిమాదేవి.

"నాకు అర్థమయ్యిందమ్మా! నువ్వెందుకు వచ్చావో..? "

"అవునమ్మా! నేను భయపడుతున్నాను" నెమ్మదిగా అంది పూర్ణిమాదేవి.

"మేం అనుకున్నదే.. ఎదురు చూస్తున్నదే కదమ్మా ఇది! భయపడవద్దు. మాకేం కాదు"

"అమ్మా! మీ నమ్మకం, ధైర్యం చూస్తుంటే - నాకు ఎంతో ఆశ్చర్యంగా వుందమ్మా! ఇటువంటి నమ్మకంతో, ధైర్యంతో నన్ను చూసుకోవడానికి వచ్చిన వారూ.. ఈ జమీన్ కొందామని వచ్చిన వారూ.. ఎందరో ఇప్పుడు ప్రాణాలతో లేరు. అర్థంతరంగా చచ్చిపోయారు. అది తలచుకుంటే నాకు.."

"నీ మంచి మనసు చూసి, నాకు చాలా సంతోషం కలుగుతోంది. ఈ భూమ్మీద పుట్టాం. జీవించడం మన ధర్మం. ప్రతి దానికీ భయపడి చస్తుంటే - అది జీవితం కాదు. ఒక్కొక్కరోజు.. ఒక్కొక్క నిముషం.. అర్థవంతంగా బతకాలనుకునే వాళ్లలో నేను ముందుంటాను. నాకేమీ కాదనే విశ్వాసం నాకు ఎక్కువ"

శారదాదేవి సాధ్యమైనంత వరకు పూర్ణిమాదేవిని సముదాయించింది. ఆమె తెచ్చిన ఫలహారాన్ని శారదాదేవి, కరుణాకర్ ఇద్దరూ తృప్తిగా భుజించారు. చాలా రుచికరమైన ఫలహారాలవి.

"ఎలా వున్నాయమ్మా టిఫిన్స్? " అడిగింది పూర్ణిమాదేవి.

"సూపర్! చాలా బాగున్నాయి! నువ్వేస్వయంగా చేసినట్టున్నావు? "

కళ్ళు కిందికి దించి అవునన్నట్లు తలవూపింది పూర్ణిమాదేవి.

ఆ భంగిమ కరుణాకర్ హృదయాన్ని దోచుకుంది.

"ఒక జమిందారు బిడ్డ - వంట నేర్చుకోవడమే కాకుండా - ఇంత రుచికరంగా వండడం నిజంగా చాలా గ్రేట్! ఏమంటావ్ కరుణా!" మనస్ఫూర్తిగా మెచ్చుకుంది శారదాదేవి.

తల్లి మాటలు విన్న కరుణాకర్ కొంచెం సిగ్గుపడ్డాడు. చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"అరె! మా కరుణ సిగ్గుపడడం నేను మొట్టమొదటిసారిగా.. ఇదిగో ఇప్పుడే చూస్తున్నాను" గట్టిగా నవ్వుతూ అంది శారదాదేవి.

ఆమె నవ్వుతో శ్రుతి కలిపింది పూర్ణిమా దేవి.




గెస్టుహౌస్!

సరిగ్గా అర్ధరాత్రి పన్నెండు గంటలు!

అంతవరకు మెలకువగానే వున్నారు శారదాదేవి, కరుణాకర్. ఎప్పుడు పట్టిందో నిద్ర తెలియలేదు. కరుణాకర్ హాలులో సోఫాలోను, అదే హాలులోని దివాన్‌కాట్‌పై శారదాదేవి అలాగే నిద్రపోయారు.

కాసేపటికే చటుక్కున మెలకువ వచ్చింది కరుణాకర్‌కి. ఏదో శబ్దం అతి దగ్గరగా వినిపిస్తోంది.

కళ్ళు తెరచి చూసి అదిరిపడ్డాడు. సోఫాకు రెండు అడుగుల దూరంలో- ఒక పెద్ద నాగుపాము పడగ విప్పి నిలబడి వుంది. దాని నోటినుంచి వెలువడుతున్నాయి 'బుస్'మనే శబ్దాలు. ఆ శబ్దానికే మెలకువ వచ్చింది అతనికి.

ఎంతటి ధైర్యవంతుడికైనా - అకస్మాత్తుగా అటువంటి దృశ్యం ఎదురుపడేసరికి - కొంచెం భయం కలుగకపోదు.

సహజంగా మనుష్యులకి పాములంటేనే భయం. మిగిలిన వేటిని చూసినా అంతగా చలించరు.

ఆపద ఇంత తొందరగా వస్తుందని కరుణాకర్ ఊహించలేకపోయాడు. అందుకే కొంచెం అజాగ్రత్తగా వున్నాడు. దానికిపుడు మూల్యం చెల్లించక తప్పడం లేదు.

కదిలితే కాటు పడేంత దగ్గరగా బుసలు కొడుతోంది ఆ నాగుపాము. సరిగ్గా అదే సమయంలో-

తల్లి శారదాదేవి పడుకుని వున్న దివాన్ కాట్ దగ్గర్నుంచి కూడా 'బుస్'మని మరొక శబ్దం వినిపించింది.

కళ్ళు మాత్రమే తిప్పి చూశాడు కరుణాకర్. దివాన్‌కాట్ దగ్గరగా మరొక బ్రహ్మాండమైన తాచుపాము పడగ విప్పి ఆడుతోంది.

మెరుపులా కదిలాడు కరుణాకర్.

ప్రతిరోజు క్రమం తప్పకుండా వ్యాయామం చేస్తున్నందువల్ల స్ప్రింగ్‌లా రియాక్ట్ అయ్యిందతని శరీరం.

కన్నుమూసి తెరిచే లోపల దివాన్‌కాట్ దగ్గరకు జంప్ చేశాడు. అమాంతం ఆ తాచుపాము మెడ పట్టుకుని హాల్‌లో ఒక మూలకు గిరాటేశాడు.

ఈ లోపల మెలకువ వచ్చింది శారదాదేవికి.

చటుక్కున లేచి కూర్చొని, "ఏమయ్యింది కరుణా!" అంటూ గాభరాగా అడిగింది.

కరుణాకర్ నిశ్శబ్దంగా - హాలులో ఒక మూలకు తాను విసిరేసిన పామువైపు చూపించాడు.

అటువైపు చూసి, ఇద్దరూ అదిరిపడ్డారు.

అక్కడ.. ఒకటి.. రెండు, మూడు, నాలుగు.. ఇలా లెక్కపెట్టడానికి వీల్లేనంతగా.. మొత్తం హాలు నిండా నాగుపాములే నాగుపాములు..!

ఆ నాగేశ్వరపురం జమీన్‌లో వున్న మొత్తం నాగుపాములన్నీ ఒక పెద్ద సైన్యంలా ఏర్పడి, ఒక్కసారిగా వాళ్ళమీదికి దండెత్తి వచ్చాయి పగతో రగిలిపోతున్నట్లుగా.. మూకుమ్మడిగా.. వాళ్ళిద్దరి

అక్షరం

మరణించేలోపుగా
తన మాట చెప్పలేని
నిస్సహాయ మానవుడి గొంతు పేరే కవి

– డా. గుంటూరు శేషేంద్రశర్మ



చుట్టూ వలయాకారంగా నిలబడి వున్నాయి మొత్తం ఆ సర్పాలు. కొంచెం కొంచెం ముందుకు రాసాగాయి ఒక సర్ప వ్యూహంలా.

లేచి దివాన్‌కాట్ పై నిలబడ్డారు ఆ తల్లీ కొడుకులు.

శారదాదేవి ఆస్తీక మంత్రాన్ని బిగ్గరగా చదవడం ప్రారంభించింది. ఆమె నోటి నుండి వెలువడుతున్న ఆస్తీక మంత్రోచ్చారణ శబ్దతరంగాలు - ఆ సర్పాల మస్తిష్కాలను తాకి కంట్రోల్ చేస్తున్నాయేమో అన్నట్లుగా వాటి కదిలికల్లో కొద్దిగా మార్పు వచ్చింది. వేగం తగ్గింది.

"అమ్మా! నీ మంత్రం పనిచేస్తున్నట్లుందే!" నవ్వుతూ అన్నాడు కరుణాకర్.

"నువ్వు కూడా ఈ మంత్రం చదువు కరుణా! మనసు లోపల నుంచి నమ్మకంతో బయటికి రావాలి. ఇది మాయల మంత్రం కాదు. మానసిక శక్తినిచ్చే మంత్రం" చెప్పింది శారదాదేవి.

మంత్రం బదులుగా పక్కనే నిలబెట్టి వున్న దుడ్డుకర్రను గబుక్కున అందుకున్నాడు కరుణాకర్!

"తప్పు చేయవద్దు కరుణా! నా మీద నమ్మకం వుంచు. ఏమీ జరగదు" చాలా ధైర్యంగా చెప్పింది శారదాదేవి.

కానీ, అక్కడ పరిస్థితి చాలా భయంకరంగా వుంది. ఎటు చూసినా సర్పాలే! పడగలు విప్పి.. బుసలు కొడుతూ.. ముందుకు దూసుకు వస్తున్నాయి.

క్షణం క్షణం పరిస్థితి విషమంగా మారుతోందపుడు.

నెమ్మది నెమ్మదిగా ఆ నాగుపాములు చుట్టూ మూగుతున్నాయి.

మొత్తం అవన్నీ అయిదు వందలకు పైగానే వుండవచ్చు చేతిలో వున్న దుడ్డుకర్రతోగానీ, జేబులోవున్న రివాల్వర్‌తోగానీ ఎన్నని చంపగలడు అతను?

"అమ్మా! ఏమిటమ్మా ఇది? ఒక పెద్ద సైన్యమే కదిలి వచ్చినట్లుగా వుంది కదమ్మా!"

"అవును కరుణా! సైన్యం! సర్పసైన్యం! రానీయ్! ఇన్ని సర్పాలు ఒకేచోట! - ఇది మనకు ఒక 'దర్శనం, అనుకో'! కళ్ళలో ఏమాత్రం భయం కనపడనీయకు! భక్తితో వాటిని చూడు"

"అమ్మా..!"

"నువ్వు భయపడవని తెలుసు. వాటి మీద కోపం కూడా తెచ్చుకోకు. ఇక్కడున్న ఒక్క పాముకు కూడా ఏవిధమైన హానీ కలుగకూడదు. మనుష్యులు చేస్తున్న తప్పులకి పాపం ఇవి మాత్రం ఏం చెయ్యగలవు చెప్పు? "

శారదాదేవి ఆ సర్పాల్ని చూస్తూ చెప్పింది. అటు తరువాత ఆ దివాన్‌కాట్‌పైన పద్మాసనం వేసుకుని, కళ్ళు మూసుకుని ఆస్తిక మంత్రాన్ని ఉచ్చరించడం ప్రారంభించింది.

అమ్మ చెప్పిన మాటలకి కట్టుబడి- అతిశయంగా కనిపిస్తున్న ఆ అరుదైన దృశ్యాన్ని చూస్తుండిపోయాడు కరుణాకర్.

నాగులసైన్యం ముందుకు కదులుతోంది నెమ్మదిగా.

★ ★ ★

మరునాడు ఉదయం ఎనిమిది గంటలు..

జమిందారు బంగ్లా!

హాలులో ఎవరి కోసమో ఎదురుచూస్తూ- అటూ, ఇటూ పచార్లు చేస్తున్నారు జమిందారు దొరైసింగం. అంతలోనే ఆయన ఎదురు చూస్తున్న వ్యక్తి కంగారు కంగారుగా లోపలికి వచ్చాడు. అతను పూజారి!

"ఏమోయ్ పూజారి! మన గెస్ట్‌హౌస్ బంగ్లాలో అతిథులుగా వున్న ఆ తల్లీ కొడుకులిద్దరూ- రాత్రి పాము కాటు తిని దారుణంగా చచ్చిపడివున్నారట!" అన్నారు జమిందారు ఆదుర్దాగా.

"అయ్యా! నేనపుడే చెప్పాను. సర్పాలు సామాన్యమైనవి కావు. వాటి శాపాలకు ఎంతటివాళ్లయినా బలి కావల్సిందే! మన నాగేశ్వరపురం సర్పాలకు అంతటి శక్తి వుంది" అన్నాడు పూజారి.

"సరే! పద! ముందు మనం గెస్ట్‌హౌస్‌కు పోయి చూసివద్దాం!"

"నాన్నగారూ! నేను కూడా వస్తాను" అంది పూర్ణిమాదేవి లోపల్నుంచి వస్తూ. ఆమె కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతూ కనిపిస్తున్నాయి.

ముగ్గురూ వడివడిగా నడుచుకుంటూ గెస్ట్‌హౌస్ చేరుకున్నారు. అయిదుగురు దృఢకాయులైన రైతుకూలీలు ఆ గెస్ట్‌హౌస్ ముఖద్వారం దగ్గర నిలబడి వున్నారు.

గబాగబా హాలులోనికి ప్రవేశించారు జమిందారు దొరైసింగం, పూజారి, పూర్ణిమాదేవి ఒకరి తర్వాత మరొకరు.

అక్కడ.. హాలులోపల..

సోఫాలో కూర్చొని వున్నాడు కరుణాకర్. అతని ఒడిలో లాప్‌టాప్! అతని పక్కనే శారదాదేవి.

"రండి! రండి! జమిందారుగారూ! పూజారిగారూ! మీ కోసమే చూస్తున్నాం. అమ్మా! పూర్ణిమాదేవీ! ఆ టీవీ కొంచెం ఆన్ చెయ్యమ్మా!" అంది శారదాదేవి చాలా కూల్‌గా.

పూజారి అవాక్కయి, రాతిబొమ్మలా అచేతనంగా నిలబడి పోయాడు.

జమిందారు, పూర్ణిమాదేవి ఒకర్నొకరు చూసుకుని గుంభనంగా నవ్వుకున్నారు.

పూర్ణిమాదేవి హాలులో వున్న యాభైరెండంగుళాల ఆ ఎల్‌ఈడీ టీవీని ఆన్ చేసింది. దానికి కనెక్ట్ చేసి వుంది కరుణాకర్ ఒడిలో వున్న లాప్‌టాప్.

ఆ టీవీలో దృశ్యాలు కదులుతున్నాయి.

రాత్రి సమయం. అయినా గెస్ట్‌హౌస్ నాలుగు పక్కలా క్లియర్‌గా కనిపిస్తోంది. చీకటిలో సైతం చిత్రీకరించగల ప్రత్యేక కెమేరాలతో తీసినందువల్ల ఈ దృశ్యాలు చాలా స్పష్టంగా తెలుస్తున్నాయి. కొంతసేపటికి పూజారి, అతని కొడుకు నలుగురు మనుష్యులతో ఆ బంగ్లా దగ్గరకు వచ్చారు. వారందరి చేతులలో పెద్దపెద్ద కడవలు వున్నాయి. వారు సరాసరి గెస్ట్‌హౌస్ కిటికీల దగ్గరకు వెళ్ళి- ఆ కిటికీల తలుపులు తెరచి- కడవల్లో వున్న నాగుపాముల్ని కిటికీల గుండా లోపలికి వదులుతున్నారు.

"ఇపుడు ఈ టీవీకి కనెక్ట్ చేసి వున్న కేబుల్‌ద్వారా- ఇదే సమయంలో ఈ వూరి ప్రజలందరూ తమ తమ టీవీల్లో నువ్వు చేసిన ఈ ఘనకార్యాన్ని చూస్తున్నారు మిస్టర్ పూజారీ! ఏ క్షణంలోనైనా వారందరూ ఇక్కడకు రావచ్చు కూడా" అంది శారదాదేవి.

పూజారికి నిలువెల్లా చెమటలు పట్టేశాయ్. గొంతు తడారిపోయింది.

అంతే!

ఒక్కసారిగా రివ్వున బయటికి పరుగు పెట్టాడు పూజారి.

ముఖద్వారం దగ్గరున్న రైతుకూలీలు అతన్ని వడిసి పట్టుకున్నారు. పెడరెక్కలు విరిచి, తాళ్ళతో కట్టేసి, హాల్లోకి తీసుకొచ్చారు.

జమిందారు, పూర్ణిమాదేవి ఆశ్చర్యపోయి, ఆ రైతుకూలీల వైపు విచిత్రంగా

# జపాన్‌వారికి 'దానిపై' ఆసక్తి లేదట

చతుర సమాచారం

ప్రపంచంలలోని కొన్ని దేశాల విశిష్టత లేంటో తెలుసుకుందాం..

★ మైథున సుఖం అత్యంత తక్కువగా గల దేశం జపాన్. కేవలం 15 శాతం జనాభానే తృప్తికరమైన శృంగార జీవితాన్ని అనుభవిస్తున్నారు. అక్కడి 45 శాతం మంది మహిళలకు శృంగారమంటే అంత ఆసక్తి లేదు.



★ శృంగార పరంగా ఎక్కువ తృప్తిని పొందే దేశం స్విట్జర్లాండ్. 40 శాతం మందికి పైగా తమ శృంగార జీవితం అద్భుతం అని చెప్పారు. కారణం కేజీ క్లాసుల నించే సెక్స్ ఎడ్యుకేషన్, పోర్నోగ్రఫీ, వ్యభిచారాల మీద పరిమితులు లేకపోవడం.

★ ప్రపంచంలో అధిక అనుకూల రేటింగ్ పొందిన దేశం జర్మనీ. బిబిసి జరిపిన అంతర్జాతీయ సర్వేలో జర్మనీకి 59 శాతం అనుకూల రేటింగ్ వచ్చింది.

★ ప్రపంచంలో అత్యధిక ప్రతికూల దేశం ఇరాన్. అదే సర్వేలో 55శాతం వ్యతిరేక ఓట్లు ఇరాన్‌కు పడ్డాయి.

★ అత్యధికంగా కాఫీ తాగే దేశం స్వీడన్. అక్కడి ప్రజలు సగటున రోజుకి 388 మిల్లీగ్రాముల కాఫీని తాగుతారు.

★ ఆల్కహాల్ అధికంగా తాగే దేశం బెలారస్. 15 ఏళ్లల పైబడ్డవారు సగటున సంవత్సరానికి 17 లీటర్ల ఆల్కహాల్ తాగుతారు.

★ భావోద్వేగాలు అధికంగా గల దేశం ఫిలిప్పీన్స్. మామూలు ప్రశ్నలకి కూడా ఓ సర్వేలో వారు భావోద్వేగంతో జవాబులిచ్చారు.

★ అత్యంత నిర్లిప్త దేశం( స్పందనలు తక్కువగా ఉండడం) సింగపూర్. అవే ప్రశ్నలకి వీరు నిర్లిప్తంగా సమాధానాలు ఇచ్చారు.

★ అత్యధిక ఆయుర్దాయం గల దేశం మొనాకో. ఇక్కడి ప్రజల సగటు ఆయుర్దాయం 87.2 సంవత్సరాలు.

★ తక్కువ ఆయుష్షుగల దేశం సియెరా. ఇక్కడి ప్రజల సగటు ఆయుర్దాయం 47 సంవత్సరాలు. ఈ దేశం ఆఫ్రికాలో ఉంది.

చూశారు.

"వాళ్ళు నా మనుష్యులు జమిందారు గారూ! ఆ టీమ్ లీడరు అదిగో నా అసిస్టెంట్ గిరిధర్, గుర్తుపట్టలేదా మీరు? " అన్నాడు కరుణాకర్.

రైతుకూలీ వేషంలో వున్న గిరిధర్ తలపాగా, పెట్టుకున్న మీసాలు తీసి, వినయంగా జమిందారుకు నమస్కరించాడు.

"నా మనుష్యులు పదిమంది నిన్ననే నాగేశ్వరపురం వచ్చారు. రోడ్డు దారి కాకుండా- పొలాలకు అడ్డంగా రహస్యంగా రైతుకూలీల వేషంతో ఈ వూళ్లోకి ప్రవేశించారు. అంతేకాదు ఎవరికీ తెలియకుండా బయట చెట్లమీద కెమెరాలు అమర్చి రాత్రి జరిగిన సంఘటనలన్నీ వీడియో తీశారు" చెప్పాడు కరుణాకర్.

"ఈ నాగేశ్వరపురంలో పాముల పేరుతో జరిగిన దారుణాలన్నిటికీ మూల కారకుడు ఈ పూజారి. తన స్వార్థం కోసం ఇప్పటివరకూ ఎంతోమందిని బలి తీసుకున్నాడు. కానీ, ఒక్కటి మాత్రం నాకర్థం కావడంలేదు జమిందారుగారూ! కేవలం ఈ జమీన్ భూముల కోసమో, తన కొడుక్కి పూర్ణిమాదేవిని చేసుకోవడం కోసమో మాత్రం ఇంతటి ఘాతుకాలకి ఒడిగట్టాడని నేను అనుకోవడంలేదు. ఇంకేదో బలమైన కారణం వుండి వుంటుంది" అంది శారదాదేవి.

"ఏయ్ పూజారీ! దేనికోసం ఈ అఘాయిత్యాలను చేస్తున్నావు? నిజం చెప్పు?" గద్దించి అడిగారు జమిందారు.

ఈలోపల బయట కలకలం వినిపించింది. మొత్తం ఊరి ప్రజలందరూ గెస్ట్ హౌస్ ముందు గుమికూడారు.

"ఎక్కడ ఆ పూజారి? ఇంతకాలం మమ్మల్నందర్నీ భయపెట్టి, మనశ్శాంతి లేకుండా చేసిన ఆ దుర్మార్గుడు ఎక్కడ?" - అంటూ అరవసాగారు.

గిరిధర్ గెస్ట్‌హౌస్ బయటికి వచ్చి "ఆ పూజారి ఇక్కడే వున్నాడు. నేను పోలీసులకి ఫోన్ చేశాను. ఈనాటితో ఆ పూజారి అకృత్యాలకి ఫుల్‌స్టాప్ పడింది. ఇక మీదట మీరు ప్రశాంతంగా వుండవచ్చు. లోపల జమిందారుగారు పూజారిని విచారిస్తున్నారు. కొంచెం నిశ్శబ్దంగా ఉండండి" అన్నాడు.

"నిజం బయటపెట్టు పూజారి?" మరొక్కసారి గద్దించి అడిగారు జమిందారు.

నెమ్మదిగా నోరు విప్పాడు పూజారి. అతను చెబుతున్న విషయాలు వింటూ అదిరిపడ్డారు అక్కడున్న వాళ్లందరూ.

"ఈ నాగేశ్వపురం జమీన్ భూములన్నీ సారవంతమైనవి మాత్రమే కాదు అపారమైన ఖనిజ సంపద కూడా నిక్షిప్తమై వున్నాయి. ఈ జమీన్‌లో.. దక్షిణం వైపున్న కొండగుట్టలలో 'వజ్రాల గని' ఒకటి మీ నాన్నగారి కాలంలోనే బయటపడింది. ఆ విషయం బయటికి పొక్కనీయకుండా చేయడం కోసం పెద్ద జమిందారుగారిని పాముకాటుతో చంపించేశాం. మీ కుటుంబానికి పాముల శాపం వుందని- అందువల్ల పెద్ద జమిందారుగారు అలా చనిపోయారని మేం అందర్నీ నమ్మించాం. రహస్యంగా తవ్వకాలు జరిపిస్తున్నాం.

జనాలు ఎవ్వరూ ఆ చుట్టుపక్కలకు రాకుండా చేయడం కోసం ఎక్కడెక్కడి నుంచో నాగుపాముల్ని తెప్పించి, ఈ జమీన్ భూములలో వదిలి, మా కట్టుబాటులో వుంచుకున్నాం. దానికోసం ప్రత్యేకమైన సిబ్బందిని నియమించాం. మీరు ఈ జమీన్ అంతా అమ్మేస్తే- వజ్రాల తవ్వకం ఆగిపోతుందని భయపడి, కొనడానికి వచ్చిన వారందర్నీ పాముకాటు ద్వారా పరలోకానికి పంపించేస్తున్నాం. అంతే కాదు, కరుణాకర్ కారుకు గాడిద అడ్డుపడేలా చేసింది మేమే. కారు ప్రమాదం నుంచి బయటపడి- వీరంతా రోడ్డు ఎక్కిన తరువాత- ఆగి వున్న కారు లోపలికి రహస్యంగా కింగ్‌కోబ్రాను వదిలింది కూడా నా మనుషులే!

అయితే అది యాదృచ్ఛికంగా బ్రోకర్ స్వామినాథాన్ని కాటువేసి, మా పుకార్లకి మరింత బలం కలిగించింది. కానీ, ఈ కరుణాకర్, శారదాదేవి ముందు మా పన్నాగాలు సాగలేదు. వీరు చాల తెలివైనవారు. మారు వేషంలో వున్నది 'నేనే' అని గుర్తుపట్టేశారు" చెప్పాడు పూజారి తల దించుకుని.

కోపంతో రగిలిపోయారు జమిందారు. తన తండ్రిని దారుణంగా చంపిన దుర్మార్గుడు, ఇంతకాలం తన కళ్ళముందే తిరుగుతున్నాడు.

"ఇంత మందిని పొట్టన పెట్టుకున్నది ఈ పాపిష్టి డబ్బు కోసమా పూజారీ? ఎందరి ప్రాణాలు తీశావు నువ్వు? క్షమిం

**కొత్తగాలి...**

**గోల్ఫ్‌లో గోల్.. రైస్‌లో దాల్**
**ఫోన్‌లో కాల్**
**మనసులో కూల్**
**ఉంటే అదే చాల్ చాల్!**

– ముడుంబి సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

చరాని దుర్మార్గాలు నీవి! నిన్ను వూరికనే వదిలిపెట్టకూడదు" అంటూ ఆ పక్కనే గోడకు తగిలించి వున్న వేట తుపాకీని అందుకున్నారు జమిందారు దొరై సింగం.

"నాన్నగారూ! ఆవేశపడకండి! ఇంక కొద్దిసేపట్లో పోలీసులు వస్తారు. వాళ్ళే చూసుకుంటారు" అంది పూర్ణిమాదేవి.

"లేదమ్మా! ఎంత నమ్మించాడు మనల్ని! మన కులదైవంతో సమానంగా భావించాం! ఇంతకాలం మనల్ని అమాయకులు చేసి ఆడించాడు. వీడు చెప్పిందంతా చేశాం. ఇంత ద్రో-హ-మా? అసలు ఒక గుడిలో పూజారి ఇంత నెట్‌వర్క్ ప్లాన్ చెయ్యడమెలా సాధ్యపడింది? జీర్ణించుకోలేక పోతున్నాను" అన్నారు జమిందారు.

"జమిందారుగారూ! ఇంతకాలం కొల్లగొడుతూ వచ్చిన వజ్ర సంపద వల్ల- ఇతనికి అంతులేని ధనం వచ్చి చేరింది. ఆ డబ్బును ధారాళంగా ఖర్చుపెడుతూ క్రమంగా పెద్దగ్యాంగ్‌నే తయారుచేశాడు. డబ్బుంటే సాధ్యం కానిది ఏముంది చెప్పండి? ఆలోచనలు ఇతనివి. వాటిని తగిన విధంగా అమలు జరిపేది ఇతని కొడుకు. దానికి అతని ఇంజినీరింగ్ చదువు బాగా ఉపయోగపడింది" చెప్పాడు కరుణాకర్.

"అదిసరే! చుట్టూ కమ్ముకు వస్తున్న నాగులసైన్యం నుంచి మీ ఇద్దరూ ఎలా తప్పించుకున్నారు? " ఆత్రుతగా ప్రశ్నించింది పూర్ణిమాదేవి.

"ఆస్తీకముని మంత్ర ప్రభావం అమ్మా! నేను పద్మాసనం వేసుకుని, కళ్ళు మూసుకుని గంటసేపు ఆ మంత్రాన్ని జపించాను. తిరిగి కళ్ళుతెరిచి చూసేసరికి ఒక్క నాగుపాము కూడా హాలులో లేదు" చెప్పింది శారదాదేవి ఆనందంగా!

నవ్వుకున్నాడు కరుణాకర్. నిజానికి జరిగింది వేరు. తల్లి చిన్నబుచ్చుకుంటుందని ఆ విషయాన్ని రహస్యంగా ఉంచుదామని అనుకున్నాడు. కానీ, అసిస్టెంట్ గిరిధర్ ఆ రహస్యాన్ని టక్కున చెప్పేశాడు.

"చాలా సింపుల్ పూర్ణిమాదేవిగారూ! అమ్మగారు కళ్ళు మూసుకుని, అలా తపస్సులోకి వెళ్లగానే, అంతకు ముందే సిద్ధంగా వుంచుకున్న స్ప్రేయర్ల ద్వారా మత్తుమందు పాములన్నిటిపైన నాలుగు వైపుల నుంచి చల్లాం.

ఆ మత్తుకి- మొత్తం పాములన్నీ తలలు వాల్చేశాయి. వాటినన్నిటినీ -ప్రత్యేకంగా తయారుచేయించి తెచ్చిన సంచులలో విడివిడిగా ప్యాక్ చేసి, కేరళ అడవులలో వదిలిపెట్టి రావడానికి కావాల్సిన ఏర్పాట్లు చేశాం. ఈపాటికి స్పృహ వచ్చిన ఆ నాగులు కేరళ అడవులలో స్వేచ్ఛగా తిరుగుతుంటాయి" చెప్పాడు గిరిధర్ విపులంగా.

ఆశ్చర్యపోయి చూసింది శారదాదేవి- గిరిధర్ వైపు, కరుణాకర్ వైపు.

అవునన్నట్లు తల వూపాడు కరుణాకర్.

"అంతేకాదమ్మా! ఆఫ్రికా అడవులలో మాత్రమే దొరికే 'రాక్ పైథాన్' కొండ చిలువను కూడా పూజారి ముఠాకు తెలియకుండా పట్టించి, అతి రహస్యంగా నిన్న సాయంత్రమే మన గవర్నమెంట్ జూకి పంపించేశాను. ఇక బ్రోకర్ స్వామినాథం ఆసుపత్రిలో నెమ్మదిగా కోలుకుంటున్నాడు' ' చెప్పాడు కరుణాకర్ నవ్వుతూ.

"అయితే ఇక మీదట ఈ నాగేశ్వరపురంలో నాగుల బెడద తప్పినట్లే! మీరు చాలా మంచిపని చేశారు అల్లుడుగారూ!" మనస్ఫూర్తిగా మెచ్చుకున్నారు జమిందారు దొరై సింగం.

'అల్లుడుగారూ!' అని పిలవగానే పూర్ణిమాదేవి సిగ్గుతో తలదించుకుని, "అత్తా!" అంటూ శారదాదేవి పక్కకు చేరుకుంది.

ఆప్యాయంగా ఆమెను అక్కున చేర్చుకుంది శారదాదేవి.

అంతలో దూరంగా పోలీస్ సైరన్ వినిపించింది.

©

పెద్దకథ

- కె. నాగలక్ష్మి

# నేను అమ్మని

"ఏమిటీ అశాంతి? ఎందుకీ నిరంతర సంఘర్షణ? ఎవర్ని చూసినా ఏదో ఒక సమస్య. తృప్తిగా బతుకుతున్న వాళ్లే లేరా? మరయితే ఎవరూ చావకుండా అందరూ బతుకున్నారేం? ఏం బావుకుందామని? చావటం చాతకాకనా? " పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తూ ఫక్కున నవ్వాను నేను.

ఉలిక్కిపడి లేచింది పక్క మంచం మీది పేషెంట్. "ఏమిటండీ! మీలో మీరు అంత పెద్దగా నవ్వుకుంటున్నారు? అదీ ఇంత రాత్రప్పుడు? "

"అబ్బే! ఏం లేదు. ఒక హాల్లో ఉన్నాం మనం నలుగురం. ప్రతి ఒక్కరికీ ఎన్నో సమస్యలున్నాయి. బతుకంటేనే విరక్తి పుట్టించేవి. కానీ చిత్రం! చూడండి అందరం బతకాలనే కోరుకుంటున్నాం. అదే ఆశతో ఈ ఆస్పత్రిలో పడి ఉన్నాం. దీనికి కారణం ఏమిటంటారు? ఈ విషయమే ఆలోచిస్తున్నాను"

"ఏమిటోనండీ! మీ ధోరణి నాకర్థం కాదు. పడుకోండి. చాలా రాత్రయింది" అంటూ అటు తిరిగి పడుకుంది ఆవిడ.

"ఏమిటండీ.. లలితగారూ! నిద్రపట్టడం లేదా? మీకిచ్చిన టాబ్లెట్స్ అన్నీ వేసేసుకున్నారా, లేదా? " డ్యూటీ రూములోంచి జనరల్ వార్డులోకి వెళ్తూ పలకరించింది నైట్ డ్యూటీ సిస్టర్ నవనీత.

"అన్నీ వేసుకున్నాను సిస్టర్. మరి కాసేపట్లో నిద్రపడుతుందనుకుంటా"

"హాయిగా పడుకోండి ఏ ఆలోచనలూ పెట్టుకోకుండా. నిద్ర రాకపోయినా విశ్రాంతిగా ఉంటుంది" అనేసి వెళ్లిపోయింది ఆవిడ.

మళ్లీ నవ్వొచ్చింది. వీళ్ల పిచ్చిగానీ.. ఆలోచనలు, విశ్రాంతిగా ఉన్నప్పుడు కాక హడావుడిగా పనిలో ఉన్నప్పుడు వస్తాయా? ఇంటి దగ్గర ఆయన.. పిల్లలూ ఏం చేస్తున్నారో.. చిన్నది బహుశా నిద్రపోయి ఉంటుంది. పెద్దది చదువుకుంటోందేమో! వయసు వస్తోందే కానీ బొత్తిగా జ్ఞానమే రావటంలేదు. బహుశా నే ఛస్తే గానీ దానికి తెలిసిరాదేమో! ఆయనగారి గారం ఒకటి దాన్ని చెడపటానికి.

"పిన్నీ!" మృదువుగా హాయిగా ఉందా పిలుపు. కళ్లు తెరిచా. ఎదురుగా పెద్దక్కయ్య కూతురు వత్సల. నాకీ ఆపరేషన్ అనుకున్న దగ్గర్నుంచీ నా దగ్గరే ఉందది.

"వచ్చావా అమ్మా! చాలా రాత్రయితే మరి రావేమో అనుకున్నానే. ఇవాళ నాకు కాస్త బాగానే ఉంది కదా!"

"అయితే మాత్రం! ఎవ్వరూ లేనట్లు ఒక్కదాన్నీ వదిలేస్తామా? నేను ఇక్కడున్నదే నీకోసం!"

"ఎలా వచ్చావే ఇంత రాత్రి? బాబాయి దిగబెట్టేరా? "

"లేదు పిన్నీ! ఆయన వస్తే ఎలా? ఇంటి దగ్గర నిమ్మీ, మీనూ.. భయం

కదా!"

"చాలా బావుందే, నిన్ను ఒంటరిగా పంపితే మాత్రం భయం కాదూ? ఆ మని షికి ఆ మాత్రం తెలివి ఉండనక్కర్లేదా?" చాలా కోపమే వచ్చింది నాకు. కాస్త వెలు గుండగానే పంపకూడదూ పోనీ? ఇంత రాత్రివేళ.. ఆడపిల్ల ఒక్కతీ రావటమా? అసలే ఈ దేశంలో ఆడపిల్లలకి రోజులు బాగాలేవు కూడాను. ఏమన్నా అయితే.. వణికిపోయాను నేను ఆ ఊహకే.

"ఏమిటలా వణుకుతున్నావు పిన్నీ! చలే స్తోందా?" చిన్నపిల్లయినా ఏమిటో దాని మాటల్లో తీయని ఆర్ద్రత. హాయిగా మన సును స్పృశిస్తుంది. అక్కయ్య కూతు రనో.. ఏమిటో తెలియదు గానీ.. అదంటే నాకు చెప్పలేని ఆప్యాయత.

"మాట్లాడవేం పిన్నీ! చలేస్తోందా? శాలువా కప్పనా?"

"వత్సలా! నీకు చక్కటి మొగుడొస్తాడే, నిజం" నవ్వుతూ దాని కళ్లలోకి చూశాను.

సిగ్గుపడిందది. బుగ్గలు మందారాలైనై. తెల్లటి పిల్లేమో మనిషింకా ఎర్రబడింది. "పో.. పిన్నీ! అడిగినదానికి జవాబు చెప్పక మరేదో మాట్లాడుతావు దేనికీ?" అలిగినట్లుగా మూతి సున్నాలా చుట్టింది.

దాన్ని మరింత ఉడికించబుద్ధయింది. "నిజమేనే! చూడు నా మాట అబద్ధం కాదు. నిండు మనసుతో దీవించాను. అయితే ఆ రోజున మాత్రం నన్ను మర్చి పోకు సుమా!"

"అబ్బబ్బ ఏమిటి పిన్నీ! నీ దీవెనకు బోలెడు బోలెడు కృతజ్ఞతలు సమర్పించు కుంటున్నాను. సరేనా ఇక నిద్రపో" అంటూ టక్కున లైటార్పేసి పక్కమీద నడుం వాల్చిందది.

సిగ్గుపడిందేమో పిచ్చిపిల్ల. ఈ ఏడాది ఎలాగైనా దాని పెళ్లి చేసెయ్యాలని చూస్తు న్నారు అక్కయ్యా వాళ్లు. మంచి సంబంధం చూసి చెయ్యాలి దానికి.

నిద్రపట్టటం లేదు. ఎంతసేపని నోరు మూసుకోవటం?

"నిద్రపోయావే వత్సలా?" అన్నాను కిందికి చూస్తూ.

"ఇంకాలేదు పిన్నీ! ఏమన్నా కావాలా?" వెంటనే లేచింది.

"ఏం అక్కర్లేదుగానీ.. అంతా ఎలా ఉన్నారే, పిల్లలేమంటున్నారు?"

నిట్టూర్చింది అది. "ఏం చెప్పమం టావు? గారం ఎక్కువై.. వాళ్లలా ఉన్నారు. పెంకితనం అయితే ఫర్వాలేదు కానీ పిన్నీ! లోకజ్ఞానమే లేకపోతే ఎలాగ?"

"ఏమయిందే? అసలు విషయం చెప్పు"

"అబ్బే ప్రత్యేకంగా ఈ రోజు ఏమీ కాలేదు పిన్నీ! నిమ్మి అమాయకత్వం చూస్తుంటే నాకు నవ్వాలో ఏడవాలో అర్థం కాదు. రోజూ ఆ వంటావిడతో పోట్లాట వేసుకుంటుంది. మన అవసరమే తల్లీ! కాసేపు నోరు మూసుకో" అంటే వినదు కదా! ఆవిడా సరిపోయింది. దీన్ని ఉడికించటానికి ఏదో ఒక వెధవ పని చేస్తుంది. ఇద్దరి మధ్యా సయోధ్య కుదర్చ టానికి నేను చెయ్యని ప్రయత్నమంటూ లేదనుకో"

"అవునే వత్సలా! ఇది నిజంగా చాలా చికాకు పనే!"

"సరే ఇంకొకటి విను. చదువుకుంటు న్నానంటుందా? నీ ఫొటోలన్నీ ముందు వేసుకుని కూర్చుంటుంది. దానికి తోడు బాబాయిగారు కూడాను. 'ఫొటోలేం ఖర్మ.. రోజూ ఒక్కసారి ఆస్పత్రికెళ్లి అమ్మను చూసి రారాదుటే' అంటానా 'అబ్బో నాకు తీరిక లేదు' అంటుంది. నీమీద ప్రేమ ఉందని అనుకోవాలో లేదని అనుకోవాలో నాకర్థం కాదు"

"మాట కరుకే గానీ వత్సలా! నీమూ మనసు చాలా మెత్తనే!"

"అవును పిన్నీ! సరే ఇది రోజువారీ

జరిగే భాగవతమేగా! ఇక నిద్రకి ప్రయత్నం చెయ్యరాదూ. అబ్బో! పన్నెండు అవుతోంది. ఈసారి నర్సు వస్తే నిన్నూ నన్నూ కూడా తిడుతుంది"

"ఏం తిట్టదు. నేను బాగా టిప్స్ ఇస్తు న్నాగా!"

కోపం వచ్చింది వత్సలకి. "నువ్వసలు ఇక్కడికి ఎందుకొచ్చావు చెప్పు? నిద్ర మేలుకుని కబుర్లు ఆడటానికా? లేక నర్సు లకి టిప్స్ ఇవ్వటానికా? " విసురుగా అంది. అంతలోనే సౌమ్యంగా మళ్లీ అంది. "రాత్రిళ్లు త్వరగా నిద్రపోవడానికి ప్రయత్నం చేశావంటే నీ ఆరోగ్యం బాగుప డుతుంది పిన్నీ! త్వరగా ఇంటికి వచ్చేద్దువు గానీ నీకోసం అంతా ఎంత ఆరాటపడుతు న్నారో తెలుసా? "

"సర్లేవే. నువ్వంతగా చెప్పాలా? ఇక నిద్రపోతానే! పడుకో నువ్వు కూడా" అంటూ పక్కకి తిరిగాను. ఉహుc. కళ్లు మూతలు పడందే! పత్తి కాయల్లా విచ్చు కునే ఉన్నాయి.

"పెంకితనం అయితే ఫర్వాలేదు. కానీ బొత్తిగా లోకజ్ఞానం లేకపోతే ఎలా? " వత్సల మాటలే పదే పదే గింగురుమంటు న్నాయి చెవుల్లో. అందరూ అంటారు ఏం పెంపకమని. నిమ్మీని చూస్తే నిజం. నాకే భయం వేస్తుంది. ఎలా నెగ్గుకొస్తుందీ లోకంలో. ఇటు తెలియనితనం కాదు. అటు అర్థం చేసుకునే జ్ఞానంలేదు. మళ్లీ చదువులో మాత్రం.. అన్నింటా ఫస్టే! లోకజ్ఞానం నేర్పని చదువు.. ఏం చదు వదీ? దానికంటే మీనా కాస్త నయం. ఎవరి దగ్గర ఎలా మసలుకోవాలో తెలుసు. బతకనేర్చిన పిల్ల అది. దాని గురించి దిగులు అక్కర్లేదు.

వత్సల చిన్నదైనా ఎన్ని తెలివితేటలు! ఇంట్లో అమ్మకీ, నాన్నకీ, తమ్ముళ్లకీ, చెల్లెళ్లకీ అందరికీ తల్లో నాలికే. పాపం దాన్నిటు పంపి వాళ్లెంత అవస్థ పడుతున్నారో.. ఆయనకైనా లేదు జ్ఞానం. పద్దెనిమిదేళ్ల పిల్లను రాత్రి పదిగంటల వేళ పంపి స్తారా? దిగబెట్టి పోకూడదూ? వంటా విడ పేరుకే ఉన్నది కానీ అంతా వత్సలే చూసుకోవాలి. నాకు బాగవుతుందా? నేన సలు ఇంటికెళ్తానా? నేను లేకపోతే నా పిల్లలు.. పిల్లలు.. సన్నగా బాధ మొద లైంది. తల్లో నరాలు తెగుతున్నట్టు. అబ్బా! వాళ్లని ఎవరు చూస్తారు. ఎవరు చూస్తారు? "వత్సలా! వత్సలా నర్స్‌ని కేకెయ్యి. నొప్పి నొప్పి" వీలయినంత గ ట్టిగా అరిచాను.

అలిసిపోయిందేమో నిద్రపోతోంది, అది లేవలేదు.

ఎలా భరించటం? ఎలా ఎలా.. "సిస్టర్.. సిస్టర్!" కేకలేస్తున్నాను. కానీ ఏదో మగతగా ఉందే.. ఏదో చప్పుడు విని పిస్తోంది. ఈలోగా పోదుకదా ఈ ప్రాణం..

★ ★ ★

"ఏవమ్మా! వత్సలమ్మగారూ! వంట తొందరగా కావాలన్నారు ఏమిటి విశేషం? " వంటావిడ వర్ధనం గారు కూర్చున్న చోటునుంచీ కదలకుండా అడి గింది.

"అవునండీ! నిన్న బాగా ఆలస్యం అయింది కదా! అంత లేటుగా రావద్దని పిన్ని కేకలేసింది. రాత్రి ఎంతకీ నిద్రపోలే దేమో తెల్లారురఝామున విపరీతమైన నొప్పితో బాగా బాధపడింది. డాక్టరు వచ్చి నిద్రకి ఇంజెక్షన్ ఇస్తేనే పడుకుంది"

"అలాగా అమ్మా! అయితే ఆవిడ ఆరోగ్యం ఇంకా బాగవలేదా! ఇంకా ఇవ్వాళో రేపో ఇంటి కొచ్చేస్తారని అనుకుం టున్నానే"

"అలాగనే దేవుడికి ప్రార్థన చేద్దామండీ. మీరు కాస్త త్వరగా పని ముగిస్తే నేను ఆరున్నరకల్లా బయల్దేరి వెళతాను" మరో మాటకి ఆవిడకి అవకాశం ఇవ్వకుండా

పిల్లల రూములోకి వచ్చింది వత్సల.

"నిమ్మీ! ఈరోజు మీ అమ్మని చూడ్డానికి మీ ఇద్దరూ రండే. రోజూ మిమ్మల్ని గురించి అడుగుతుంటుంది పిన్ని. అప్పుడే నాలుగురోజులు అయిపోయిందిగా నువ్వు అమ్మని చూసి"

"సర్లే అక్కయ్యా! నువ్వు వెళ్తున్నావు చాలదూ! అందరూ ఆవిడకోసం హాస్పిటల్‌లో కూర్చుంటే ఎలా? నా పరీక్షలు ఎవరు రాస్తారేమిటి?

"అదికాదే. నువ్వేం అక్కడ ఎక్కువ సేపు ఉండొద్దు. 'పరీక్షలమ్మా' అన్నావంటే తనే నిన్ను వెళ్లిపొమ్మంటుంది. అయినా ఓ గంటలో ఎంత చదువుతావు? ఎంతైనా అమ్మకదా! ఇంత పెద్ద ఆపరేషన్ అయి అక్కడుంది మీ అమ్మ. నిన్నూ చెల్లినీ రోజూ కలవరిస్తోంది తెలుసా? "

"బోరు కొట్టకు అక్కయ్యా! అమ్మని రోజూ ఫొటోల్లో చూస్తూనే ఉన్నా నేను. అయినా ఎందుకుట కలవరించటం? మాకేమైనా ఏమన్నా చేసిందా, పెట్టిందా? పైగా తన జబ్బుతో హడలకొట్టించేది రోజూ"

"నువ్వే ఒప్పుకుంటున్నావు కదా జబ్బుని. అలాంటి మనిషి నీకు ఏం చేసిపెడుతుంది చెప్పు? అయినా ఓపిక ఉన్నన్నాళ్లు చేసింది కదా"

"పిల్లికి ఎలక సాక్ష్యంట. బాగానే ఉంది. తనంటే నీకిష్టం. నువ్వంటే తనకిష్టం. నేనంటేనే ఎవరికీ ఇష్టంలేదు"

"నీకు సౌమ్యంగా చెప్పాలంటే నావల్ల కావడంలేదు. నిమ్మీ, మరీ చిన్నపిల్లవు కాదు నువ్వు. ఆలోచించు. అమ్మకి నువ్వంటే ఇష్టంలేదూ! గుండెమీద చెయ్యి వేసుకు చెప్పు? " కోపంగా అంది వత్సల. "క్షణం క్షణం మిమ్మల్నే అడుగుతోందే. ఏం చెప్పంటావు. పరీక్షలు, పరీక్షలు అని చెప్పి నా నోరు పడిపోయింది. ఓ అర గంట ఆగి మళ్లీ అడుగుతుంది. అయినా మీరు మాత్రం మనుషులు కారే! అమ్మని... అంత పెద్ద ఆపరేషన్ అయి చచ్చి బతికిన అమ్మని చూడాలని అనిపించదూ? నీకు కోపం వచ్చినా సరే నిమ్మీ! ఒక్కమాట మాత్రం చెప్తున్నాను. రోజూ అమ్మ ఫొటోలు చూస్తూనే ఉన్నానన్నావు. రేపు తన ఫొటో చూసి బతికుండగా చూడలేకపోయానే అని మాత్రం ఏడవద్దు" ఏం మాట్లాడుతోందో తెలియనంత ఆవేశంగా అంది వత్సల.

"ఏమిటక్కయ్యా అంత తీవ్రంగా మాట్లాడుతున్నావు విప్లవకవి లాగా? " అంటూ వచ్చింది మీను ట్యూషన్ నుంచి.

"మనం ఆవిడగార్లా రోజూ హాస్పిటల్‌కి దయచెయ్యటం లేదుట. సాధిస్తోంది. వెళ్లి ఏం చెయ్యాలో అడుగే మీనూ? " చిరాగ్గా అంది నిమ్మి. ఏమంటుందో అన్నట్టుగా చూసింది వత్సల మీనాకేసి. చిన్నగా నవ్వింది అది. ఏం మాట్లాడలేదు. భలే టక్కరి అది నిజంగా.

"ఏమిటే మీనూ? మీ అమ్మ ఉందనుకున్నారా? చచ్చిందనుకున్నారా? " దురుసుగా ఉన్నాయి వత్సల మాటలు.

"వర్ధనం గారి వంట అయిందా అక్కయ్యా? "

"ఇంకా మొదలు పెట్టిందో లేదో? ఏం అయినా ఈ వేళింత తొందర? "

"ఎక్కడికైనా వేంచేస్తున్నారేమో చిన్న

**కొత్తగాలి...**

**ఈశాన్యంలో గుంట**
**ఆగ్నేయంలో మంట**
**ఉండాలోయ్ ప్రతి ఇంట**
**లేకుంటే కాదా తంటా?**

– యు.భ.వ. రావు,
చిలకలూరి పేట

రాణీగారు" నిమ్మి ఏది మాట్లాడినా పుల్ల విరుపుగానే ఉంటాయి తన మాటలు.

"ఒకసారి మహారాణీ గారిని దర్శించి వస్తానండీ పెద్ద రాణీగారూ!" అని నిర్మ లకి జవాబిచ్చి "వత్సలక్కయ్యా అమ్మకి భోజనం తీసుకుపోదాం. కాస్సేపుండి నేనింటికి వచ్చేస్తా" అంది.

"అదా సంగతి మహాతల్లీ! చీకటి పడ్డాక నువ్వొక్కదానివే ఇంటికొస్తే నాన్న నన్నూ తిడతారు. నేనూ వస్తా పద" గబగబా లేచింది నిమ్మి చీర మార్చటానికి.

'హమ్మయ్య'! అనుకుంది వత్సల. ఎలా గైతేనేం ఈ అక్కచెల్లెళ్లిద్దరూ తల్లిని చూడ్డా నికి వస్తున్నారు.

★ ★ ★

అబ్బా! వారం తర్వాత చూస్తున్నాను నా పిల్లల్ని. ఎవరెంత తిట్టిపోసినా వాళ్లు నా పిల్లలే! లోకజ్ఞానం లేదు నిమ్మీకి. అయినా వయసెంతనీ? ఇంకాస్త పెరిగితే అదే వస్తుంది.

"బాగా చదువుతున్నావే నిమ్మీ? " ఆప్యా యంగా దగ్గరగా తీసుకున్నాను దాన్ని.

"ఏదో చదువుతున్నాలే కానీ.. రోజు రోజూ ఎందుకమ్మా మమ్మల్ని అడుగుతా వట? నీకోసం ఆస్పత్రి చుట్టూ తిరుగు తోంటే మా చదువులు ఎవరు చదువు తారేం? మమ్మల్ని మర్చిపోరాదూ కొన్ని రోజులు? "

"అదేమిటే తల్లీ! అలాగంటావు? మిమ్మల్ని మర్చిపోవటమా? మీకోసం కాక పోతే నేనసలు బతికున్నదెందుకే? " కంఠం బొంగురుపోయింది. కళ్లలో నీళ్లు తిరిగాయి.

చప్పున వత్సల దగ్గరగా వచ్చింది. "పిన్నీ!" అంది మందలింపుగా. "ఇంత చిన్నచిన్న వాటికి కదిలిపోతావేమిటి? డాక్టర్స్ ఏం చెప్పారో మర్చిపోయావా? "

నాకేం మాట్లాడాలని అనిపించలేదు.

"అమ్మా! నీ ఒంట్లో ఎలా ఉంది? త్వరగా ఇంటికొచ్చేస్తావా? " మీను నిజంగా చాలా గట్టిది. సంభాషణ టక్కున మార్చే సింది.

"త్వరగా వచ్చెయ్యాలనే తల్లీ నా ఆరా టం కూడా. నువ్వు, అక్కయ్య పోట్లాడు కోటం లేదుకదూ? శ్రద్ధగా చదువుకోండి. నే ఇంటికొచ్చేదాకా మీకీ బాధ తప్పదే"

"బాధేం లేదమ్మా. అంతా మామూలే. వత్సలక్కయ్య ఉందిగా అన్నీ చక్కదిద్దటా నికి. ఇంటి గురించి, మా గురించి నువ్వేం బెంగ పెట్టుకోకమ్మా, త్వరగా ఇంటికి వచ్చెయ్!!"

ఈ మాటలు పెద్దది నిమ్మి అని ఉంటే ఎంత బావుండేది? ప్చ్ దేనికైనా ప్రాప్తం ఉండాలిగా!

"నిమ్మీ నువ్వు ఆ వంటావిడతో ఏం మాటలు పెంచుకోకమ్మా. ఏదో టైమ్‌కి ఇంత ఉడకేస్తుంటే మన పని గడుస్తోంది. ఆవిడా వెళ్లిపోయిందంటే మీకే కష్టం"

"ఛీ ఛీ... ఆ మనిషిని తల్చుకుంటేనే నాకు వళ్లు మండుతుందమ్మా. అన్నీ వెధవ పనులే చేస్తుంది. ఇవన్నీ సరే గాని నాన్న గారితోటే ఎప్పుడూ మాట్లాడుతూ ఉంటుంది. పైట సరిగ్గా కూడా వేసుకోదు. ఛీ ఛీ భలే లేకి మనిషి బాబూ" అసహ్యం అంతా ముఖంలోనే వ్యక్తం చేసింది నిమ్మి.

కలుక్కుమంది మనసులో. నిజమే ఆవిడ.. వర్ధనమ్మ గారు చాలా లేకి మనిషి. చిన్నప్పుడే భర్త పోవటం, వయ సులో తీరాల్సినవి తీరకపోవడం వల్లనేమో ఆ ప్రవర్తన అయినా ఆవిడననటం ఎందు కు? మన బంగారం మంచిదయితే. ఏమి టీ ధోరణి? లాభం లేదు. ఆలోచనలు మార్చెయ్యాలి.

"పిన్నీ! వాళ్లు రానంతసేపు పిల్లలు, పిల్లలు అని అడుగుతావు. వస్తే ఇదేమిటీ ఇలా ఆలోచనల్లో పడిపోతావు? "

నా మనసులో రగులుతున్న ఆవేదన

దానికేం తెలుసు పాపం, వత్సల చిన్నపిల్ల. బరువుగా నిట్టూర్చాను.

"త్వరగా మాట్లాడి వాళ్లని ఇంటికి పంపెయ్యి. పాపం పరీక్షలు దగ్గర పడుతున్నాయి" అని నాతో అని "ఇంకా ఉంటారా బయల్దేరుతారా మీనూ? " అంది వత్సల.

"అమ్మా వెళ్లిరామా? అక్కయ్య ఇంకా బోలెడు చదువుకోవాలి. నాన్నని రమ్మని చెప్పనా? "

"మీనూ! నాతల్లీ!" ఏదో చెప్పాలనుకున్నాను. కంఠం మూగవోయింది. మాట రాలేదు. కళ్లు నీళ్లతో నిండిపోయాయి.

## కొత్తగాలి...

**సైకతంతో అవుతుంది**
**హర్మ్యాల నిర్మాణం**
**సై'ఖతం' తో కాగలదు**
**వాగుల నిర్వాణం**

– ముదుంబ సీత,
భద్రాచలం, ఖమ్మం జిల్లా

"రావాలనిపిస్తే ఆయనే వస్తారు. నువ్వేం చెప్పద్దు. వెళ్లిరండి పొద్దుపోయింది" అతి ప్రయత్నం మీద అన్నానా మాటలు. ఇద్దరూ కదిలారు. నేను మానసికంగా చాలా కదిలిపోయాను. దిండులో తల దూర్చి బావురుమన్నాను. పిల్లల్ని పంపి, లోపలికి వచ్చిన వత్సల నన్ను చూసి చాలా ఆశ్చర్యపడింది. చిన్నదయినా ఆరిందాలా కోప్పడింది.

"ఇప్పుడేమయిందనీ అంత దుఃఖపడతావు పిన్నీ? ఇలా ఏడిస్తే నీ ఆరోగ్యం ఎలా బాగవుతుందీ? "

నేనేం చెప్పలేకపోయాను. నా కన్నీళ్లకి కారణం నాకే పూర్తిగా అర్థం కాలేదు.

"చిన్నపిల్లలా చెప్పిన మాట వినకుండా ఏమిటి నువ్వు? బాబాయిగారు రాలేద నేనా? వస్తార్లెద్దూ. రేపు తప్పకుండా రమ్మని చెప్తాను ఆయన్ని"

పొంగు చల్లారింది. చిన్నపిల్లలు. వీళ్ల ముందు నేనిలా బయటపడి పోవటం ఏమిటి? నన్ను నేనే మందలించుకున్నా.

"అదికాదే వత్సలా! నిమ్మీని చూస్తుంటే.. దానికి కాస్త తెలివితేటలు ఎప్పుడొస్తాయో నని నాకు చాలా ఆరాటంగా ఉందే" నే చెప్పిన కారణం నాకే అసమంజసంగా తోచింది.

"పోనీలే పిన్నీ. మరికొన్ని రోజులు గడిస్తే అదే మారుతుంది. కాలాని కన్నా పెద్ద గురువెవరు? దాని గురించి బెంగపెట్టుకోవాలా? నీకు బాగయ్యి ఇంటికొచ్చాక కొన్ని రోజులు దాన్ని నాతో మా ఇంటికి పంపించు. కాస్త అన్నీ చూస్తుంటే అదే మారుతుంది. ఇలా ప్రతి చిన్నదానికి బాధ పడుతుంటే నీ ఆరోగ్యం ఎప్పటికి బాగవుతుంది చెప్పు? "

"కాస్త హార్లిక్స్ ఇవ్వవే తాగి నిద్రపోతా"

హడావుడిగా హార్లిక్స్ కలిపి చేతికందించింది వత్సల. "లైటు తీసెయ్యనా? కాసేపుంచమంటావా? "

"తీసెయ్యి. లైట్ ఉంటే నిద్ర అసలు పట్టదు" చీకట్లో పడుకుంటేనే హాయిగా ఆలోచించుకోవచ్చు. వెలుతుర్లో అయితే వత్సల పట్టేస్తుంది. హార్లిక్సు వెచ్చ వెచ్చగా గొంతు దిగుతోంది.

"పిన్నీ! నేనొక పదినిముషాలు అలా వెళ్లొస్తాను. మాలతీ సిస్టర్ దగ్గర మంచి మంచి పుస్తకాలున్నాయి. ఒక్కసారి అలా చూసొస్తాను ఆ కప్పు పక్కనుంచి, నిద్రకు ప్రయత్నం చెయ్యి" అంటూ బయటకు వెళ్లిందది.

★ ★ ★

ఉండి ఉండి ఉప్పెనలా దుఃఖం ముంచుకొస్తోంది. ఎందుకో కారణం నాకే తెలీదు. ప్రతి చిన్న విషయానికీ చలించి

పోతాను నేను. ఈ గుణం చిన్నతనం నుంచీ ఉన్నదే. ఈనాడు కొత్తగా వచ్చిందేమీ కాదు. కానీ శారీరక దౌర్బల్యం వల్ల ఉన్న కాస్త మనోనిబ్బరం కూడా లేకుండా పోతోంది.

ఇన్ని రోజులై హాస్పిటల్‌లో ఉన్నాను. ఆపరేషన్ కాగానే చూశానంతే ఆయన్ని. ఇంతదాకా మళ్లీ రాలేదు. చూడాలని ఉండదూ మనిషికి? మాదేం ప్రేమ వివాహం కాదు. కానీ ఇన్నేళ్లు కలిసి బతికిన అనుబంధం.. పిల్లలు అన్నీ కల్ల లేనా ? ప్చ్. ఎంత సరిపెట్టుకుందామన్నా నాకు సాధ్యం కావటం లేదు. ఆయన్ని చూడాలనే తహ తహ మరీ ఎక్కువైంది. ఇవాళ పిల్లల్ని చూడటం వల్ల కాబోలు. కానీ.. కానీ నేను ఇప్పుడు ఇంటికి వెళ్లేస్థితిలో లేను. ఆయన రారు. ఎలా? ఇదే.. ఇదే.. మామయ్య అయితే.. ఛీ! ఏమిటీ వెధవాలోచనలు? గతజల సేతు బంధనం నిష్ప్రయోజనం అని తెలిసీ ఎందుకిలా వెర్రి మొర్రి ఆలోచనలు?

"పిన్నీ! ఇంకా నిద్రపోలేదూ? ఇందాకే నిద్రొస్తోంది అన్నావు? " ఆశ్చర్యంగా అడుగుతోంది వత్సల.

"నిద్రొచ్చినట్టే అనిపించిందే. తీరా దానికి ఉపక్రమిస్తే అల్లంత దూరం పారిపోయింది"

"అలాగా!" నవ్విందది.

"సర్లే. పొద్దుపోయింది పడుకో. రేపు పొద్దుటే నువ్వు త్వరగా పోవద్దూ! అన్నట్టు.. అమ్మా వాళ్లకి ఉత్తరం రాసేవే వత్సలా? "

"లేదు పిన్నీ. రేపు రాస్తాను. అమ్మావాళ్లకీ, అమ్మమ్మా వాళ్లకి కూడా రాయాలి. మా ఫ్రెండ్స్ ఇద్దరు రాశారు. వాళ్లకీ ఇంకా జవాబివ్వలేదు నేను"

"సర్లే. ఉత్తరాలు మాత్రం క్రమం తప్పకుండా రాయి. ఇక పడుకో" బలవంతాన నిద్ర కొరిగాను నేను. వత్సల పగలల్లా అలిసిపోయిందేమో పడుకోగానే నిద్రపోయింది.

★ ★ ★

"గుడ్‌మార్నింగ్ లలితగారూ! ఇవ్వాళెలా ఉన్నారు? కులాసానా? " మందు తీసుకొచ్చిన సిస్టర్ ఆప్యాయంగా పలకరించింది. వీళ్లింత ఓపిగ్గా, ప్రేమగా ఎలా మాట్లాడగలరో ఇంతమంది పేషెంట్స్‌తో. ఆశ్చర్యం అనిపిస్తుంది.

ప్రతిగా నవ్వుతూ అన్నాను. "గుడ్‌మార్నింగ్ సిస్టర్. మీ దయవల్ల కులాసానే. ఇంత ఆప్యాయంగా పలకరించే మిమ్మల్నంతా చూస్తోంటే నాకసలు ఇంటికెళ్ల బుద్ధి కూడా కావటం లేదు"

"అదేం మాట. ఎల్లకాలం ఉండి పోతానంటే ఎలా? ఇదేమన్నా మీ అత్తారిల్లు అనుకున్నారా? వీలయినంత త్వరలో బాగుపడి వెళ్లిపోవాలి. అన్నట్టు ఇంకో మాట చెప్పటం మర్చాను. అమెరికా నుంచి ఒక మంచి న్యూరాలజిస్ట్ వచ్చారు. మీది చాలా వైవిధ్యమైన కేసు కదా! అందుకని ఆయనతో మిమ్మల్ని ఎగ్జామిన్ చేయిద్దామనుకుంటున్నారు"

"అల్లాగా. ఎవరు సిస్టర్, ఆయన పేరేమిటి? "

"డా. కృష్ణ అనుకుంటుంటే విన్నాను. ఆ.. ఇక నేనొస్తాను. ఇంకే దిగులు పెట్టుకోకండి"

"అలాగే, అలాగే సిస్టర్" పొడిపొడిగా అన్నాను. డా. కృష్ణ! చివరికి ఈ విధంగా కలుసుకుంటున్నామా.. మామయ్యా మనం? నిర్లిప్తంగా ఉండటానికే ప్రయత్నించాను.

"అదేమిటండీ లలితగారూ? కృష్ణ కృష్ణ అంటున్నారూ? ఆ డాక్టరు గానీ మీకు తెలుసా ఏమిటండీ? " పక్క బెడ్ మీది పేషెంట్ ప్రశ్న నా ఆలోచనలను చెదరగొట్టింది.

"డాక్టర్ తెలియదు గానీ.. కృష్ణ అని




నాకొక మామయ్య ఉండేవాడు"

"ఇప్పుడు లేరా పాపం!"

"ఉహూ" అన్నాను తలతిప్పుకుంటూ.

ఎంత ప్రయత్నించినా ఎన్నిసార్లు మనసుకు నచ్చచెప్పుకున్నా ఏదో ఒక మూల మామయ్యా మామయ్యా అని కలవరిస్తూనే ఉంది మనసు. దాన్ని ఎలా అణచిపెట్టటం. ఇన్ని సంవత్సరాలు గడిచాయి. అనుభవాల పుటలు తిరిగిపోయాయి. అయినా ఇంకా నా మనసులో ఆ స్పందన అలాగే నిలిచిపోయింది.

ఇలా జరిగినవన్నీ తల్చుకుని ఏడవటమే నా జాతకంలో రాశాడు కాబోలు దేవుడు. అయినా ఈ మనసెంత బుద్ధిలేనిది? బొత్తిగా నా వశంలో ఉండదు.

"లలితా! లలితా! ఏమిటంత పరధ్యాన్నం? "

ఎదురుగా ఆయన నిల్చుని ఉన్నారు. నమ్మలేకపోయాను. కాస్త దగ్గరికి వస్తే ఆయన గుండెలో తలదాచుకునేదాన్ని. హాయిగా బాధంతా ఉపశమించేలా ఏడిచేదాన్ని, కానీ ఆయన దూరాన కూర్చున్నారు.

"ఏమండీ! వచ్చారా!" అతి ప్రయత్నం మీద అన్నానా మాటలు.

ఆశ్చర్యంగా చూశారు. "ఎందుకు రాను? "

"ఇలా దగ్గరగా రండి" అంటూ పక్కకు జరిగాను. వచ్చారు. నా మంచం మీద కూర్చున్నారు. ఇన్నాళ్ల కరువుతీరేలా చూసుకున్నాను ఆయన్ని. ఆయన చూపులో బాధ్యత మాత్రమే ఉంది.

నాక్కావలసిన ఆప్యాయత ఏదో లోపించింది.

'కాఫీ తెచ్చాను. తాగుతావా? " మామూలుగా అడిగారు.

"కాస్త విషం ఇవ్వండి. తాగుతా. ఇలా మీ సాన్నిధ్యంలో హాయిగా నిద్రపోతా శాశ్వతంగా" ఏదో అడిగితే ఏదో చెప్పాను. తెల్లబోయారు.



"అదేమిటి లలితా! ఎందుకలా మాట్లాడుతావు? "

"నాకు కావలసింది అంతేనండీ. మీరు ఇంటికెళ్ళిపోతే మళ్ళా ఎన్నో రోజులకి గానీ రారు. నాకేమో అనుక్షణం మిమ్మల్ని చూడాలని అనిపిస్తూనే ఉంటుంది. ఇంటికి నే వచ్చేసినా మనం ఎప్పుడూ తీరిగ్గా చూసుకోం. మాట్లాడుకోం అందుకే.."

"పిచ్చి" ఆర్ద్రంగా అన్నారు తలమీద చేయి వేసి నిమురుతూ. "నువ్వు ఇంటికొచ్చేయాలని నేనెంత ఎదురు చూస్తున్నానో తెలుసా? నువ్వు వెర్రి మొర్రి ఆలోచనలేం పెట్టుకోకుండా త్వరగా రావాలి. నిన్ను ఇలా హాస్పిటల్‌లో చూడటం నాకెంత బాధగా ఉంటుంది? అందుకే నేను ఇక్కడికి రాలేను. నన్నర్థం చేసుకోవూ? " దీనంగా ఉంది ఆయన చూపు.

"నన్ను తీసుకెళ్లిపోండి. ఇక ఇక్కడ ఒక్కక్షణం కూడా ఉండను" వెక్కి వెక్కి ఏడ్చేశాను. బాధ మొదలైంది. ఒళ్ళంతా అదురుతోంది. హడావుడిగా లేచారాయన. "డాక్టర్ డాక్టర్!" అంటూ వార్డు బయటికి పరుగెట్టడం వరకే తెలుసు నాకు.



★ ★ ★

"ఏంటి సిస్టర్? ఎందుకలా హడావుడిగా తిరుగుతున్నారు అంతా? "

"ఎవరో పెద్ద డాక్టర్ వచ్చారు కదండీ. హాస్పిటల్ అంతా చూపిస్తున్నారు. మీ జబ్బులాంటి మరికొన్ని క్లిష్టమయిన కేసుల్ని ఆయనకి చూపించే ప్రయత్నం చేస్తున్నారు కూడాను"

వచ్చాడన్నమాట! ఇంతకీ ఇతను నా మామయ్య అవునో కాదో. ఎందుకీ దిగులు. మామయ్య అయితేనేం. ఒకసారి చూస్తాను. "బాగున్నావా మామయ్యా? " అంటాను, అంతేగా.

దానికి "నువ్వులేని నేను ఎలా బాగుంటాను లలితా? " అంటాడా మామయ్య? ఇదివరకు కలిసినప్పుడు అలాగే అన్నాడు. ఇప్పుడూ అదే అంటాడా. ఏమో. కాసేపట్లో ఇటు వస్తారు వాళ్ళంతా. అతను.. మామయ్య కాకపోవచ్చు కూడా.

"వత్సలా! ఇవాళ నువ్వు ఇంటికెళ్ళలేదేమిటే? " నా దగ్గరే ఉందది రాత్రి నుంచీ. రోజూ పొద్దుటే వెళ్ళిపోతుంది. ఇవాళేమో ఇంకా కదల్లేదు.

"ఇప్పుడు బాబాయి కూడా వస్తారు పిన్నీ! నిన్న డాక్టర్ చెప్పారు రమ్మని. ఇవాళ నిన్ను ఆ కొత్త డాక్టర్ ఎవరో ఎగ్జామిన్ చేస్తారట. నేను అదయ్యేదాకా ఇక్కడే ఉంటాను. నాకూ భోజనం తెమ్మని చెప్పాను బాబాయితో"

"ఆహాc. నాతో ఎవరూ చెప్పలేదే? "

"రాత్రి నువ్వు త్వరగా నిద్రపోయావు కదూ! ఆ తర్వాత సిస్టర్ వచ్చి చెప్పింది నాతో. బాబాయికేమో మన డాక్టర్ గారే ఫోన్ చేసి చెప్పారట"

"తడిబట్టతో మొహం తుడుస్తాను పిన్నీ! బట్టలు మార్చమంటావా? "

"ఎందుకే ఇప్పుడిదంతా? నాకేమిటో ఓపిగ్గా లేదు. పోనిద్దూ!"

"అదికాదు. వాళ్లు ఇప్పుడు ఇక్కడికి వస్తారేమో. కాస్త శుభ్రంగా కనిపిస్తే నయం కదూ!" బలవంతంగానే అన్నీ చేసిందది. యాంత్రికంగా చేయించుకున్నాను నేను.

"నిన్న అమ్మమ్మ లెటర్ రాసింది పిన్నీ. సీత పిన్నివాళ్లు అమెరికా నుంచి వచ్చేస్తున్నారట. వాళ్ల పిల్లలిద్దరూ కులాసాగా ఉన్నారుట... పెద్దమామయ్య వస్తాడుట వచ్చే నెలాఖర్లో. వీలయితే అప్పటికి అమ్మమ్మ కూడా వస్తుందిట. మా అమ్మకేమో మొన్న వారంరోజులు జ్వరం వచ్చి తగ్గిందట"

"అయ్యో.. అయ్యో.. ఏం అవస్థపడ్డాడో బావ! నువ్విక్కడ ఉన్నావు. మీ ఇంట్లో అమ్మ పడకేస్తే అందరికీ ఇబ్బందే.

"ఇప్పుడు కులాసాగానే ఉందిటలే. అయినా ఇంకో పదిరోజుల్లో నే వెళ్లిపోతా పిన్నీ!"

"ఏమిటి.. ఇంటిమీద గాలి మళ్లిందా? "

"ఆహాc.. అదికాదు. ఇప్పుడు నువ్వు కాస్త ఆరోగ్యంగానే ఉన్నావు కదా! ఇంకో పది రోజుల్లో ఇంటికొచ్చేస్తావని ఆశ. ఆ తర్వాత నీ ఇంట్లో నువ్వు. ఇక నేనెందుకు? "

"సర్లే చూద్దాం అప్పటిమాట"

మాటల మధ్యలోనే వాళ్లంతా వచ్చారు నా గదికి. వత్సల హడావుడిగా లేచింది. అమెరికా నుంచి వచ్చిన ఆ డాక్టర్.. ఎవరు? ఎవరు నా మామయ్యే.

అబ్బా! ఎలా మారిపోయాడో. ఎంతో ఉత్సాహంగా ఉండేవాడు. ఇలా నిర్లిప్తంగా, నీరసంగా తను అలా కనిపిస్తుంటే రంపపుకోతగా ఉంది.

నేనింకా ఎందుకు బతికున్నాను? నిక్షేపంలాంటి మనిషిని ఈ స్థితికి తీసుకొచ్చింది నేనేనా? తన రాత అంతేనేమో. దానికి పూర్తిగా నేనే బాధ్యత వహించడం మాత్రం ఎందుకు? పంతానికి అనుకుందామన్నా అలా ఎక్కువసేపు అనుకోలేనే. ఇదంతా పశ్చాత్తాపమా? ఇప్పుడు సమయం ఇంత మించిపోయాక.. ప్చ్ గతం నన్ను కాల్చేస్తోంది. నిజమే. కానీ మర్చిపోబుద్ధి కూడా పుట్టడం లేదే. అదంతా పునశ్చరణ చేసుకుని బాధపడటంలోనే నాకానందం లభ్యం అవుతోంది.

★ ★ ★

అవి నేను డిగ్రీ చదువుతున్న రోజులు. బరువులూ, బాధ్యతలూ లేని వయసు. సృష్టి అంతా మధుర కావ్యమనీ అది ఆస్వాదించటమే తప్ప మనిషికి మరో పని లేదని అనుకునేదాన్ని.

మనం కేవలం అది ఆస్వాదించి ఆనందించడానికే సృజింపబడ్డామని అనుకునేదాన్ని. తీరిగ్గా అలంకరించుకుంటూ, పాటలు పాడుతూ, డ్యాన్సులు చేస్తూ రోజులకి రోజులే గడిపేదాన్ని. ఎవరైనా డల్‌గా కనిపిస్తే... అబ్బా! ఎలా వస్తుంది ఆ నిర్లిప్తత.. ఇంత ఆహ్లాదకరమైన సృష్టిలో అని ఆశ్చర్యపడేదాన్ని. నాకు తగ్గట్టే ఉండేవారు నా స్నేహితులు కూడాను. మాకు సరిపోయేలానే ఉండేది మా కాలేజీ వాతావరణం. ఆటపాటలంత సులభంగానూ

సాగిపోయేది మా చదువు. ఏ ఫంక్షన్ అయినా సరే ఏ ప్రత్యేక కార్యక్రమమ యినా సరే. మా బృందమే ముందు అన్ని టికీను. ఈ కారణం వల్లేనేమో చాలా మంది లెక్చరర్స్ కూడా మమ్మల్ని ఇష్టపడే వారు. ఇంటా బయటా ఏ రకమైన కట్టుబాట్లూ లేవు. కావలసినంత స్వేచ్ఛగా ఉండేవాళ్ళం. అయితే అది హద్దులు మీరి విశృంఖలత్వం కాలేదు. ఏమిటో ఆ రోజులూ ఆ వయసూను, ఆ అమాయకత, ఆ నిశ్చింత ఇప్పుడెలా వస్తాయి?

రెండో సంవత్సరం పరీక్షలు అయి నాయి. అమ్మయ్య అని నిశ్చింతగా నిట్టూర్చాం. సెలవంటే ఏమిటో బెంగ నాకు. స్నేహితులంతా అటూ యిటూ వెళ్తుంటే అడపా దడపా అయినా కల వటం కుదరదు. 'ఏం చెయ్యాలా' అని ఆలోచిస్తుంటే వచ్చింది పద్మ పిన్ని, చిన్న క్కయ్య వయసుది అవటం వల్లనేమో మాకు చనువే తన దగ్గర. వాళ్లు రావటం, మేము వెళ్లటం మా కుటుంబాల మధ్య సంబంధం బాంధవ్యాలు బాగానే ఉండేవి. ఉత్సాహంగా ఇంటిల్లిపాదీ బయల్దేరాం బెంగుళూరు పెళ్ళికి.

అంతదాకా నిశ్చింతగా సాగిన నా జీవన ప్రవాహానికి తొలిసారిగా అక్కడే కాస్త అడ్డు తగిలింది. అదే నా జీవితాన్ని మలుపు తిప్పింది. ఆనాడే నేను కాస్త జాగ్రత్తగా నా మనసుని అధీనంలో ఉంచు కుంటే ఈనాడీ వగచే అవసరమే ఉండేది కాదుకదా! ప్చ్

పద్మ పిన్నికి అన్నయ్య కృష్ణచందర్. అతను డాక్టర్. మెడిసిన్ ముగించి ఎం. ఎస్. చేస్తూ ఉండేవాడు. పెళ్ళిలో నేను ఉత్సాహంగా అన్ని పనుల్లో చేయిపెడు తూంటే, తనూ సాయం చేసేవాడు. ఆఖరు నిమిషాల్లో షాపింగ్ చెయ్యాలంటే తనూ నేనే వెళ్ళేవారం.

"కాంతం! నీ కూతురు ఇంత పనిమంతు రాలని అనుకోలేదే. ఎక్కడ చూసినా అదే ఉంది. గిలకలా తిరుగుతూను" మెచ్చుకో లుగా అంది పెద్ద అమ్మమ్మ.

"కాంతానికేం? ముగ్గురు కూతుళ్లూ ముత్యాల్లా ఉంటారు. ఏ పనికీ రాకుండా దూరంగా ఉండేది లలితమ్మ ఒక్కతే ఇన్ని రోజులు. ఇప్పుడిదీ చొరవగా అన్నీ చేస్తోందే!" చిన్న అమ్మమ్మ ఉవాచ. వెంటనే కోపం వచ్చేసింది నాకు. "ఎప్పుడ మ్మమ్మా నేను పని చెయ్యనిదీ! నాకు అవ కాశమే ఇవ్వకుండా పని చెయ్యనంటే ఎలా? "

"నిజమేనమ్మా! ఇదివరకేమోగానీ లలిత ఇప్పుడు చూడు ఎంత పని చేస్తోందో"

> **కొత్తగాలి...**
>
> **భాషలకు లేవు**
> **వైషమ్యాలు**
> **భాషలు నేర్చినవారి మధ్యే**
> **రగులుతున్నాయి రచ్చలు!**
>
> – వి.ఎం. కృష్ణ,
> నార్త్ కమలానగర్, హైదరాబాద్

వత్తాసు పలికాడు కృష్ణ మామయ్య.

"పిల్లికి ఎలక సాక్ష్యంట. బాగానే ఉంది నీ వత్తాసు" నవ్వేసింది అమ్మ.

"లలితా! పొద్దున్న తెచ్చిన ఉత్తరీయాల పాకెట్ ఎక్కడ పెట్టావు? కనబడటం లేదు, కాస్త వచ్చి తీసిస్తే ధన్యుణ్ణి" దోసిలి పట్టి అడిగాడు మామయ్య నాటకంలోలా.

"రమ్మంటే రావేమిటి? మహా ఫోజు కొడుతున్నావు? " విసవిసా బయల్దేరాను నేను.

"కాస్త కోపం తగ్గించాలే నీ కూతురు కాంతమ్మా!" తాతగారు అనటం వినిపిం చింది వెనకనుంచి.

ఎక్కడపెట్టానో ఉత్తరీయాలు అను

కుంటూ అన్నీ వెతుకుతున్నాను నేను. సామాన్ల గదిలో మేమిద్దరమే ఉన్నాం.

"లతా!" మెల్లగా పిలిచాడు మామయ్య దగ్గరికొస్తూ. ఆ పిలుపేమిటో వేరుగా అనిపించింది. మృదువుగా ధ్వనించింది. తడబాటుగా తలెత్తాను నేను.

"లతా!" అంటూ నా చేతిని పట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు తను ఏదో చెప్పబోతూ.

"ఏరా కన్నా! ఉత్తరీయాలు అడిగి ఎంతసేపయింది? ఇంకా ఏం చేస్తున్నావక్కడ? " వాళ్ళ నాన్న కంఠం వినిపించగానే గబుక్కున దూరం జరిగాడు తను.

"ఇదిగో నాన్నా!" అంటూ సూట్ కేసు తీసి అందులో పాకెట్ తీసుకొని బయటికెళ్లిపోయాడు తను గబగబా.

"అమ్మదొంగా!" అనుకున్నాను నేను అటే చూస్తూ.

తను పట్టుకున్న చేయి పదే పదే చూసుకున్నాను. ఏమిటో మత్తుగా అనిపించింది. అక్కడే ఆ పెట్టెల మీదే చతికిలబడ్డా. అలా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలియదు.

పెద్దక్క వెతుక్కుంటూ వచ్చింది. "ఇదేమిటే ఇక్కడ కూర్చున్నావు. ఒంట్లో బాగుందా? " అంటూ నుదురు చెంపలు తాకి చూసింది.

"ఇదేమిటే తల్లీ! జ్వరం వచ్చినట్టుంది. పద అలా గదిలోకెళ్లి పడుకో. నేను కృష్ణని పిల్చుకొస్తాను" అంటూ ఇవతలికి తీసుకొచ్చి హడావుడిగా వెళ్లిపోయింది.

గదిలోకొచ్చి అలసటగా పరుపుమీద వాలేను నేను. "ఏమిటి ఏమయింది? " ఆత్రంగా వచ్చాడు మామయ్య, వెనకే పెద్దక్కానూ.

లేవబోయాను. "అహహ.. వద్దు పడుకో" అంటూ వారించాడు.

"ఏమయింది మేడమ్! ఏమిటి సామాన్ల గదిలో పడుకున్నారుట? "

"పడుకోవడం కాదురా. తెలివి తప్పినట్టు పడుంది అక్కడ. ఏమయిందో ఏమిటో సరిగ్గా చూడు" పెద్దక్కయ్య గాభరా మనిషి. అన్నిటికీ హడావుడి చేస్తుంది.

"ఏమీ ఉండి ఉండదు కవితా! చకచకా తిరిగి పనిచేస్తోంది కదా! అలసట అయి ఉంటుంది. ఎందుకేనా మంచిది అమ్మ పెట్లో ధర్మామీటర్ పెట్టుకొచ్చింది. అది కాస్త అడిగి పట్టుకొస్తావా? చూద్దాం జ్వరముందేమో..."

"తెస్తాగానీ నువ్విక్కడే ఉండు బాబూ! తీరా నేనది పట్టుకొచ్చేలోగా నువ్వెళ్లిపోయావంటే ఈ పెళ్లింట్లో నిన్ను వెతకటం నావల్ల కాదు" అంటూ వెళ్లింది అక్కయ్య.

ఒకసారి గుమ్మం కేసి చూసి నా చేతులు తన చేతుల్లోకి తీసుకుంటూ అడిగాడు. "చెప్పు డాలీ ఏమయింది? ఏదీ కళ్లు తెరు" మృదువుగా ఉంది స్వరం.

తను స్పృశించగానే మళ్లా ఏమిటోగా అనిపించింది.

"అబ్బా! నన్ను తాకకు బాబూ! నాకేమీ కాలేదు. నువ్విలా దగ్గరికి వస్తే.. మెల్లిగా మాట్లాడితే నాకేమిటో.. ఏదోలా.." చెప్పలేకపోయాను. మాటలు మర్చిపోయినట్టయింది.

గట్టిగా నవ్వేశాడు తను.

"ఏమిట్రా నవ్వు? " చేతిలో ధర్మామీట

## కొత్తగాలి...

రోగం రొష్టూ
చెప్పి రావు!
మాటా శ్వాసా
చెప్పి పోవు!

– టి. పద్మ, హైదరాబాద్.

ర్‌తో వచ్చింది అక్కయ్య.

"ఏం లేదు. నువ్వేమో ఇంత హడావుడి పెట్టావా? ఏమయింది లలితాదేవి? ఏం జరిగింది చెప్పమన్నాను. 'నిద్రొచ్చింది మామయ్యా' అంది ముద్దుగా నీ చెల్లెలు" మళ్లా నవ్వాడు.

"ఏయ్! నేనలా అన్నానా?" చివాలున లేచాను నేను.

"ఇదిగో కవితా! నీ చెల్లెలు క్షణంలో తేరుకుంది. నా వైద్యం అంటే ఏమనుకున్నావ్? మరి కాస్సేపుంటే నాతో జగడమాడేలా ఉంది. నేను పోతాను బాబూ! మరే మందూ అక్కర్లేదు. లలిత బాగానే ఉంది" అంటూ వెళ్ళిపోయాడు.

"ఏం పిల్లవే? సరే కాస్సేపు పడుకుని లేచిరా" అంటూ వెళ్ళిపోయింది అక్కయ్య.

ఎంతో హైరానా పడి ఎంతెంతో ఏర్పాట్లు చేస్తాం. కానీ ఆ శుభకార్యం క్షణంలో ముగిసిపోతుంది. హడావుడిగా పెళ్లి జరిగిపోయింది. పద్మ పిన్నిని అత్త వారింటికి కూడా అంపకం పెట్టాం. "ఎటూ ఇంత దూరం వచ్చారు కదా! మీరూ రండి మైసూర్, బెంగుళూర్ చూట్టానికి" అని అక్కయ్యా, బావగారు అంటే అందరమూ బయల్దేరాం. బస్సెక్కేదాకా తెలీదు నాకు, మాతో మామయ్య కూడా వస్తున్నట్టు.

పొద్దుట 5.30కల్లా కాఫీలు ముగించి టూరిస్ట్ బస్సెక్కాం. నేవెళ్లి అందరికన్నా వెనుక కూర్చున్నా. వెనకయితే పోటీ ఉండదు కదా అని. అందర్నీ ఎక్కించి తీరిగ్గా వచ్చి నా పక్కన బైఠాయించాడు మామయ్య.

"ఇదేమిటి, డాక్టర్ మాతో వస్తున్నారా?" ఆశ్చర్యంగా అడిగాను బస్సు కదిలినా దిగడేమిటని.

"యస్ మేడమ్!" ముక్తసరిగా జవాబిచ్చి ఊరుకున్నాడు. బెంగుళూరు సిటీ దాటిపోతుంటే చల్లటి గాలి వీచటం మొదలెట్టింది. పైట తీసి చెవుల చుట్టూ కప్పుకున్నాను.

"చలిగా ఉందా. ఇలా దగ్గరికి రా" చిలిపిగా అన్నాడతను.

"ఛీ.. పో" అంటూ కిటికీకేసి జరిగిపోయాను నేను. తనతో కలిసి చూసిన ప్రతి చోటూ నాకు కొత్తగా, వింతగా, ఆహ్లాదంగా అనిపిస్తూనే ఉంది.

ఆ ప్రయాణంలో చూసిన వాటినన్నిటినీ నేను ఎక్కువగా మననం చేసుకోలేదు ఒక్క మామయ్యని తప్ప. అసలేదయినా పూర్తిగా చూస్తేగా.

తను ఎంత దగ్గరికి రావటానికి ప్రయత్నించినా నేను ముభావంగా ఉండిపోయాను. అర్థం కానట్టు నటించాను. కారణం ప్రత్యేకం ఏమీలేదు. అప్పటికే తన ఆకర్షణలో కుత్తుక దాకా దిగబడిపోయిన నేను పూర్తిగా తనకి అర్థమై పోతానేమోననే భయం. అంతే.

వాళ్లు మాకంటే అంతస్థులో చాలా మెట్లు పైనున్నారు. కయ్యానికి, వియ్యానికి సరిసమానులు కాకపోతే కుదరదంటారు కదా! అందుకని వాళ్లతో వియ్యం పొసగటం కష్టమనే అనిపించింది. తనమీద మమకారం పెంచుకునే అధికారం నాకేమీ లేదనిపించింది. అందుకే తనెంత చేరువగా రావాలని ప్రయత్నం చేశాడో నేనంత దూరంగా ఉండటానికి ప్రయత్నించాను.

"మొద్దూ బుద్ధూ ఇంత వయసొచ్చింది. ఇంకా ఏమీ అర్థం కాదు!" అంటూ విసుక్కున్నాడు తను.

"ఏ అర్థం కావాలి?" అమాయకత బాగానే నటించాను నేను.

అనుకున్న ప్రకారం అన్నీ చూసి అర్ధరాత్రి అయ్యేసరికి బెంగళూరు చేరింది మా బస్సు. నాకొకటి చాలా చిత్రం అనిపిస్తుంది. మామయ్యా, నేనూ ఇలా చనువుగా, చొరవగా మసలటం పెద్దలెవరికీ అసహజంగా కనిపించలేదా? 'ఎందుకని, ఎవరూ వారించే ప్రయత్నం చెయ్యలేదు?'

అని. ఆనాడే అమ్మయినా అమ్మమ్మలెవ రైనా కాస్త తనని మందలించి ఉంటే.. నన్ను కోప్పడి ఉంటే.. ప్చ్ ఆలోచనలు ఎంత అర్థం లేనివి? రాతలో ఉన్నవి జర గకమానుతాయా? ఆనకట్టలు కట్టి నీటిని మళ్లించవచ్చు. అడ్డుగోడలు పెట్టి గాలిని బంధించవచ్చు. కానీ మనసుని ఎవరు బంధించగలరు? ఎవరు ఆజ్ఞాపించగ లరు?

మేము వచ్చేసే రోజు. మామయ్య చాలా దిగులుగా కనిపించాడు. స్పష్టంగా తెలిసిపోతోందది.

"ఏమిటి, డాక్టర్ చెల్లాయి పెళ్లి చేసి అలసిపోయారా? " గడుసుగా ఆరా తీసాను నేను.

"అవునురా కన్నా. ఇది చెప్పేదాకా నేను గమనించలేదు కానీ చాలా అలసిపోయి నట్టు కనిపిస్తున్నావేమిటి!" కొడుకుని పరిశీ లనగా చూస్తూ అన్నది వాళ్లమ్మ.

"కొన్ని రోజులు లీవ్ పెట్టి మా ఊరికి రారా. పల్లెటూరు, చల్లని గాలి, పంట పొలాలు మీ ఊర్లోలా ఈ రోద లేకుండా ప్రశాంతంగా ఉంటుంది" పెద్ద అమ్మమ్మ ఆత్మీయంగా పిలిచింది.

"నిజంగా అంత బావుంటుందా అమ్మమ్మా మీ ఊరు? " వెంటనే అడిగాను నేను.

"నిజంగా బావుంటుందే. ఒకసారి నే వెళ్లి వచ్చాను. మీరంతా అక్కడే ఉన్నారు. ఏదో పెళ్లికి వచ్చాను కదూ పెద్దమ్మా నేను? " ఆలోచిస్తూ అంది అమ్మ.

"అవును రాంబాబు పెళ్లికి వచ్చినట్టు న్నావు నువ్వు. పోనీ నువ్వూ రారాదుటే కాంతమ్మా! నీ పిల్లలూ మా ఊరు చూసి నట్టు ఉంటుంది"

"నాకు ఎక్కడ కుదురుతుంది. వస్తే పిల్లలు రావచ్చు. సెలవులే కనక"

"ఏం లలితా వస్తారా మీరు? " చాలా యథాలాపంగా అడిగినట్టు అడిగాడు మామయ్య. నలుగురిలో మాట్లాడేటప్పుడు తన తీరే వేరుగా ఉంటుంది. నేను మౌనంగా అమ్మకేసి చూశాను.

చిన్నక్క ఉద్యోగం చేస్తోంది "నాకు లీవ్ లేదు కన్నా యిప్పుడు. తర్వాత ఎప్పుడో వస్తాంలే" అని చెప్పేసింది చప్పున.

"ఎవ్వరూ లేకుండా ఒక్కణ్ణే వస్తే నాకేం తోస్తుంది పెద్దమ్మా. నేను మళ్లా ఎప్పుడో వస్తాలే. దాదాపు నెలరోజులయింది. నా చదువేమిటో, నేనేమిటో అర్థం కాకుండా ఉంది. కాస్త చూసుకుని నా ధోరణిలో పడితే తప్పు.."

హుషారుగా మాట్లాడుతూనే ఉన్నా ఏదో వెలితి తనలో కనిపిస్తూనే ఉంది. అమ్మావాళ్లు పెట్టెలు, పరుపులు సర్దే హడా వుడిలో ఉన్నారు. నాకేమీ తోచటం లేదు. చిరాగ్గా ఉంది. 'ఈరోజే వెళ్లిపోవాలి. ఇక మామయ్యని మర్చిపోవాలి' అన్న భావనే నన్ను తినేస్తోంది. అదే ఆలోచిస్తూ డాబా మీదికెక్కా నేను. అక్కడయితే ఎవరూ ఉండరు. ప్రశాంతంగా ఉంటుంది. మన సులో గూడు కట్టుకున్న దుఃఖం పొంగినా ఎవరూ గమనించలేరు.

పరధ్యానంగా పరిసరాలు చూస్తున్నా నేను. ఎప్పుడు వచ్చాడో కృష్ణ మామయ్య. నా జడ సవరిస్తూ "డాలీ" అన్నాడు. ఉలి క్కిపడ్డా. తననంత దగ్గరగా చూసి ఓ క్షణం భయపడ్డా కూడాను. చటుక్కున దూరం జరగబోయాను.

"నన్ను చూస్తే ఎందుకలా అయిపో తావు? పారిపోవటానికి ప్రయత్నిస్తా వెందుకు? " ఉదాసీనంగా అడిగాడు.

నేనేమీ మాట్లాడలేకపోయాను. కనీసం తలయినా ఎత్తి తనకేసి చూసే ధైర్యం లేక పోయింది.

"నేను నీకేమీ కానా లతా? "

"..... ..... ....."

"మాట్లాడవే మల్లిమొగ్గా! ఇంకెటూ కాసె పట్లో వెళ్లిపోతావు. పలుకు పలికితే

ముత్యాలొలుకుతాయా? ”

నవ్వొచ్చింది నాకు. “అమ్మో! ఫర్వాలేదే. అబ్బాయికి తెలుగు బాగానే వచ్చన్నమాట”

“అమ్మయ్య! దేవి ప్రసన్నురాలైంది. ఇంకా అలిగిందేమోనని హడిలి ఛస్తున్నాను” ఉల్లాసంగా మారింది తన కంఠధ్వని.

“అలిగితే నీకేం..? ” ఇంకా ఏదో అనబోయాను.

“అలిగితే అలిగేవు కానీ రాణీ! ఈ చేతుల్లోంచి మాత్రం తొలగకు” అంటూ నన్ను బంధించి వారించే లోపలే హత్తుకున్నాడు.

“ఛ విడు మామయ్యా! ఎవరేనా చూస్తే..? ” అస్పష్టంగా వచ్చింది మాట.

“డాలీ!... నీ పెదవులింత ఎర్రగా ఉన్నాయేం? ”

నా తల తన గుండెల మీద వాలిపోయింది. గడ్డం కింద వేలుంచి పైకెత్తాడు. ఆత్రంగా ముద్దు పెట్టుకున్నాడు “తియ్యగా కూడా ఉన్నాయి సుమా!”

నా శరీరం మంత్రించినట్టు అయిపోయింది. ఏదో అశక్తత, వివశత నన్నావరించింది. తనని పెనవేసిన నా చేతులు తీసే ఆలోచనే రాలేదు. అలా ఎంతసేపు గడిచిందో. “రాణీ నన్నొదలవూ? కింద ఎవరో పిలుస్తున్నారు” అన్న తన మాటతో తెలివివచ్చింది.

మెట్ల మీద ఎవరిదో పదధ్వని. హడావుడిగా నా చేతులు తొలగించి తను మెట్లకేసి పరుగుతీశాడు.

ఎందుకో దుఃఖం పొంగి వచ్చింది. చేతుల్లో ముఖం దాచుకుంటూ అక్కడే కూలబడ్డాను. కరుడుకట్టి బాధంతా కన్నీళ్లలో కరిగిపోయింది. మనసులో ఏదో శూన్యం నిండి పోయింది.

★ ★ ★

“నీకేదో ఉత్తరం వచ్చిందే లలితా! నీ పుస్తకాల దగ్గర పెట్టాను” అంది అమ్మ కాలేజి నుంచి రాగానే.

“నాకు ఉత్తరమా! మొన్ననేగా అరవింద రాసింది. అప్పుడే రాస్తుందా మళ్లీ? ”

“ఏమో నాకేం తెలుసు? చూసుకో తెలుస్తుంది”

మొహం కడుక్కుని వచ్చా తీరిగ్గా. ఉత్తరం మీద ఎవరిదో కొత్తరాత. ‘ఎవరబ్బా!’ అని ఆలోచిస్తూనే విప్పాను. ఆశ్చర్యంగా పరుగులెట్టాయి నా కళ్లు ఆ అక్షరాల బారుల వెంట.

*లలితా!*

నువ్వు మీ ఊరు వెళ్లిందగ్గర్నుంచీ ఎలా ఉన్నావో కానీ నేను మాత్రం ఇదివరకులా లేను. నాలో ఒక భాగం నువ్వు దోచుకుపోయావు. నీతో కలిసి తిరిగిన ప్రతి చోటూ మళ్లీ మళ్లీ వెదుక్కున్నాను. అక్కడెక్కడైనా జారిపోయిందేమో నా మనసని. తిరగ్గా తిరగ్గా తెలిసింది అది నీ దగ్గర కాకపోతే మరెక్కడా దొరకదని. చనువు తీసుకుని ఈ లెటర్ రాసినందుకేం అనుకోవుగా. భయపడకుండా జవాబు రాయి. ఎదురు చూస్తాను.

నిన్నే తల్చుకునే
నీ
కృష్ణ

ఒళ్లంతా వేడెక్కింది. ఆశ్చర్యం, ఆనందం, ఏదో తెలియని భయం అన్నీ చుట్టుముట్టాయి. కృష్ణ నాకు లెటర్ రాశాడు అనుకుంటేనే ఎలాగో అనిపిం

## కొత్తగాలి...

**గారాబం పుట్టింట్లో**
**దాసోహం అత్తింట్లో**
**శిష్యరికం నెట్టింట్లో**
**చదువులేమో నట్టేట్లో!**

– ఎం. సీత,
*భద్రాచలం, ఖమ్మం జిల్లా*

చింది. తనని చూస్తూ నాలో కలిగిన అనుభూతులు ఏమాత్రం ప్రకటించలేకపోయాను. కానీ ఇప్పుడీ ఉత్తరం.. జవాబివ్వటానికి కూడా ఏదో తెలియని జంకు అడ్డొస్తోంది.

ఆ ఉత్తరం పుస్తకాల్లో దాచుకుని అలా చదువుతూ గడిపా ఒక వారం రోజులు. ఒకరోజు మధ్యాహ్నం పాఠాలు జరగబోవని తెలిసిన త్వరగా ఇంటికొచ్చేను. నా వెనకే వస్తున్న పోస్టమాన్ నాచేతికో ఉత్తరం అందిచ్చాడు. అది నాకే. ఈ సారి ఆ దస్తూరీ ఎవరిదా అని ఆలోచించే అవసరం లేకపోయింది. పుస్తకాల్లో ఆ ఉత్తరం దాచేసి ఇంట్లోకి పరుగెట్టా.

నన్ను ఒకచోట స్థిమితంగా ఉండనివ్వటం లేదు మామయ్య ఉత్తరాలు. ఎప్పుడూ పరధ్యానమే. చివరకు ఏమయితే అది అయిందని జవాబు రాశాను. అదీ చాలా పొడిపొడిగా చిన్నగా. నాకసలే భావుకత ఎక్కువ. ఏ మాత్రం పెద్ద ఉత్తరం రాసినా నా అనుభూతులన్నీ అందులో ప్రతిబింబిస్తాయి. నేను తనకి పూర్తిగా అర్థమైపోతాను. అదీకాక ఆ ఉత్తరం ఇంకెవరికైనా అందితే.. అమ్మయ్యో..

నేనెంత ముభావంగా ఉంటూ వచ్చినా తను నన్నలా ఉండనియ్యడు. 'అబ్బా! ఎంత చిలిపివాడివి మామయ్యా! నువ్వు' అని ముద్దుగా విసుక్కునేదాన్ని. 'ఇలాంటి ఉత్తరాలు రాయకు మామయ్యా. పరీక్షలు దగ్గరికొస్తున్నాయి. చదువుకోవాలి' అంటే "నువ్వు వద్దన్నదేదైనా కావాలనే అర్థం లతా! ఆడవాళ్ల మాటలకు అర్థాలే వేరటగా!" అంటూ మరింత కవిత్వం ఒలకపోసేవాడు.

పరీక్షల హడావుడిలో పడి తనకి ఉత్తరాలు ఆపుచేశాను. ఆఖరి రోజు పరీక్ష రాసి నిశ్చింతగా నిద్రపోయాను. తెల్లారి లేచేసరికి ఎదురుగా మామయ్య! ఎదుటలేడని బోలెడన్ని మాటలు ఉత్తరాల్లో రాశాను కానీ తను ఎదుట నిలిస్తే చచ్చే సిగ్గేసింది. గబగబా లోపలికి వెళ్లిపోయాను.

తనతో మాట్లాడాలని మనసు తహతహలాడ్తోంది. ఎదుటపడాలంటే మాత్రం ఏదో చెప్పలేని బిడియం అడ్డొస్తూంది. చివరికి భోజనాల దగ్గర తన ఎదుట పడక తప్పలేదు. అమ్మ వంటంతా ముగించి పెద్దక్కయ్య కొడుక్కి నీళ్లు పోయటానికి వెళ్లింది.

"అక్కయ్యా నేను వెళ్లాలి త్వరగా, నాకు అన్నం పెట్టవూ? " అన్నాడు మామయ్య.

"అరే! నువ్వు ఉంటావనుకున్నారా. సర్లే.. లలిత ఖాళీగానే ఉందిగా పెడ్తుంది" అంటూ నన్ను కేకేసింది. వీళ్ల సంభాషణ వింటూనే ఉన్నా నేను. అమ్మ రెండోసారి పిలవటంతో రాకతప్పలేదు.

"వీడికి భోజనం పెట్టవే!" అంటూ అమ్మ పెరట్లోకి వెళ్లిపోయింది. 'రా' అంటూ వంటింట్లోకి నడిచా. అలమర్లోంచి కంచం తీస్తున్నా. వెనకనుంచి భుజాలమీద చేతులు వేశాడు. "నన్ను తప్పించుకుంటున్నావెందుకు? " చెవి దగ్గర గుసగుసలాడాడు.

ఆ స్పర్శకు నా ఒళ్లంతా పులకరించింది. చేతులు పట్టు తప్పాయి. కంచం కింద పడింది పెద్ద చప్పుడు చేస్తూ.

'ఒక్క పని తిన్నగా చెయ్యవు కదే' అంటూ పెద్దక్కయ్య వచ్చింది వంటింట్లోకి. కృష్ణ బుద్ధిగా కూర్చున్నాడు పీట దగ్గర. 'నే పెడతాగానీ నువ్వెళ్లి అమ్మకి సాయం చెయ్యి పో" అంది.

నిరుత్సాహంగా అక్కణ్నుంచి వెళ్లిపోయాను.

"మా ఫ్రెండ్స్ ఏవో కొన్ని గాజులు అవీ కావాలన్నారు అక్కయ్యా! హైదరాబాదువి ప్రత్యేకమయినవి. నువ్వు బజారుకొస్తావా? " అన్నాడు డ్రెస్ చేసుకుని వచ్చి

అమ్మ మనవడికి సాంబ్రాణి వేస్తోంది.

"ఏం పిల్లాడివిరా కన్నా. ఇంట్లో ఇంత పనుంది నన్ను రమ్మంటావు. పోనీ లలి తని తీసుకెళ్లు. చక్కగా సెలెక్ట్ చేసి పెడు తుంది"

"సాయంత్రం ఆలస్యం అవుతుంది మరి" ఎంతో బుద్ధిమంతుడిలా ఫోజు పెట్టాడు.

"అయితే అయిందిలే నువ్వంటావుగా"

అక్కగారి దగ్గర పర్మిషన్ కొట్టేసి "పద మేడమ్" అన్నాడు నాకేసి చూసి కళ్లు చికి లిస్తూ.

"అదేమిట్రా? నువ్వు తిన్నావు బాగానే ఉంది. దాన్ని తిండీ తిప్పలూ లేకుండా రమ్మంటావేమిటి? ఒసే లలితా! త్వరగా కాస్త ఎంగిలి పడి లే. నీకేవో కావాలన్నావు కదా! బజార్లో అవీ ఇవ్వాళే తెచ్చుకో. మళ్లా ఇంకోరోజు పోకుండా" ఆర్డర్ జారీ చేసింది అమ్మ.

గబగబా భోం చేసి నాకిష్టమయిన చీర కట్టుకుని బయటపడ్డా. గుండెలో గుబులు గుబులుగానే ఉంది. మామయ్య మౌనంగా నా పక్కనే నడుస్తున్నాడు.

టాక్సీ ఎక్కి కదిలేదాకా ఏం పలకలేదు.

"మాటలు మర్చిపోయావా డాలీ?" అన్నాడు నా జడతో ఆడుకుంటూ.

పరధ్యానంగా ఉండిపోయి జవాబు చెప్పలేదు నేను.

కొత్తగాలి...

**నాడు పెళ్లి జరిగేది**
**నిరాడంబరంగా**
**కాపురాలు నిలిచేవి శాశ్వతంగా!**
**నేడంతా తారుమారు!**

**– ఆర్.ఎస్. హైమవతి,**
చెన్నై

"నామీద అలిగావా ప్రేయసీ? ఈ దాసుడేం తప్పు చేశాడో సెలవిచ్చి దండించు" నా గడ్డం కింద చెయ్యి పెట్టి పైకెత్తుతూ.

ఒళ్లంతా వేడెక్కింది. కళ్లు కిందికి వాలి పోయాయి. సున్నితంగా నా కనురెప్పలు తాకాయి తన పెదవులు. సిగ్గేసింది.

"ఏమిటి మామయ్యా? టాక్సీ డ్రైవర్ ఏం అనుకుంటాడు?" మెల్లగా అంటూ దూరం జరిగిపోయా.

తెల్లబోయాడు తను.

"కోపం వచ్చిందా లతా! ఆగలేకపో యాను నిన్నిలా చూస్తూ"

టాక్సీ మెల్లగా పోతోంది. మనసులో ఆలోచనలు స్పీడ్‌గా సాగుతున్నాయి. ఎందుకొచ్చాడు ఇప్పుడు మామయ్య అన్న ప్రశ్న పొద్దుటి నుంచి నన్ను వేధిస్తోంది. భాగ్యనగరంలోని చక్కని ఉద్యానవనం దగ్గర ఆగింది కారు.

"దిగు" అన్నాడు తను దిగుతూ.

"ఇక్కడ బజార్లు లేవు" అన్నాను తడబ డుతూ దిగి.

"నీక్కావాలంటే బజారెళ్లు. నేను మాత్రం ఇక్కడే ఉంటా" అంటూ టాక్సీ అతనికి డబ్బులిచ్చి పంపించేశాడు.

ఆ రోజంతా పూర్తిగా తిరిగాం. తోటలు, బాటలు అంతాను.

సాయంత్రం ఉత్త చేతులతో ఇంటికెళ్లిన మమ్మల్ని చూసి అమ్మ విస్తుపోయింది. తన ప్రశ్నలు వినకుండా నేను హడావు డిగా ఇంట్లోకెళ్లిపోయా.

భోజనాలు చేసి తీరిగ్గా కూర్చున్నాక నాన్న అడిగారు. "ఏమోయ్ కృష్ణా! ఎమ్మెస్ అయిపోయింది కదా! ముందు ఏం చెయ్యాలని అనుకుంటున్నావు?"

"నాకు అమెరికా వెళ్లే అవకాశం వచ్చింది బావగారూ. ఇంకో నాలుగు నెలల్లో వెళ్లిపో వాలి"

"కంగ్రాట్స్. మరామాట చెప్పవేం ఇంత సేపూ?"

"దానికొక చిన్న సమస్య అడ్డొచ్చిందండీ. అందుకే వెళ్లగలనా లేదా అన్న విషయం కూడా ఆలోచనలో ఉంది"

"ఏమిటోయ్ ఆ సమస్య? శ్రీమంతుల పుత్రుడివి. విఘ్నాలు, విరామం లేకుండా ఎమ్మెస్ పూర్తి చేసిన డాక్టరువి, నీకింకా సమస్యలేమిటి? "

ఏం చెప్పలేనట్టుగా కాస్సేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడతను. చెవులు రిక్కించాను ఏమంటాడోనని.

"విదేశాలు వెళ్లాలంటే పెళ్లి చేసుకో అంటుంది అమ్మ. లేకపోతే ఇల్లు కదలని వ్వదుట"

"అవును, ఆ మాటా నిజమే. చేసుకో. పెళ్లి చేసుకోమన్నారు గానీ బండ లెత్తుకో మనలేదుగా? "

"పెళ్లి చేసుకోటానికి నాకూ ఏం అభ్యం తరం లేదు బావగారూ! మీకేమయినా ఉంటుందేమోనని.."

"నీ పెళ్లికీ.. నాకూ సంబంధం ఏమి టోయ్? చిత్రంగా మాట్లాడుతున్నావు? " నాన్నకి విషయం అర్థం కాలేదు.

"సంబంధం ఎందుకులేదు బావగారూ! నేను నిర్ణయించుకున్న అమ్మాయి తండ్రి మీరే అయినప్పుడు? "

"మా అమ్మాయినా? నువ్వా? " తెల్లబో యారు నాన్న. "అదేమిటోయ్? అలా మాట్లాడుతావు? నక్కకీ నాగలోకానికీ పొత్తు కుదుర్తుందా? నా ఉద్యోగమెంతో, నేనెంతో నీకు బాగా తెలుసు కదూ!"

"తెలుసండీ తెలుసు. నాక్కావలసింది మీ అమ్మాయి అంతే. ఇక వేరే విష యాలు నాకనవసరం"

"నువ్వింకా చిన్నవాడివి. నీకు అనవస రమే కావచ్చు. కానీ మీ తల్లిదండ్రులు ఒప్పుకోవాలిగా. ముఖ్యంగా మీ నాన్న"

"అవన్నీ మీరేం ఆలోచించకండి బావ గారూ! మీకు అభ్యంతరం లేదని చెప్పండి. అంతే చాలు. మిగతా విషయా లన్నీ నేను చూసుకుంటా. రేపు రాత్రి నేను వెళ్లిపోతాను బావగారు! ఈలోగా చెప్పినా సరే. తర్వాత ఉత్తరం రాసినా సరే మీ యిష్టం"

"అలాగే అలాగే. మీ అక్కయ్యని, సరి తని కూడా అడిగి.."

"చిన్న సవరణ బావగారూ! సరిత కాదు లలిత" అంటూ మామయ్య లోపలికి వచ్చే శాడు.

"లలితా!" అంటూ ఆశ్చర్యంగా కూర్చు న్నారు నాన్న.

పొద్దున తను అడుగుతానన్నప్పుడే చెప్పాను. అక్కయ్య పెళ్లి కానిదే నా పెళ్లి చెయ్యరని.

'చెప్తే తప్పేమిటీ? ' అంటూ మామయ్య.

తప్పేం లేదు కానీ పెద్దలు ఒప్పుకోవా లిగా.

"మీ నాన్నతో ఉత్తరం రాయించు లతా! తిరిగి మన కలయిక మన పెళ్లిలోనే. తర్వాత ఇద్దరం హాయిగా స్టేట్స్‌కి వెళ్లి పోదాం. ఉత్తరాలు రాస్తుండు. ఇక నేను వెళ్లి వస్తా" అంటూ మామయ్య అప్పగిం తలు పెడుతోంటే భలే దిగులేసింది. కళ్లలో నీళ్లు తిరిగాయి.

"ఛ ఛ! మరీ అంత బేలవైతే ఎలా? ఇది జీవితం లలితా. ఏదీ సీరియస్‌గా తీసుకోకూడదు" అంటూ ధైర్యం చెప్పి

## కొత్తగాలి...

**మీ ఆరోగ్యం**
**మీ చేతుల్లో!**
**మీ అనారోగ్యం**
**మీ చేతల్లో..!**

– వి.వి.ఎస్. మూర్తి,
చొదిమెళ్ల, ప.గో. జిల్లా

తను వెళ్లిపోయాడు.

నాన్న అమ్మకి చెప్పినట్టున్నారు అనుమానంగా అడిగింది తను. మొన్న మీరెక్కడికి వెళ్లారని. చెప్పాను.

అలా వెళ్లకూడదదంది. "నేను వెళ్తానన్నానా? నీ అంత నువ్వే పంపించావు కదమ్మా!" అంటే ఏం మాట్లాడలేదు.

"అక్కయ్య పెళ్లి అయ్యేదాకా అడగవద్దని చెప్పానమ్మా! కానీ తను అమెరికా వెళ్లిపోవాలని త్వరపడ్డాడు"

"అదికాదు.. కాదు.. భుజంగరావు గారికి డబ్బు పిచ్చి చాలా ఉంది లలితా. నువ్వా ఇంటి కోడలివి కావటం అతను సహించలేడు. మా పిన్నే పెళ్లైన కొత్తలో

కొత్తగాలి...

**అమెరికా పిల్లలేమో**
**అచ్చతెలుగు పాటలు**
**అచ్చతెలుగు పిల్లలేమో**
**పిచ్చతెలుగు మాటలు**

– కుంటముక్కుల సత్యవాణి,
కాకినాడ

ఎన్నో కష్టాలు పడింది"

"ఆ రోజులు వేరమ్మా! ఇప్పుడు ఆ ఇంట్లో ఉండవలసిన అవసరమే నాకుండదు. తనెటూ అమెరికా వెళ్లిపోవాలాయె"

"అయినా ఏమో! నాకు నమ్మకం లేదు. సరే మీ నాన్నతో చెప్తాను ఉత్తరం రాయమని. పట్టుదలగా వెదికితే రెండు నెలల్లో సరితకీ ఏదో ఒకదారి దొరక్కపోదు. ఇద్దరి పెళ్లిళ్లూ చేసేస్తే ఇక మాకు నిశ్చింత"

★ ★ ★

కృష్ణ తండ్రి చాలా డబ్బు మనిషి. కొడుకు మనసుకంటే డబ్బుకే విలువ ఇచ్చాడు. తన కొడుక్కి గాలం వేశారంటూ అమ్మనీ, నాన్ననీ అందరిలో ఆడిపోసుకున్నాడు.

ఇంతలో మామయ్య ఇక్కడ పనులన్నీ పూర్తి చేసుకోవటం, స్టేట్స్‌కి వెళ్లిపోవటం జరిగింది. "నేను స్వతంత్రుణ్ణి. మా నాన్న మాట లెక్క చెయ్యను. లలితకి ఏ లోపం రానివ్వను. నన్ను నమ్ము అక్కయ్యా!" అన్నాడు అమ్మ దగ్గరికి వచ్చి.

"మేము స్టేట్స్‌లోనే సెటిల్ అయిపోతాం బావగారూ. మా నాన్న ఏం చిందులు వేస్తాడో వెయ్యనివ్వండి. ఓసారి పెళ్లంటూ అయిపోతే ఇక ఎవరేం చేస్తారు? మా నాన్నే కాదు ఆ బ్రహ్మదేవుడు దిగొచ్చినా చేసేదేం లేదు" అన్నాడు నాన్నతో కూడా!

"మమ్మల్ని ఈ మాత్రం కూడా బతకనియ్యవా కృష్ణా! ఆస్తులు అంతస్తులు లేకపోయినా పరువుగా బతుకుతున్నాం. దొంగచాటు పెళ్లిళ్లు నేను చెయ్యలేను కృష్ణా! ఏమీ అనుకోకు" అనేశారు నాన్న.

కన్నీళ్లే అమ్మ సమాధానం అయింది.

"పెద్దలు పెద్దలంటూ మనం విలువ ఇవ్వటమేగానీ మనకు వాళ్లేం గౌరవం ఇవ్వరా డాలీ? మన బతుకు, మన ఆశలు వాళ్లు శాసించాలని చూడటం ఏం మర్యాద? నిండు మనసుతో నిన్ను ఆరాధిస్తున్నాను. నన్ను నమ్మగలిగితే ఎవర్నీ లెక్క చెయ్యకుండా ధైర్యంగా ముందడుగు వెయ్యి. రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి చేసుకుందాం. వెంటనే విమానం ఎక్కేద్దాం!" నా దగ్గరికి వచ్చి ఆవేశంగా అన్నాడు మామయ్య.

అమ్మ కన్నీళ్లు, నాన్న పరువు.. ఇవేవీ కాకపోయినా ఇంకా పెళ్లికాని చిన్నక్క భవిష్యత్తూ, లోకనింద భయం నన్ను అడుగు ముందుకు వెయ్యనివ్వలేదు.

"నన్ను మర్చిపో మామయ్యా!" అన్నాను గుండెని బండ చేసుకుని. కళ్లు చెరువులయ్యాయి.

"నువ్వే ఈ మాటంటే... డాలీ.. సరే!"




# చక్కెర కబుర్లు

చక్కెర మన మిత్రుడు. ఒక్కోసారి శత్రువు కూడా. మనిషి అనాదిగా వాడుతున్న చక్కెరకి సంబంధించిన కొన్ని విషయాలు..

★ గాయం మీద చక్కెర చల్లితే అది త్వరగా మానుతుంది. 18వ శతాబ్దంలో ఆఫ్రికన్ ఆటవికుల నుంచి బ్రిటిషర్స్ ఈ విషయాన్ని తెలుసుకుని తమ హాస్పిటల్స్‌లో దీన్ని ప్రవేశపెట్టారు.

★ బ్లడ్‌షుగర్ తక్కువగా ఉన్నవారిలో కోపం అధికం అని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.



★ చక్కెర ఎక్కువ తింటే చర్మం ఎక్కువగా సాగి ముసలివాళ్ల చర్మంలా మారుతుంది.

★ చక్కెర తక్షణ శక్తిని ఇస్తుంది. అందుకే స్వీట్స్ ఎక్కువ తినే పిల్లలు అల్లరి ఎక్కువ చేస్తారు.

★ నాలుక కారంతో మండిపోయేపుడు నాలుక మీద చక్కెర వేసుకుంటే ఆ కారాన్ని చక్కెర తగ్గిస్తుంది.

★ ముతక పంచదార, వైట్ షుగర్ కంటే ఆరోగ్యకరమైంది. మొలాసిస్‌ని తొలగిస్తే అది వైట్ షుగర్ అవుతుంది.

★ వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్ ప్రకారం మనిషి రోజుకి 25 గ్రాముల చక్కెరని తీసుకుంటే ఆరోగ్యంగా ఉంటాడు. ఇది ఒక స్నికర్ బార్‌లో ఉంటుంది.

★ ఎక్కువ చక్కెర తింటే మెదడుకి నష్టం వాటిల్లొచ్చు. మనుషులకు పుట్టుకతోనే తీపి మీద వ్యామోహం ఉండి, అది జీవితాంతం కొనసాగుతుంది..

★ స్టాటిక్స్ ప్రకారం గర్భవతి తీపి ఎక్కువ తింటే మగపిల్లవాడు పుడతాడట.

★ బీట్‌రూట్ నుంచి తీసిన చక్కెరని కూడా విదేశాల్లో వాడతారు.

★ అమెరికన్ భోజనంలో సగటున 4496 కేలరీలకి సరిపడే చక్కెర ఉంటుంది.

★ ప్రాచీన అజ్‌టిక్స్ సంస్కృతి వారికి చక్కెర తెలీదు. అందుకని వారు చాక్లెట్స్‌లో కారం, మిరియాలు వేసి తయారుచేసేవారు.

ఒక్కసారి నా కళ్లల్లోకి దీనంగా చూసి మామయ్య మెల్లగా వెళ్లిపోయాడు. ఆ చూపులు.. చూపులు నన్నింకా వెంటాడుతూనే ఉన్నాయి. అది తలుచుకున్నప్పుడల్లా నా కళ్ల నుంచి నదీ నదాలు ప్రవహిస్తూనే ఉన్నాయి. నా స్థానంలో మరొకరిని చూడటం ఇష్టం లేక మామయ్య పెళ్లి మానేశాడు. నాకు మాత్రం తప్పలేదు.

కలలు కంటూ ఉంటే ఎంతకాలమయినా బాగానే ఉంటుంది. కానీ ఆ కలలు కల్లలైపోతుంటే కళ్లారా చూస్తూ తల్లడిల్లిపోవటం తప్ప మరేం చెయ్యలేని పరిస్థితి వచ్చింది నాకు.

★ ★ ★

ఎన్నో ప్రయత్నాల తర్వాత దొరికిందో సంబంధం. అమ్మానాన్న మురిసిపోయారు. అక్కలందరికీ చాలా నచ్చాడు. నచ్చనిది నాకు మాత్రమే. మనసులో మామయ్య బొమ్మ స్థిరంగా ముద్రించుకుని పోయి ఉంది. ఇతనికి ఆ చోటు ఖాళీ చేసి ఇవ్వటానికి చాలా కాలమే పట్టింది. చివరికి ప్రయత్నం ఫలించింది. మామయ్యని మనసులోంచి తొలగించి అతనికి ఆ స్థానం ఇచ్చాను. కానీ మామయ్య ఛాయ మాత్రం మనసును వీడిపోలేదు పూర్తిగా. అలాగని నేను ఆయనకి ఏ ద్రోహమూ చెయ్యలేదు. సంఘం కట్టుబాట్లకి తలవొగ్గి పెళ్లి చేసుకున్నాను కనుక ఆ దాంపత్యం ఎంత ఆహ్లాదం చేసుకోవాలి అన్న ఆలోచన తప్ప మరొకటి లేదు నా

మనసులో. నాకంటూ ఏమీ మిగుల్చుకో కుండా అంతా ఆయనకే అర్పించాను. కానీ ఆయన నిర్లిప్తతకి నిర్ఘాంతపోయాను. అదే- ఆ భావనే నన్ను హాయిగా ఉండని వ్వటం లేదు. అదే నేను మానసికంగా, శారీరకంగా దిగజారిపోవటానికి కారణం.

ఒక పుష్కరం కాస్త సుఖంగా ఉన్నా నేమో. అంతే. నా ఆరోగ్యం పూర్తిగా పాడ యింది.

సామాన్యమైన కుటుంబం మా అత్తవా రిది. ముగ్గురు మరుదులూ, ముగ్గురు ఆడబడుచులూ. మా ఆయన పెద్దవారు. అంతమందిలో పుట్టినా అందరితో పెరగ లేదాయన. వాళ్ల అమ్మమ్మా, తాతగార్ల

## కొత్తగాలి...

**ఒక మేఘం**
**వర్షాన్నిస్తూ చెప్పింది**
**తనలాగే చేదును గ్రహించి**
**మంచిని పంచమని**

– బి. మాన్‌సింగ్ నాయక్,
హనుమాపురం, గుంటూరు జిల్లా

దగ్గరే సాగిందట చదువు. చిత్రంగా ఉంటుంది తన వ్యవహారం అంతా. తోడ బుట్టినవాళ్ల మీద సహజంగా ఉండే మమ తానురాగాలు ఆయనకు లేవు. అమ్మమ్మా, తాతలు తప్పించి తల్లీ, తండ్రీ కూడా పరా యివాళ్లే తనకి. ఆ పెద్దలిద్దరూ కాలం చెయ్యటంతో ఇక తనకెవరూ లేనట్టుగా అయిపోయారు. తాళి గట్టి తెచ్చుకున్న నన్ను కూడా ఆయన సొంతంగా భావించ లేదు. ఆ దూరమే నేను సహించలేక చాలా తరుచుగా పోట్లాట వేసుకునేదాన్ని.

ఆయన పద్ధతి తమాషాగా ఉండేది. చిత్రంగా సాగింది మా సంసారం. షరతు లకి కట్టుబడినట్టు నడిచేది వ్యవహారం. ఒకరినొకరు వదిలి ఉండలేని సన్నిహి తత్వం, ఒకరికోసమే ఒకరు అన్న మధుర భావన.. ఏవీ లేవు మా మధ్య. నాది పిచ్చితనమే కావచ్చు కానీ.. ఏమిటో ఈ నిరాశ.. తట్టుకునే శక్తి లేదు నాకు.

“నేను నిన్ను ప్రేమించనూ? ఎందుకలా అనుకుంటావు లల్లీ? భర్త భార్యని ప్రేమించవద్దూ? ” అంటుంటారు.

భర్త భార్యని ప్రేమించాలి, కాబట్టి ప్రేమిస్తాడు అంతే. అయినా ఎంత ప్రేముంటే మాత్రం ఏం లాభం? అది వెల్లువగా వెలువడి ఎదుటి వారిని ముంచ లేకపోయాక?

“ఏమిటో నువ్వు అర్థం కావు బాబూ! కథల్లోలా మాట్లాడుతావు” అంటారు పైగా.

పిల్లల్ని మాత్రం కాలుకింద పెట్టనివ్వ కుండా పెంచారు. వాళ్లేదీ చెయ్యకూడదు. అలసిపోతారు. సాయంత్రాలు అందరు పిల్లల్తో కలిసి ఆడుకోకూడదు, పడిపో తారు. సంగీతం పాడితే గొంతునొప్పి, డ్యా న్స్ చేస్తే కాళ్లు నొప్పి. అందుకే మా పిల్ల లిద్దరికీ ఏవీ రాకుండా పోయాయి. అవన్నీ ఫరవాలేదు. కానీ పెద్దదవుతున్నా నిర్మలకి లోకజ్ఞానమే రావటం లేదు. నలుగురిలో కలిసి తిరిగితే కదూ! ఏమైనా నేర్చుకునేది. గుళ్లో లింగంలా మన ఇంట్లో మనం.. ఎప్పుడూ అంతే. పెళ్లిళ్లకీ, పేరంటాలకీ ఆ యన రారు. మేం వెళ్లటం యిష్టం ఉండదు. కొన్ని గుణాలు సహజంగా పుట్టుకతో రావాలి. మనమెంత నూరిపో యటానికి ప్రయత్నించినా మార్చలేం అలాంటి జడపదార్థాల్ని.

మరీ చికాకు కలిగిన ప్రతి నిముషమూ మామయ్య కళ్లలో మెదుల్తుండేవాడు. మనసెప్పుడు తననీ, మా వారినీ పోల్చి ‘నువ్వేం పోగొట్టుకున్నావో చూడు’ అంటుండేది బాధ కలిగినప్పుడల్లా. కానీ ఆ ఆలోచనలు కూడా క్షణికమే. తనను

కాదనుకున్నాను. ఇతన్ని నమ్ముకుని వచ్చాను. ఎంత మంచివాడైనా కానీ అతన్ని తలుచుకునే అవసరం నాకు లేదు. నన్ను భార్యనూ, తల్లినీ చేసిన ఇతన్ని నిర్లక్ష్యం చేసే అధికారమూ లేదు. ఇలా సాగుతుండేది నా మనసులో అంతర్యుద్ధం నిత్యం. చాలామటుకు నేను గెలిచాననే అనుకోవాలి. మామయ్య గుర్తొచ్చినా బాధ కలగని పరిణితికి కూడా చేరుకున్నాను.

అన్నీ సవ్యంగా ఉంటే అది జీవితం ఎందుకవుతుందీ? ఎవరో గొప్ప కవి రాసిన మధుర కావ్యం అవుతుంది గాని. అయినా సంసారంలో ఒకవైపు నుంచే సర్దుబాటు జరగాలి అంటే అది చాలా కష్టం. ఇద్దరూ రాజీ పడగలిగితేనే ఆ బంధం సాఫీగా సాగుతుంది. అందుకేగా భార్యాభర్తలని నాగటికి కట్టిన ఎడ్లతో పోలుస్తారు? ఒకటి ముందుకీ ఒకటి వెనక్కీ నడుస్తుంటే ఇంకేమి సంసారమది?

ఏదెలాగైనా కాలచక్రం ఆగదుగా. దాని పరిభ్రమణం దానిది! కావాలనుకున్న మామయ్య దొరకలేదు. పోనీ ఇదే ప్రాప్తం అని మా ఆయనతో సర్దుకుపోవటానికి ప్రయత్నం చేశాను. కానీ అదేం పాపమో.. తనకి ప్రేమ.. అనుబంధం వగైరా అనుభూతులే లేవు. అంతా డ్యూటీ ప్రకారం, టైమ్ ప్రకారం జరగాలి అంతే.

బుర్రకు తీరిక ఎక్కువైతే ఆలోచించక ఏం చేస్తుంది? తెలుసు, అనవసరమయిన ఆలోచనల వల్ల ఆరోగ్యం చెడుతుందని. అయినా వాటినాపడం ఎవరి తరం? తలనొప్పి వస్తుంటే దృష్టి దోషమేమోనని అద్దాలు పెట్టుకోవటం ప్రారంభించాను. క్రమంగా చూపు తగ్గటం ప్రారంభమయింది. ఒక చెవి వినిపించకపోవటం.. ఏమిటో భయం పట్టుకుంది.

ఏమయిపోతున్నానో అర్థం కాలేదు. ఎవరికైనా చెప్పుకుందామంటే.. పిల్లలకి అర్థం చేసుకునే వయసు లేదు. ఆయనేమో.. అంత తీరిగ్గా దొరకరు. పెద్ద బావగారు వచ్చి 'లలితకు ఏదో పెద్ద జబ్బు చేసింది.. వెల్లూరు తీసుకెళ్దాం మోహన్' అని పట్టుపట్టకపోతే ఈ సరికి నేనసలు ఉండేదాన్ని కాదు.

వైద్య పరీక్షల్లో తేలింది. మెదడులో కణితి అని. కావలసిన వాళ్లూ, రావలసిన వాళ్లూ అందరూ వచ్చారు. పెద్ద శస్త్రచికిత్స అయింది. వినికిడి, చూపు బాగానే వచ్చాయి. ఆపరేషనయిన పక్షం రోజుల్లోగానే మరోసారి చూస్తారనీ, ఇంటికెళ్తే ఆరోగ్యం సంగతి మర్చిపోతానని ఇలా హాస్పిటల్‌లో పడేసి ఉంచారు నన్ను.

"నీ కేసు హిస్టరీ అంతా డాక్టర్ కృష్ణగారు విపులంగా పరీక్షించి ఎక్కడా ఏ లోపమూ లేదని తేల్చారుట పిన్నీ! చాలా నిదానంగా మెరుగుపడుతోంది ఆవిడ ఆరోగ్యం.. ఎందుకనో అర్థం కావటం లేదన్నారట" వత్సల మాటలు వినిపిస్తూనే ఉన్నాయి. కనీసం 'ఊఁ' అనయినా అనాలని అనిపించలేదు.

"ఏమిటీ వింటున్నావా? నిద్రపోతున్నావా?" భుజం పట్టి కుదుపుతూ అడుగుతోందది. బలవంతాన కళ్లు తెరిచాను.

"ఒళ్లు వెచ్చగా ఉంది పిన్నీ! జ్వరం వచ్చినట్టుంది. సిస్టర్‌ని పిలుస్తానుండు"

డాక్టర్ వచ్చి చూసి 103 డిగ్రీలు జ్వరం ఉందని తేల్చారు. సాయంత్రం దాకా ఎలాగో బిగపట్టుకున్నాను. ఇక ఆగలేకపోయాను. మామయ్యతో మాట్లాడాలి.

"వత్సలా.. కాస్త వెళ్లి ఆ డా. కృష్ణని పిలుచుకుని రావే" ఆశ్చర్యంగా చూసింది.

"నే పిలిస్తే వస్తారా?"

"నువ్వు పిలవటం కాదమ్మా! నేను పిలుస్తున్నానని చెప్పు. మామయ్యా ఒక్కసారి రావూ" అని లలిత పిలుస్తోందని చెప్పు.

తెల్లబోయిందది. "స్పృహలోనే ఉన్నావా పిన్నీ? ఎవర్నీ నువ్వు 'మామయ్య' అంటున్నది?"

"ప్లీజ్ వత్సల తల్లీ..! ఇంకా తెలివిగానే ఉన్నానమ్మా! ఆయన.. డా.కృష్ణ మా చిన్నమ్మమ్మ కొడుకు. ఒక్కసారి పిలవ్వూ!"

"అలాగే తీసుకొస్తా పిన్నీ!" దాని చూపుల్లో ఆశ్చర్యం... ఏదో ఆనందం కూడా. అంత పెద్ద డాక్టరు దగ్గర చుట్టం కూడా అయితే.. పిన్ని త్వరగా బాగయిపోతుంది అనుకుంటోందది. పిచ్చితల్లీ! పిచ్చితల్లీ!!

ఆలోచనల మధ్య కళ్లు మూతలు పడ్డాయి.

"పిన్నీ పిన్నీ!" కుదుపుతోంది వత్సల. గాభరాగా ఉంది.

కళ్లు తెరిచాను. "పిన్నీ!" దాని నోట పిలుపు తప్ప మరో మాట రావటం లేదు. మనిషంతా వణికిపోతోంది.

"ఏమిటే.. ఏమైంది? "

"పిన్నీ! ఆయన.. ఆ డాక్టరు గారు.."

"ఏమిటమ్మా చెప్పు! లేరా? వెళ్లిపోయారా? "

"అవును పిన్నీ! మధ్యాహ్నం రెండింటికి తీవ్రమైన గుండెనొప్పి వచ్చి క్షణాల మీద పోయార్ట..."

"ఆc పోయాడా? " వెర్రి కేక పెట్టాను. పిచ్చిగా తలబాదుకుంటుంటే చేతులు పట్టుకోబోయిందది. నన్నాపలేక "సిస్టర్ సిస్టర్" అని అరుస్తూ పరుగెట్టింది.

ఇప్పుడు అట్టే దూరం వెళ్లకముందే అందుకోవాలి అని "మామయ్యా వస్తున్నా.." అని లేచి పరుగెట్టబోయాను ఊహల్లోనే. "అమ్మా! అమ్మా!" అంటూ ఓ చెయ్యి నిమ్మీ, ఓ చెయ్యి మీనూ పట్టుకుని వెనక్కి లాగేస్తున్న అనుభూతి.

కళ్లు తెరిచేసరికి ఎదురుగా అందరూ ఉన్నారు. నా తల్లీ తండ్రీ కూడా. వాళ్ల అందరి ముఖాల్లో ఆనందం. నాలుగు రోజులయ్యాక చెప్పింది అమ్మ. నే బతుకుతానని ఎవ్వరూ అనుకోలేదని. బతకడం వాళ్ల అదృష్టమనీను.

చుట్టూ చూసి "కాదమ్మా ఆనాడు కృష్ణ పిలిస్తే... ముందుకి అడుగు వెయ్యలేకపోయాను. కనీసం ఈ రోజునయినా వేద్దామంటే పిల్లలిద్దరూ కాళ్లకి బంధం వేశారు. జీవితంలో కాకపోయినా మృత్యువులోనయినా కలుద్దామని అనుకున్నాను 'అది సబబు కాదు. నువ్వు తల్లివి.. నీ పిల్లలకి నువ్వు కావాలి' అని ఎవరో హెచ్చరించినట్టయింది. నా పిల్లలిద్దరూ.. వాళ్లే బతికించుకున్నారమ్మా నన్ను"

"నిజమే తల్లీ! నువ్వు తల్లివనే భావనే నిన్ను బతికించింది. నీకెన్ని బాధలున్నా సరే.. నీ పిల్లలకి నువ్వు కావాలన్నది గుర్తుపెట్టుకో. నిన్నీ స్థితిలో చూస్తుంటే దీనికి కారణం మేమేనేమోనన్న బాధ ఎక్కువైపోతోంది. కానీ ఇప్పుడేం చెయ్యలేం కదా!"

అమ్మ ఇంకా ఏదో చెప్పబోయింది. వారించాను "వద్దమ్మా! ఒకరి కర్మకు మరొకరు బాధ్యులు కారు. ఏవో ఆశిస్తాం.. కొన్ని అవుతాయి, కొన్ని కావు. అలా అని అనుకోవటం మానేస్తామా? ఇదొక నిరంతర వాహిని. కోరినవి దొరికితే సంతోషం. దొరక్కపోతే విచారం" అంటూ.

"అమ్మా పరీక్షలు అయిపోయినై బాగా రాశా..." ఉత్సాహంగా పరుగెత్తుకుంటూ వచ్చింది మీను.

"అమ్మనెక్కువ అలసట పెట్టకే. చచ్చి బతికింది"

"అబ్బ! నువ్వెప్పుడూ ఇంతే అమ్మమ్మా!" ముద్దుగా విసుక్కుంటుంది అది. ఇంతలో అందరూ వచ్చారు. మావారు, మరుదులు, అక్కయ్యలు, బావలూ. వత్సలా, నిమ్మీ.. 'నువ్వు కావాలి' అంటున్నట్టున్నాయి అందరి చూపులూను.

ఇంతమందిని కాదనీ ముఖ్యంగా నా పిల్లలని.. అందరిలోకీ నా పిల్లల మీదే నా దృష్టి నిలిచింది. వాళ్లని కాదనీ ఇంకెక్కడికి పోతాను నేను? ©



# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ప్రవచన వాచస్పతి,
అభినవ వ్యాస టి.కె.వి. రాఘవన్
సమాధానాలు

ప్ర. పరిమళభరితమైన కుసుమాలే దేవునికి సమర్పించాలి కదా! మరి కనకాంబరం, బంతి, చేమంతి తదితరాలు అర్చనకు లేదా మాలలుగా వినియోగించ వచ్చా?

– టి.వి.డి.ఎన్. సీతారామారావు, కొత్తగూడెం

జ. నిర్గంధ కుసుమాలు, కంటక యుతమైనవి దేవతారాధనకు ఉపయోగించరాదని నియమం. కరివేరు, గన్నేరు, పొగడ వంటి పుష్పాలు కొన్ని దేవతామూర్తులకి అలంకరించరాదు. చేమంతులు వాడవచ్చు. అంతరార్థం ఏమిటంటే మనము వినియోగించుకునే ద్రవ్యాలు పూవులు, పండ్లు, అలంకారాలు ఎంత ఆనందకరంగా ఉండాలని అనుకుంటామో అలాంటి ద్రవ్యాలే పూజకి వినియోగించాలి. గంధము లేనివి, ముళ్లతో కూడినవి, సాధకుని ఏకాగ్రతను, ఆరోగ్యమును, వాతావరణమును దెబ్బతీస్తాయని నిషేధించారు.

ప్ర. భగవద్గీత రెండో అధ్యాయంలో 'కర్మణ్యే వాధికారస్తే..' అనడంలో కర్మలు చేయాలని తాత్పర్యం. మరో అధ్యాయంలో 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య...' అని చెప్పడం మొదటి దాంతో విభేదిస్తోంది గదా! స్పష్టపరచగలరు?

– తూములూరి పార్థసారథి,
చైతన్యపురి, హైదరాబాద్

జ. భగవద్గీతలో చెప్పిన దాంట్లో ఎక్కడా విభేదం లేదు. 'కర్మణ్యేవ అధికారః తే' అంటే నీ అధికారము, బాధ్యత కర్మలు ఆచరించడం మాత్రమే అని. ఇక 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య..' అంటే ధర్మాలు (కర్మలు) పనులు మానేసేయమని కాదు. ఈ పని వలన ఈ ఫలితం ఉంటుందనే ఆలోచనను వదలాలి. చేసే పనివల్ల వచ్చే ఫలితం మీద దృష్టి ఉండకూడదని. ఇతర ఆలోచనలతో పని చేయడం వల్ల ఏకాగ్రత కోల్పోయి పొరపాట్లు జరిగే ప్రమాదముందని. జాగరూకతతో ప్రవర్తించాలని తాత్పర్యం.

ప్ర. హిందూమతం భారత సంస్కృతిలో భాగమని, దాన్ని ఒక మతంగా పరిగణించరాదని నా అభిప్రాయం. కానీ హిందూమతం నాశనం అయితే కానీ ఈ దేశం, ప్రపంచం బాగుపడవని పనికట్టుకుని మరీ కొందరు ప్రచారం చేస్తున్నారు. సత్యమేమిటో వివరించ మనవి?

– పట్టిసపు శేషగిరిరావు,
ఎం.వి.పి. కాలనీ, విశాఖపట్నం

జ. ప్రజల జీవన విధానములో వారి వారి ఉపకరణాలు, భోగములు, భోగస్థానములు వీటన్నిటిలో తరతరాలుగా వచ్చే మార్పులు, చేర్పులు- దీన్నంతా సంస్కృతి అంటారు. మతము అన్నది పదిమందీ కలిసి తమ తమ మనోభావాలకి అనుగుణంగా అనుసరించే ఆచారములు, వ్యవహారములు, నమ్మకముల కలబోత, ఆదరించే వ్యవహారమే మతము. హిందూ శబ్దం మన భాషలోనికి ప్రవేశించిన అన్యదేశ్యము. ముస్లిముల పరిపాలనా కాలం నుంచి ఈ పదం వచ్చిందని పెద్దలు చెబుతారు. భారతీయ సంస్కృతికి వేదాలు మూల కందములు. సంస్కృతి, మతము ఈ రెండూ కూడా ఏనాటికీ అంతరించవు.. ఇది సత్యము.

ప్ర. భగవంతుడు దశ అవతారాలు ఎత్తి పాపాత్ములను సంహరించాడు కదా! మరి కలియుగంలో ఇన్ని పాపాలు, అక్రమాలు జరుగుతున్నా ఎందుకు అవతారం ఎత్తడం లేదు?

– జి.ఎస్. శ్రీనివాసరావు, బొబ్బిలి

జ. అవతారముల పట్టీలో చివరి రెండు (ఆఖరువి మాత్రం కాదు) రామ.. కృష్ణ అవతారములు. పూర్తిగా మానవ అవతారం మొదటిది.

# చతుర ప్ర.జ. 5

ఉత్తమ ప్రశ్నకు రూ.116/-

జిజ్ఞాసువులైన పాఠకుల ఆదరాభిమానాలు అత్యంతంగా చూరగొన్న 'చతుర ప్ర.జ' శీర్షికను నిర్వహించడానికి ప్రవచన వాచస్పతి, అభినవ వ్యాస **టి.కె.వి. రాఘవన్** అంగీకరించారు. ఆచార వ్యవహారాలు.. సంస్కృతీ సంప్రదాయాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి మాకు పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.**

చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

రెండవది మానవుని భావం, దివ్యత్వం కలబోసుకున్నది, అదే శ్రీకృష్ణ అవతారం. అంతకు ముందు పరశురామావతారం. ఈ మూడూ మనకిచ్చే సందేశం ఏమిటంటే.. ప్రభువు తప్పు చేస్తే ప్రభావం ఎంత భయంకరంగా ఉంటుందో చూపింది పరశురామావతారం. ప్రభువు ఎలా ఆదర్శంగా ఉండాలో తెలియజేసింది శ్రీరామావతారం. ఆ రెండు అవతారముల లక్షణములు కలిపి అవసరమైన చోట దండన, మరొకచోట దండము (నమస్కారము) సమర్పించే విధానము చూపింది శ్రీకృష్ణావతారము.

భగవంతుని లక్షణములైన సత్యము, ధర్మము, నీతి నియమములు పాటించే ప్రతివ్యక్తీ దేవుడి అవతారమే. భగవంతుడు ఎప్పుడు, ఏ రూపములో వస్తాడో అని ఎదురు చూడకుండా మంచిని నిలబెట్టేందుకు యథాశక్తి ప్రయత్నించే ప్రతివ్యక్తీ అవతార స్వరూపమే.

*ప్ర. ఏ మతం కూడా ప్రాణం తీయమని చెప్పడం లేదు. కానీ మనిషి స్వార్థంతో, అధిపత్యం కోసం దాడులు చేయించడం వల్ల వేలాది మంది అమాయకులు బలవుతున్నారు. ఇది ఎంతవరకు సమంజసం? ప్రపంచం ఎప్పుడు శాంతియుతంగా ఉంటుంది?*

**– నల్లపాటి సురేంద్ర,**

*పెదగంట్యాడ, విశాఖ జిల్లా*

**జ.** ప్రపంచం శాంతియుతంగా ఉండడానికి ప్రహ్లాదుడు చిన్న ఉపాయం చెప్పాడు. 'నీ దగ్గర మంచి వస్తువు ఉండి, ఎదుటివాని దగ్గర అది లేకుంటే జాలిపడు. ఎదుటివాడి దగ్గర అది ఉండి, నీ దగ్గర లేకుంటే వాడిని అభినందించు. నువ్వు అది సాధించేందుకు ధర్మబద్ధంగా ప్రయత్నించు. ఇద్దరి దగ్గరా అది ఉంటే వాడితో సంధి చేసుకొని మిత్రత్వం పాటించు'. దీనిని మాణిక్య వాచగర్ అనే భక్తుడు మరొకలా కోరుకున్నాడు. 'భగవంతుడా! ఏ కాస్త ఆహారం దొరికినా, కడుపు నిండకున్నా పదిమందితో కలిసి భుజించే కాకి బుద్ధి, పదిమందినీ కోరుకునే కాకి సంస్కారం నాకు ఇయ్యి' - ఇదే పాటిస్తే స్వార్థం, ఆధిపత్యపోరు మచ్చుకైనా కనిపించవు. యుగయుగాలుగా తత్త్వవేత్తలు ప్రపంచశాంతికి ప్రయత్నిస్తూనే ఉన్నారు.

*ప్ర. దాంపత్య జీవితం ఎలా గడపాలో రామాయణంలో సీత పాత్ర ద్వారా స్త్రీజాతికి తెలిపారు. మరి ఊర్మిళ ద్వారా ఇచ్చే సందేశం ఏమిటి?*

**– పక్కి బాలకృష్ణారావు,**

*గరివిడి, విజయనగరం జిల్లా*

**జ.** సీతాదేవి జాగ్రత్తగా భర్తను అనుసరించి, ఆదర్శంగా నిలిచింది నిజమే! తానలా ప్రవర్తించడానికి కారణం ఏమిటో అనసూయాదేవికి వివరించింది. 'తల్లి, తండ్రి, సోదరులు.. ఇలా అందరూ అమ్మాయికి కొంతవరకు మాత్రమే సంపదలు ఇస్తారు. కానీ భర్త కోరినవే కాక కోరనివీ ఇస్తాడు. శ్రీరాముని గుణగణాలకి నేను వశురాలిని. భర్త ఎంత దుర్గుణాలు ఉన్నవాడైనా అమిత శ్రద్ధతో సేవచేస్తే ఆమెను పతివ్రత అంటారు. మచ్చుకైనా చెడుగుణం ఒక్కటీ లేనివాడు, అడగకుండానే అన్నీ సమకూర్చేవాడు, అమితంగా అభిమానించేవాడు అయిన శ్రీరాముని నేను సేవించడం పతివ్రతా ధర్మంగా పొగడవలసిన అవసరం ఉంటుందా?' అని అడిగింది. అంటే తనదేమీ లేదని, అదంతా భర్త గొప్పతనమని తేల్చి చెప్పింది.

భార్య ప్రవర్తన ద్వారా భర్త విశేషాన్నీ, భర్త ప్రవర్తన నుండి భార్య ఆనుకూల్యాన్నీ గమనిం

చవచ్చు అంటాడు అగస్త్యుడు తన సంహితలో. ఇదే ఊర్మిళకి వర్తిస్తుంది. వాల్మీకి ప్రత్యేకంగా ఊర్మిళ, మాండవీ, శ్రుతకీర్తుల గురించి చెప్ప లేదు. అయితే ఊర్మిళ పాత్ర లక్ష్మణుని ఉదాత్త తకి దీటు రాగలిగినదని గమనించవచ్చు

ప్ర. తిరుమలలో జపాలి/ జబాలి తీర్థం ఉంది. అక్కడ ఆంజనేయస్వామి ఉన్నారు. ఈ పదం 'ఆంజనేయ' పదానికి పర్యాయమా? లేక జాబాలి మహర్షి పేరు ఇలా మార్పు చెందిందా?

**– వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి**

జ. 'జాబాలి' తీర్థం అన్నది సరైనపదం. ఈ మహర్షి దశరథ పురోహితులలో ఒకరు. 'వేంక టాచల మహాత్మ్యము' ప్రకారం, దశరథుడు తన పరివారంతో వేంకటేశ్వరుని దర్శించినపుడు ఈ మహర్షీ ఉన్నారు. స్వామి తీర్థానికి, ఫల్గుణీ తీర్థా నికి ఉత్తరభాగంలో సరస్తీరంలో జాబాలి తన ఆశ్రమం నిర్మించుకొని శిష్యులతో నివసించారు. కృత, త్రేత, ద్వాపర యుగాలలో రుషులు, రాజులు, పెద్దలు ఎందరెందరో ఇక్కడికి వచ్చి వారి వారి అభిరుచుల మేరకు తమ తమ దైవా లకి ఆరాధనలు చేసుకున్నారు. కాలక్రమంలో హనుమ కూడా పూజలు అందుకున్నారు. 'జాబాలి హనుమ'గా ప్రసిద్ధిచెందారు. పలుకుబ డిలో 'జాపాలి' అయింది. అంతేతప్ప 'జాపాలి' - 'జాబాలి' అనేవి హనుమకు పేరు మాత్రం కావు.

ప్ర. తిథి, వార, వర్జ్యాలు, నక్షత్రాలు, అన్ని శుభఘడియలు, సుముహూర్తాలు చూసి చేప ట్టిన పనులకు కూడా అవరోధాలు ఎదురవుతు న్నాయి. ఎందుకు?

**– యు. చిట్టిబాబు, న్యూ పాల్వంచ**

జ. మీరు చెప్పిన వాటితో పాటు కరణము, యోగము కూడా ఉన్నాయి. అవి కూడా చూసు కోవాలి. మన మనసుకి తట్టని, ఊహకు అందని తత్త్వం ఒకటి ఉంటుంది. రావణుడు గొప్ప జ్యోతిషశాస్త్రవేత్త. సీతను అపహరించడానికి పంచాంగం చూసుకునే బయలుదేరాడు. అద్భుత మైన ప్రణాళిక వేశాడు. అడ్డంకులు ఎదురైనా దాటుకొని సీతను లంకకి చేర్చాడు. వేలాది సంవ త్సరాల వైభోగం ఒక్క ఏడాది తిరగకుండా నేల మట్టమయింది. సర్వనాశనం అయ్యాడు. ఇందులో తప్పు పంచాంగాలదా? జ్యోతిషశాస్త్రా నిదా? కాదు. జటాయువు రామునితో మాట్లా డుతూ దీనికి వివరణ ఇచ్చాడు. 'విందము అనే ముహూర్తంలో దొంగిలించాడు సీతను. పోయి న వస్తువు అనతికాలంలో యజమానిని చేరు తుంది. ఇదీ ముహూర్త ప్రభావం' అందువల్ల సీత నీకు తప్పక, త్వరలో లభిస్తుంది' అని చెప్పాడు. ముహూర్తం చూసే పద్ధతి ఏమిటో ఇక్కడుంది. పని ప్రారంభానికి కాదు, పని సాను కూలంగా, ఫలవంతంగా అయ్యే ముహూర్తం చూసుకోవాలి. ఆటంకాలు రావు.

ప్ర. కళ్యాణం - కల్యాణం పదాలకు అర్థం ఏమిటి? ఏయే సందర్భాల్లో ఉపయోగిస్తారు?

**– టి. హేమలత, మచిలీపట్నం, కృష్ణా జిల్లా**

జ. ఈ రెండు పదాలు ఒకటే. పలికే తీరుని బట్టి ఆ తేడా వచ్చింది. సంస్కృత మూలపదం 'కల్యాణము'. కల్యం లాతి, కల్యం అణతి - శుభ మును తెచ్చునది, కలిగించునది అని అర్థం. 'ళ' అక్షరం తెలుగు భాషకు చెందింది. ఏ పదం వాడినా ఇబ్బంది లేదు.

## రూ.116/- బహుమతి పొందిన
# ఉత్తమ ప్రశ్న

ప్ర. కొందరు పాపాత్ములు హాయిగా, పు ణ్యాత్ములు కష్టపడుతూ జీవిస్తారెందుకు?

**– డా. శివభూషణం, కర్నూలు**

జ. పాపాత్ములు హాయిగా ఉన్నట్లు కనిపి స్తారు. పుణ్యాత్ములు కష్టపడినట్లు అనిపి స్తుంది. పాండవుల్ని అడవిపాలు చేసిన దుర్యోధనుడు సుఖంగా ఉండగలిగాడా? కంటి నిండా నిద్ర పోగలిగాడా? అడవులపా లయిన పాండవుల సుఖం దుర్యోధనుడు పొందాడా? అర్జునునికి పాశుపతం, భీము నికి ఆంజనేయ దర్శనం, ధర్మరాజుకు అక్ష యపాత్ర, యముని వరాలు- ఇవన్నీ వాళ్ల నగరంలో ఉంటే దొరికేవా? మహావీరుడ నని విర్రవీగిన రావణుడే సీతను దొంగిలించి తెచ్చిన తరువాత ఎవరూ చేర శక్యంకాని లంకకి భద్రతా ఏర్పాట్లు నాలుగురెట్లు చేశాడు. కానీ అడవుల్లో పడి తిరిగే రామల క్ష్మణులకి, చిటికేస్తే పారిపోయే నిలకడ లేని కోతిమూకలు వారధి బంధించి, శత్రుస్థావ రంలోకి చొచ్చుకొని వెళ్లి సాయపడ్డాయి. ఇందులో ఎవరు హాయిగా ఉన్నారు? దుర్మార్గుల, పాపాత్ముల సుఖం నీటిబుడగ లాంటిది. పుణ్యాత్ముల కష్టాలు శిలకి తగిలే ఉలిదెబ్బలు. శిల్పాలుగా పూజలందుకునే వారు పుణ్యాత్ములే!




కావిలిపాటి విజయలక్ష్మి

# విధి విన్యాసాలు

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**ఏదైనా నవలని సినిమాగా మలచటానికి ఎంపిక చేసుకునేటప్పుడు, ప్రధానంగా చూసే విషయాలు కొన్ని ఉంటాయి. వాటిలో మొదటిది నాటకీయత, రెండోది సెంటిమెంట్. ఈ రెండు పుష్కలంగా వున్న నవల కావిలిపాటి విజయలక్ష్మిగారి 'విధి విన్యాసాలు'. 1971లో ప్రచురితమైన ఈ నవల బహుళ ప్రాచుర్యం పొందటమేకాక 'తాసిల్దారుగారి అమ్మాయి' పేరున చలనచిత్రంగా కూడా వచ్చి మంచి విజయం సాధించింది.**

'విధి విన్యాసాలు' నాటకీయత, సెంటిమెంట్ రెండూ సమపాళ్ళలో మిశ్రమమైన చక్కటి మధ్యతరగతి కుటుంబ గాథ. అంతకన్నా ప్రధానంగా, ఆ కాలంనాటి పఠితలకి అంతగా పరిచయం లేని ఓ కొత్త అంశం ఈ నవలలో మౌలిక ఇతివృత్తం కావటం, అప్పట్లో బాగా ఆకర్షించింది. దాంతో ఈ నవలని వదలకుండా చదివారు.

ఉమ్మడి కుటుంబాలలో ఆవేశాలు, పుల్లవిరుపు మాటలు విసరటం సాధారణమే. ఈ నవలలోని 'కండక్టర్ కొడుకు కలెక్టరవుతాడా?' అన్న మాట ఆనాటి పాఠకుల హృదయాన్ని బాగా పట్టుకుంది. నవల ఆరంభ వాక్యమే అది. ఆ వాక్యం మీదే అల్లుకుంది ఈ నవల. ఆ వాక్యంలో సందేహమో? సమాధానమో? ప్రధానం కాదు. ఓ చులకన భావం. ఓ రకం హేళన వున్నాయి. అలా హేళనగా పలికింది రాజశేఖరం. అలా అన్నది తన మేనల్లుడు వాసు గురించి.




వాసుకి పదహారేళ్ళు. స్కూలు ఫైనలు పాసయ్యాడు. కాలేజీలో చేరటానికి తల్లి దగ్గర డబ్బు లేదని తెలుసు. తండ్రి తమని వదిలేశాడనీ తెలుసు. చదువుకోసం అడిగితే, పెద్దమామయ్య రాజశేఖరం అన్న మాట అది. ఆ పసివాడి మనసు ఆ మాటకి విలవిల్లాడింది. అతని గుండెలు పిండినట్టయింది. విజయలక్ష్మిగారు పదహారేళ్ళ ఆ కుర్రాడి పరిస్థితిని, మానసిక స్థితిని ఎంతో గాఢంగా చిత్రీకరించారు.

పెద్దమామయ్య హేళన తర్వాత, తల్లి సలహా మీద, చదువుకి సాయం కోసం చిన్నమామయ్య గోపాలరావు వాళ్ళ ఊరు వెళ్ళాడు. గోపాలరావు ఆదరంగా మాట్లాడాడు. ఫీజులు ఎవరైనా కడితే, వసతీ, భోజనం తను చూస్తానన్నాడు. ఫీజుల కోసం మళ్ళీ పెద్ద మామయ్య రాజశేఖరాన్నే అడగమన్నాడు.

ఎటూ తేల్చుకోలేని బాధ వాసుకి. అటు చదువు వదులుకోనూలేడు.. ఇటు హేళనగా మాట్లాడిన పెద్దమామయ్యని మళ్ళీ అడగటానికి మనసూ రాదు. అనుకోకుండా, చిన్నమామయ్య ఇచ్చిన అడ్రసు తీసుకుని ధైర్యం చేసి తండ్రి ప్రసాదరావుని కలుసుకోటానికి విశాఖ వెళ్ళాడు వాసు.

వాసు తన కొడుకని తెలియనంతవరకూ, పేద విద్యార్థితో మాట్లాడినట్టే మాట్లాడాడు ప్రసాదరావు. కొడుకని తెలిసిన తరువాత అతనిలో పితృవాత్సల్యం పొంగి పొరిలింది. వాసు చదువుకి బాధ్యత వహించడానికి సిద్ధపడ్డాడు. అయిదేళ్ళు బస్ కండక్టర్‌గా పనిచేసినా, ఇప్పుడు ప్రసాదరావు ఓ పెద్దషాపులో భాగస్వామి. అంతేకాదు, ఆర్థికంగా బాగా పుంజుకున్నాడు. తండ్రి ఆదర

ఐలో అలసిన పక్షిలా ఒదిగిపోయాడు వాసు. ఇలా ఈ నవలలో ఎన్నో ఆర్ద్రమైన సన్నివేశాలు వున్నాయి. విధి చేసిన విన్యాసాలనిపించే ఇటువంటి సంఘటనలతో కూడిన ఈ నవల వాసు కథే అనిపించినా, నిజానికి ఇది వాసు తల్లి మధుమతి, ప్రసాదరావుల కథ.

మధుమతి తాసిల్దార్ వెంకట్రామయ్యగారి అమ్మాయి. తల్లి జానకమ్మ. వాళ్ళ పక్క ఇంట్లోనే ప్రసాదరావు, అతని బామ్మ నివాసం. ఆ బామ్మ తప్ప తనవాళ్లంటూ, ఎవరూ లేనివాడు ప్రసాదరావు.

ప్రసాదరావు బీఏ పాసయి ఖాళీగా ఉన్నాడు. ఆయన తరపున ఏదైనా ఉద్యోగం చూడమని బామ్మగారు తాసిల్దారుగారిని అభ్యర్థించింది. ఆయన ప్రసాదరావుని గుమస్తా ఉద్యోగంలో చేర్చారు. రానురాను రెండిళ్ళ మధ్య రాకపోకలు పెరిగాయి. మధుమతికి ప్రసాదరావుకి పరస్పరం ఇష్టం పెరిగింది. బామ్మగారు మరణిస్తూ చావు ఘడియల్లో ప్రసాదరావు చేతిని, తాసిల్దారుగారి చేతిలో పెట్టింది.

ఆవిడ పోయాక తాసిల్దారు వెంకట్రామయ్య మధుమతి, ప్రసాదరావుల వివాహం జరిపించారు. కొత్త దంపతులు ఎంతో ప్రేమగా బాగా వున్న సమయంలో ఓ చిన్న సంఘటనతో ప్రసాదరావుకి, వెంకట్రామయ్యగారికి మధ్య భేదాభిప్రాయాలు వచ్చాయి.

ప్రసాదరావు ఆఫీసులో జోగయ్య అనే వ్యక్తిని తప్పించి ఆ ఉద్యోగంలో వేరే వాడిని ఖాయం చెయ్యమన్నారు వెంకట్రామయ్యగారు. జోగయ్య పేదవాడు, పైగా అలా చెయ్యటం అన్యాయమని అంగీకరించలేదు ప్రసాదరావు. కృతజ్ఞత లేకుండా, ప్రసాదరావు ఎదిరించటం సహించలేకపోయారు వెంకట్రామయ్యగారు. మధుమతి కూడా తండ్రి పక్షాన చేరి అతన్ని అవమానించింది. జోగయ్య చెల్లెలు రాజమ్మ. ఆమెకి భర్త లేడు. ఆమెతో ప్రసాదరావుకి సంబంధం వుందని, అందువల్లనే అలా ప్రవర్తిస్తున్నాడని నిందించారు. గొడవ పెరిగి పెద్దదై, చివరికి ప్రసాదరావుని ఆ ఇంట్లోంచి వెళ్ళగొట్టే వరకూ వచ్చింది. వాళ్ళ కొడుకు వాసు, తల్లి మధుమతి దగ్గర ఉండిపోయాడు. ఈ కలతతో జబ్బుపడి, కూతురి పరిస్థితికి దిగులు పడి వెంకట్రామయ్యగారు మరణించారు. ఆయన తర్వాత వాళ్ళ కుటుంబం చితికిపోయింది. మధుమతి అన్నగార్లు రాజశేఖరం, గోపాలరావు ఉద్యోగాలు చేసుకుంటూ, ఇంటి మీద, పొలం మీద వచ్చే కొద్ది ఆదాయం మధుమతికి వదిలేశారు. దాంతోటే అత్తగార్ని, కొడుకుని చూసుకుంటూ కాలం గడిపింది మధుమతి. వాసు స్కూలు ఫైనల్ పాసయ్యాడు.

ఇల్లు వదిలి వెళ్లిన ప్రసాదరావు జీవితం రకరకాల మలుపులు తిరిగింది. తనని అంతగా అవమానించిన మధుమతి మీద కసితో నిజంగానే రాజమ్మతో సంబంధం పెట్టుకున్నాడు. మామగారి దయతో లభించిన ఉద్యోగం మీద బతకటం ఇష్టంలేక రాజీనామా చేశాడు. తనకి రావలసిన ప్రావిడెంట్ ఫండ్, ఇతర సొమ్ము భార్యకే అందేలా చేశాడు.

ఇంక ఆ ఊళ్ళో వుండకూడదని, ఎటైనా వెళ్ళిపోదాం తనతో రమ్మనమని రాజమ్మని అడిగాడు. దానికి రాజమ్మ, జోగయ్య ఒప్పుకోలేదు సరికదా, వాళ్ళూ ప్రసాదరావుని తూలనాడారు. మనసు విరిగిపోయి, ప్రసాదరావు ఒక్కడే విశాఖ వచ్చేశాడు. కొన్నాళ్ళు బికారిలా, నిరుత్సాహంగా తిరిగాడు. ఆ తర్వాత ఓ స్నేహితుడి ప్రోద్బలంతో బస్‌కండక్టర్‌గా చేరాడు. అయిదేళ్ళు ఆ ఉద్యోగం చేశాడు. అప్పుడే ఒకసారి మధుమతిని, వాసుని తన బస్‌లో ప్రయాణిస్తుంటే చూశాడు. ఆ తర్వాత ప్రసాదరావుకి విజయాపాలెస్ యజమాని తన షాపులో ఉద్యోగం ఇచ్చాడు. అతని నిజాయితీ, పనీ నచ్చి భాగస్వామ్యం కూడా ఇచ్చాడు. అలా నిలదొక్కుకున్న తండ్రి దగ్గరికి ఇప్పుడు వాసు చేరాడు.

వాసుకి ఫీజులు కట్టి చదివిస్తానని ప్రసాదరావు ఓ షరతు పెట్టాడు. తాను చదివిస్తున్నట్టు తల్లి మధుమతికి తెలియనివ్వద్దన్నాడు. తెలిసి ఆమె పంతానికి పోతే వాసు చదువు ఆగిపోతుందేమోనని ప్రసాదరావు భయం.

అలా చదువుకుంటూ వాసూ ఎం.ఎ. పాసవటం, కలెక్టరు కావటం, చిన్నమామయ్య కూతురు పద్మజని పెళ్ళి చేసుకోవటం, ఆ పెళ్ళిలో మధుమతి, ప్రసాదరావు కలుసుకోవటం, తిరిగి వారి సంసారం కుదుటపడడం ఈ నవల ముగింపు.

నవలలో చిన్నా, పెద్దా సంఘటనల్ని ఎంతో రసవత్తరంగా కూర్చారు కావిలిపాటివారు. చిన్న చిన్న విషయాలే అయినా, పరిస్థితి అనుకూలంగా లేని సమయంలో మనసుల్ని ఎంతగా బాధపెడతాయో, అనుబంధాలు ఎంతగా విలవిలలాడతాయో లోతుగా చిత్రించారు.

ఇలా భార్యా భర్త విడిపోవటం డెబ్బై దశకా

# మధ్యతరగతి మందహాసం



కౌవిలిపాటి విజయలక్ష్మి 1933 ప్రాంతంలో విశాఖపట్నం జిల్లా దేవరపల్లి గ్రామంలో జన్మించారు. ఆ గ్రామంలో ఎనిమిదో తరగతి వరకే విద్య అందుబాటులో ఉండేది. తరువాత స్వయంకృషితో విజయలక్ష్మి పదిహేడో ఏటనే ఒక చిన్నకథతో రచనారంగంలో అడుగుపెట్టారు. అది మొదలు ఇక వెనుతిరిగి చూసింది లేదు. ఆనాటి ప్రసిద్ధ వార, మాస పత్రికలకు, ప్రత్యేక సంచికలకు అనేక కథలు రాశారు. ఎనిమిది కథలతో 'అతిథి' పేర ఒక సంపుటి తెచ్చారు. ప్రధానంగా విజయలక్ష్మి నవలా రచయిత్రిగా ప్రసిద్ధికెక్కారు. 32 నవలల దాకా రాశారు. వీరి నవలలు కొన్ని చలనచిత్రాలుగా కూడా విజయం సాధించాయి. మధ్యతరగతి జీవుల ఆశలు, ఆశయాలు.. ఉమ్మడి కుటుంబాల్లోని ఆవేశకావేషాలు, అసూయా ద్వేషాలు వీరి నవలల్లో ఇతివృత్తాలు కావడంతో పాఠకుల హృదయాలకు హత్తుకున్నాయి. దీనికితోడు సంభాషణాత్మకంగా కథనం సాగడం, వ్యంగ్యాన్ని రంగరించడం, నాటకీయత వంటివి పాఠకాదరణ బహుళంగా గడించడానికి దోహదపడ్డాయి. ఈ లక్షణాలే వీరి నవలల్ని చలనచిత్రాలుగా మలచడానికి, విజయవంతం కావడానికి ప్రధాన కారణంగా చెప్పవచ్చు.

లనాటికి అరుదైన సంఘటన. కష్టమో, నష్టమో భార్య, భర్తనీడనే ఓర్పుగా సంసారం నిలబెట్టుకుంటున్న కాలమది. అటువంటిది మధుమతి భర్తతో విడిపోవటానికి సిద్ధపడటం, అందునా ప్రాణంగా ప్రేమించే ప్రసాదరావు నుంచి కావాలనే దూరమవ్వటం కొత్త సంగతి. అలాంటి జీవితాలు ఎలా గడుస్తాయో తెలుసుకోవటం మీద పాఠకులకు అపరిమిత ఆసక్తి ఏర్పడింది. దానికి తోడు, అటువంటి దంపతుల కొడుకుగానే పసివాడు న్యూనతకి గురవటం, చదువు కోసం పెద్దా, చిన్నా ఛీత్కారాలు భరించటం, ఒంటరిగానే కుమిలిపోయినా, పెద్దమనిషి తరహాగా ప్రవర్తించి నెగ్గుకు రావటం చాలామంది మనసుల్ని పట్టుకుంది. అందుకే 'విధి విన్యాసాలు' అంతటి విజయాన్ని సాధించింది.

ఈ నవల మరో ప్రత్యేకత ఏమిటంటే ఇందులో ఏ పాత్రా చెడ్డది కాదు. పేరుకి తగినట్టు విధి ప్రభావం వల్లే ఆయా పాత్రలు ఎదుటివారికి కష్టం కలిగేటట్లు ప్రవర్తించాయి. వెంకట్రామయ్య, మధుమతి, జోగయ్య, రాజమ్మ.. వీళ్ళ ప్రవర్తన, పట్టుదలలు కేవలం కాలానుగతం. ప్రసాదరావు తన నుంచి దూరమయ్యాక తిరిగి పెళ్ళి చేసుకుని పెళ్ళాం పిల్లలతో వుంటున్నాడన్న తప్పుడు వార్త వినకపోతే మధుమతికి అంత పట్టుదల ఉండేది కాదు. అవమాన భారపు ఉద్రేకంలో రాజమ్మతో ప్రసాదరావు సంబంధం పెట్టుకోకపోతే అతనికి అపరాధ భావనే ఉండేది కాదు. అంత కాలం మధుమతికి దూరంగా ఉండేవాడే కాదు. ఇలా విధి ఆడిన నాటకం ప్రభావంలాగే పాత్రల తీరుల్ని, స్వభావాల్ని తీర్చిదిద్దారు రచయిత్రి.

ఉత్కంఠ, ఆసక్తి నిండుగా వున్న కౌటుంబిక నవల విధి విన్యాసాలు. లోతైన ఆలోచన లేకుండా, ఏదో చాలా తేలిగ్గా రాజశేఖరం 'కండక్టర్ కొడుకు కలెక్టరవుతాడా..!' అన్న ఒక్క పరుషవాక్యంలోని హేళన ఓ కుటుంబం మొత్తాన్ని ఎంతగా ఘర్షణకి గురిచేసిందో చిత్రంగా అనిపిస్తుంది. అయినా చివరికి ఆ మాట ప్రభావం వల్లే వాసు కలెక్టరవటం సంతోషమనిపిస్తుంది.

ప్రసాదరావుది ఓ విలక్షణమైన పాత్ర. బలహీనతతో రాజమ్మ సంపర్కం పెట్టుకున్నా ఆమె నుంచి విడిపోయాక అతను చాలా నీతిగా, నిజాయితీగా బతికాడు. తానే బాధలు పడ్డాడు కానీ, ఎవరికీ ఏ మాత్రం బాధ కలిగించలేదు.

వాసు తన పెద్ద మరదలు జయవేపు మొగ్గినా, సరైన విచక్షణతో పద్మజని ఎంచుకోవటం, మధుమతి ప్రసాదరావుల పునస్సంధానం, గోపాలరావు, లక్ష్మిల మంచితనం, ఈ శుభపరిణామం కళ్ళారా చూసిన మధుమతి తల్లి జానకమ్మగారి తృప్తి.. ఇలాంటి అంశాలన్నీ పాఠకుల్ని అలరించాయి. ప్రసాదరావు, మధుమతి, వాసుల మధ్య జీవితం నిష్ఠుర నిజాలు గుండెల్ని పట్టుకుంటాయి.

ముగింపు ముందే గ్రహించగలిగినా అడుగడుగునా ఆసక్తి నిండేలా నవలని నడిపించిన విధానం ప్రశంసనీయం. విధి విడదీసిన వ్యక్తుల మానసిక సంక్షోభానికి, ఆశ, నిరాశలకి నిలువెత్తు ప్రతిబింబం విధి విన్యాసాలు. ©

# నేటి న్యాయం

- బద్దిగం పాండురంగారెడ్డి



ఆర్టీసీ ప్యాసింజరు బస్సు జనంతో కిక్కిరిసి, కరీంనగర్ బస్‌స్టాండ్‌లో నిలబడి ఉంది. చాలా మంది మగవాళ్లు నిలబడి ఉన్నారు. ఇంకా డ్రైవర్ రాడేమని విసుక్కుంటున్నారు ప్రయాణికులు.

ఇంతలో ఓ భార్యాభర్త ఆ బస్సు ఎక్కారు. "అసలే ఇరుకుగా ఉంటే వీళ్లొకళ్లు" అని విసుక్కున్నట్టు ముఖాలు పెట్టారు కొందరు.

వాళ్లిద్దరికీ సీటులేదు. ఆమె చేతిలో రెండు సంవత్సరాల బాబు కూడా ఉన్నాడు. అయినా వింతగా చూస్తున్నారు కానీ ఆడవాళ్లెవ్వరూ చోటివ్వలేదు. మగవాళ్లు అసలే ఇవ్వలేదు.

బస్సు బయల్దేరింది. కూర్చున్నవాళ్ల ప్రాణాలు కుదుటబడ్డాయి. నిలబడ్డవాళ్ల ప్రాణాలు ఇరుకునబడ్డాయి. గతుకుల రోడ్డుమీద అటూ ఇటూ తూలి పడకుండా ఫీట్స్ చేస్తున్నారు. ఆమె బాబుతో బ్యాలెన్స్ చేసుకోవడం కోసం అవస్థ పడుతోంది. ఆమె భర్త వాడ్ని తీసుకోవాలని చూశాడు కానీ వాడు రానని మారాం చేస్తున్నాడు.

ఇందాకటి నుంచి ఆ అవస్థ గమనించిన శివరాం లేచి తాను కూచున్న సీటును చూపిస్తూ 'ఇక్కడ కూర్చోండి మీరు' అన్నాడు ఆమెతో.

శివరాం పక్కన ఎవరో పన్నెండేళ్ల పిల్లాడు ఉన్నాడు ఆ సీట్‌లో. అందుకని సంకోచించకుండా చటుక్కున కూర్చుందామె.

ఇప్పుడు శివరాం ఫీట్స్ మొదలయ్యాయి. తను ఆమె మీదకు తూలకుండా ఆమె భర్తను ఆమె పక్కకు వెళ్లమని, తాను వెనక్కి వెళ్లి నిలబడ్డాడు.

ఓ స్టాప్‌లో బస్సు ఆగింది. ఎవరో ఆడవాళ్లు దిగారు. సీటు ఖాళీ అయింది. తన సీటు కోసం ఎదురుచూస్తున్నాడు శివరాం.

## చతుర కత

ఆమె బిడ్డను తీసుకుని లేచి, గబుక్కున భర్త చెయ్యిపట్టి లాగి 'మీరిక్కడ కూర్చోండి' అని అతన్ని తను కూర్చున్న స్థలంలో కూర్చోబెట్టి తాను ముందుకు వెళ్లిపోయి కూర్చుంది.

తెల్లబోయాడు శివరాం. ఆ అపర పతివ్రతను చూసి 'ఇది ఈ యుగన్యాయం' అన్నట్టు బస్ హారన్ వేసి బయలుదేరింది. ©

# భామనే.. సత్యభామనే..!

16

తెలుగులో 'నేనొక్కడినే' సినిమాతో తెరంగేట్రం చేసి బాలీవుడ్‌కు తారాజువ్వలా దూసుకు పోయిందా ముద్దుగుమ్మ. అక్కడ తొలి సినిమాతోనే ఫిల్మ్‌ఫేర్ అవార్డ్ ఫర్ బెస్ట్ ఫిమేల్ డిబట్‌ను అందుకుంది ఆ నవ కథానాయిక! అవకాశాలను అందిపుచ్చుకుంటూ అనతికాలంలోనే అందరి మన్ననలూ అందుకుంటున్న ఆ చిన్నది కృతిసనన్. ఆమె సోయగాల వెనుక దాగిన రహస్యాలేంటో చూద్దాం..

## సొగసు చూడతరమా...



త్వరగా బరువు తగ్గడం నా శరీర తత్వం. అలా తగ్గకుండా సరైన సమయానికి సమతుల ఆహారం నా శరీరానికి అందేలా జాగ్రత్తపడ తాను. గోరువెచ్చని నీటిలో కొంచెం తేనె కలిపి పరగడుపున తాగుతాను. పొట్టలోని వ్యర్థాలు తేలికగా బయటికి వెళ్లిపోతాయి. రెండు ఉడకబె ట్టిన కోడిగుడ్లు, రెండు బ్రౌన్ బ్రెడ్ ముక్కలు, తాజా పళ్ల రసం నా అల్పాహారం. పండ్లు లేక పోతే ప్రోటీన్ షేక్ లేదా వేడి వేడి పాలు నా అల్పాహారంలో భాగమవుతాయి.

నేను మాంసాహారిని. బటర్ చికెన్, పాలక్ పన్నీర్, బ్రౌన్ రైస్ అంటే చాలా ఇష్టం. మధ్యా హ్న భోజనంలో పప్పుతో బ్రౌన్ రైస్, దానితో పాటు చేపలు, చికెన్ లేదా తాజా కూరగా యలు తప్పనిసరి. సలాడ్‌తో భోజనం పూర్తవుతుంది. సాయంత్రం సమయాల్లో స్వీట్ కార్న్‌తో ప్రోటీన్ షేక్ లేదంటే పీచుపదార్థాలు ఎక్కువగా ఉండే బిస్కె ట్స్‌తో టీ తీసుకుంటాను. రాత్రి భోజనం కూడా మధ్యాహ్న భోజనానికి కొంచెం అటుఇ టుగా ఉంటుంది. ప్రతిరోజూ రెండు కప్పుల గ్రీన్ టీ, ఉదయం లేదా రాత్రి ఓ గ్లాసెడు పాలు నా ఆహారంలో తప్పనిసరి. నూనె, కారం, మసాలాలు ఎక్కువగా ఉండే పదార్థాలను ఇష్టప

డను. పైనాపిల్, పుచ్చకాయ, దానిమ్మ పండ్లు ఎక్కువగా ఇష్టం.

నాణ్యమైన మేకప్ రిమూవర్‌ను వాడతాను. మేకప్ తొలగించిన తర్వాత ముఖాన్ని ఫేస్ వాష్ తో కడుక్కుంటాను.

ఆహారంలో చేపలు ఎక్కువగా తీసుకోవడం వల్ల చర్మం, జుట్టు రెండూ ఆరోగ్యంగా ఉంటాయి. జుట్టుకు మంచి కండిషనర్ ఎంచుకుంటాను. కండిషనర్ వాడిన తరువాత చల్లని నీటితో జుట్టును శుభ్రం చేసుకోవాలి. వాతావరణ కాలుష్యం మూలంగా జుట్టు పాడవకుండా తరచుగా కొబ్బరినూనె పెట్టుకుంటాను.

బరువును అదుపులో ఉంచుకుంటూ శరీరాకృతిని కోల్పోకుండా ఉండేందుకు వారంలో నాలుగైదు సార్లు తగిన వ్యాయామం చేస్తాను. నా శరీరానికి త్వరగా బరువు తగ్గే గుణం ఉన్నందున గుండెకు సంబంధించిన వ్యాయామం చేయను. సమయం దొరికినపుడల్లా ప్రాణాయామం, యోగా చేడయం అలవాటు. ఫిట్‌నెస్ కాపాడుకోవడం వల్ల శరీరం దృఢంగా ఉండి అనారోగ్యం దరిచేరదు. క్రమం తప్పకుండా వ్యాయామం చేయడం వల్ల రక్తప్రసరణ బాగా జరిగి కండరాలు చురుకుగా పనిచేస్తాయి. స్టెరాయిడ్స్ శరీరంపై ఎక్కువ ప్రభావాన్ని చూపి హాని కలిగిస్తాయి. సరైన ఆహారం తీసుకుంటూ తగిన వ్యాయామం చేస్తే ఆరోగ్యమైన శరీరం సొంతమవుతుంది.



ఎక్కువసార్లు తక్కువ మోతాదులో సంతులిత ఆహారం తీసుకోవాలి. యోగా, పరుగు, జిమ్, బరువు తగ్గే వ్యాయామం, డ్యాన్స్, ఈత వంటి ఎటువంటి వ్యాయామమైనా అది శరీరానికి మేలే చేస్తుంది. వీలైనంత ఎక్కువగా నీరు తాగుతూ ఉండాలి.

సేకరణ : సంధ్యారాణి

## అమ్మకు అన్నీ తెలుసు!



పిల్లలు చెప్పే ప్రతి మాట వెనుకా దాగి ఉన్న అసలు విషయం ఏంటో తల్లి సరిగ్గా అంచనా వేయగలదు. ఎలాగంటారా.. మీరూ చదవండి..

**5 సంవత్సరాల కొడుకు:** నువ్వంటే చాలా ఇష్టం అమ్మా!
**అమ్మ:** నాకూ నువ్వంటే చాలా ఇష్టం బాబూ!

**15 సంవత్సరాల కొడుకు:** నువ్వంటే చాలా ఇష్టం అమ్మా!
**అమ్మ:** నా దగ్గర డబ్బులు లేవురా!

**25 సంవత్సరాల కొడుకు:** నువ్వంటే చాలా ఇష్టం అమ్మా!
**అమ్మ:** ఎవరా అమ్మాయి..? ఎక్కడ ఉంటుంది?

**35 సంవత్సరాల కొడుకు:** నువ్వంటే చాలా ఇష్టం అమ్మా!
**అమ్మ:** నేను ముందే చెప్పానుగా ఆ రాక్షసిని పెళ్లి చేసుకోవద్దని?

**45 సంవత్సరాల కొడుకు:** నువ్వంటే చాలా ఇష్టం అమ్మా!
**అమ్మ:** బాబూ! నేను ఏ కాగితం మీద సంతకం చేయాలి?

## మహిళా శక్తి



**నిరంతర కృషి, ఆశావాదం లక్ష్యాన్ని చేరుకోవడానికి దోహదం చేస్తాయి.**

– లుసిల్లీ బాల్



**రేపు మంచే జరుగుతుందన్న ఆశ ఉన్నపుడే ఈ రోజు కష్టాన్ని సంతోషంగా భరించగలం.**

– థిచ్ నాట్ హాన్

# సౌందర్యం



*ఎండకు చర్మం నల్లబడిందా?*

✦ నారింజ పొట్టును ఎండబెట్టి పొడిచేసి, దాన్ని పాలతో కలిపి చర్మానికి రాసుకోవాలి. 25 నిమిషాల తరువాత నీటితో కడిగితే ఎండకు నల్లబడిన చర్మం రంగు తేలుతుంది.

✦ కోడిగుడ్డు తెల్లసొన, తేనెల మిశ్రమం మొహానికి రాసుకుని ఆరిన తరువాత కడుక్కుంటే టాన్ పోయి మొహం కాంతివంతంగా కనబడుతుంది.

✦ ప్రతిరోజూ పొడిబారిన చర్మానికి బాగా పండిన అరటిపండును చిదిమి రాసుకుని 20 నిమిషాల పాటు ఆరనిచ్చి నీటితో కడిగితే మృదుత్వాన్ని సంతరించుకుంటుంది.

✦ మజ్జిగ అప్లై చేసుకుని 15 నిమిషాల పాటు ఉంచితే చర్మం పైభాగంలోని నూనె త్వరగా ఆరిపోకుండా ఉంటుంది. చర్మం పొడిబారడాన్ని అడ్డుకుంటుంది.

✦ పచ్చి పసుపు, నువ్వులు సమభాగాలుగా తీసుకుని కొద్దిగా నీరు చేర్చి నూరుకోవాలి. ఈ మిశ్రమాన్ని రాత్రిపూట ముఖానికి పట్టించి పొద్దున లేవగానే వేడినీటితో కడిగేసుకుంటే చర్మం తళుకులీనుతుంది.

# టెక్ గురూ!

*ఫ్లవర్స్ ఫొటో ఫ్రేమ్స్*



ఇపుడు సెల్ఫీలు తీసుకోవడం ఒక అలవాటుగా మారిపోయింది. రోజూకన్నా కొంచెం ప్రత్యేకంగా కనిపించామంటే చాలు.. సెల్ కెమెరాను క్లిక్‌మనిపిస్తుంటాం. మరి వాటికి ఓ చక్కని, అందమైన పూల ఫ్రేమ్‌ని జత చేస్తే మరింత అందంగా కనిపిస్తుందా ఫొటో. మనవేనా.. మనకి ఎంతో ఇష్టమైన మిత్రుల, పెంపుడు జంతువుల ఫొటోలను ఈ యాప్ ద్వారా లభించే రకరకాల ఫొటో ఫ్రేములలో పెట్టుకోవచ్చు

*హెచ్‌డి వీడియో డౌన్‌లోడర్ అండ్ లైవ్ టి.వి.(విడ్‌మేట్):*

ఒక్కోసారి అత్యవసర పనుల వల్ల మనకిష్టమైన ప్రోగ్రాములు, ఇతర లైవ్ షోలు చూసేందుకు వీలు పడదు. ఒక్కసారి ప్రసారమైన ప్రోగ్రాములేమో మళ్లీ ప్రసారం కావు. ఈ సమస్యను అధిగమించేందుకే విడ్‌మేట్ యాప్‌ను అభివృద్ధి చేశారు. దీని ద్వారా గతంలో ఎపుడు ప్రసారమైన ప్రోగ్రాములనైనా చూసే అవకాశముంది. 200 ఛానెళ్లలో ప్రసారమైన ఏ ప్రోగ్రామునైనా యుట్యూబ్ నుండి ఈ యాప్ ద్వారా ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. మనకు ఎపుడు సమయం దొరికితే అపుడు వాటిని తీరికగా చూసి ఆనందించవచ్చు.

*యుసి బ్రౌజర్ మిని*

బ్రౌజింగ్‌కోసం ఎక్కువ సమయం వృథా అవకుండా ఉండేందుకు చక్కని యాప్ ఇది. ఎటువంటి ఆటంకం లేకుండా వెబ్ సర్ఫింగ్ చాలా వేగంగా సాగిపోతుంది. నెట్‌వర్క్ కనెక్షన్ ఏదైనా ఈ యాప్ పని చేస్తుంది. క్షణాల్లో కావలసిన విషయాలు మనకళ్ల ముందు కనిపిస్తాయి.

ఈ యాప్స్‌ను గూగుల్ ప్లే నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు

# జతపరచండి

జావళీలు కేవలం తెలుగు సినిమాలకే ప్రత్యేకం. ఇక్కడ కొన్ని జావళీలు, అవి ఉన్న సినిమాలు ఉన్నాయి. ఏ జావళి ఏ సినిమాలోదో చెప్పగలరా? ప్రయత్నించండి.

| | |
|---|---|
| 1. పిలిచినా బిగువటరా | ఎ. ముద్దుబిడ్డ |
| 2. ఇంత తెలిసియుండి | బి. మిస్సమ్మ |
| 3. బాలనురా మదనా | సి. మల్లీశ్వరి |
| 4. ఎంతటి రసికుడవో తెలిసెరా | డి. అభిమానవంతులు |
| 5. రారా నా స్వామి రారా! | ఇ. అమరశిల్పి జక్కన |
| 6. ఎప్పటి వలె కాదురా నా స్వామి | ఎఫ్. ముత్యాల ముగ్గు |
| 7. అంతలోనే తెల్లవారె అయ్యో ఏమి? | జి. విప్రనారాయణ |
| 8. నగుమోము చూపించవా గోపాలా | హెచ్. దేవదాసు |

జవాబులు ఈ సంచికలోనే.. కూర్పు : కావ్య




### ఎవరంటే ఇష్టం?

**తండ్రి:** కన్నా! నీకు ఎవరంటే ఇష్టం.. నేనా అమ్మా?

**టింకు:** ఇద్దరూ..

**తండ్రి:** నేను అమెరికా, అమ్మ పారిస్ వెళ్తే నువ్వు ఎక్కడికెళ్తావు?

**టింకు:** పారిస్ అందంగా ఉంటుంది కదా అక్కడికే వెళ్తాను.

**తండ్రి:** మరి నేను పారిస్, అమ్మ అమెరికా వెళ్తే నువ్వెక్కడికెళ్తావు?

**టింకు:** అమెరికా నేనెప్పుడూ చూడలేదు కాబట్టి అమెరికా వెళ్తాను!



### ఎందుకలా?

**నవీన్:** ఒరేయ్! మాతృభాష అని అంటారు కదా, అలానే ఎందుకు.. పితృభాష అని ఎందుకనరు?

**శ్యామ్:** మరి అమ్మానాన్నల్లో ఎక్కువగా మాట్లాడేది అమ్మే కదరా అందుకే!



### ఏం చెయ్యాలి?



తలపై నాలుగు వెంట్రుకలున్న ఓ బట్టతలతను బార్బరు షాపుకెళ్లి కూర్చున్నాడు.

**బార్బరు:** ఈ వెంట్రుకలను కత్తిరించాలా లేక లెక్కపెట్టాలా?

**బట్టతలతను:** ఆ రెండూ వద్దయ్యా.. వాటికి రంగు వెయ్యి చాలు!

# ఆలూ పాలక్ పరోటా





**తయారుచేసే పద్ధతి:**

ఓ వెడల్పాటి గిన్నెలో కావలసిన పదార్థాలను తీసుకుని, వాటిపై ఒక టేబుల్ స్పూను నూనె, తగినన్ని నీళ్లు పోసి చపాతీ పిండిలా కలపాలి. ఆ పిండిని తగు పరిమాణంలో ముద్దలుగా చేసుకోవాలి. ఇప్పుడు వాటిని చపాతీల్లా వత్తుకోవాలి. వత్తేటప్పుడు నూనెకు బదులు గోధుమ పిండిని వాడాలి. పాన్‌లో కొద్దిగా నూనె వేసి వత్తిన చపాతీలను సన్నని శగ మీద రెండువైపులా బంగారు వర్ణం వచ్చేవరకు కాల్చాలి. వీటిని పెరుగు లేదా ఏ చట్నీతో తిన్నా రుచిగా ఉంటాయి. ఈ ఆలూ పాలక్ పరోటాలను పిల్లలు బాగా ఇష్టపడడమే కాదు, ఆరోగ్యకరం కూడా.

## కావలసిన పదార్థాలు

- ఉడకబెట్టి మెత్తగా చిదిమిన ఆలు- 2 కప్పులు
- సన్నగా తరిగిన పాలకూర- 1 కప్పు
- గోధుమ పిండి - 2 కప్పులు
- శనగపిండి - 1/2 కప్పు
- తాజా పెరుగు - 4 టేబుల్ స్పూన్లు
- సన్నగా తరిగిన పచ్చిమిర్చి - 1 టేబుల్ స్పూను
- పసుపు - 1/2 టీస్పూను
- నూనె, ఉప్పు తగినంత

# వికారానికి విరుగుడు



ఒక్కోసారి చాలా వికారంగా, వాంతి వచ్చేట్టుగా ఉంటుంది. ఈ సమస్య నుండి ఉపశమనం పొందడానికి మణికట్టు మధ్యభాగంలో అంటే అరచేతికి మూడువేళ్ల దిగువన నెమ్మదిగా రుద్దాలి. అలా చేస్తే వికారం క్షణాల్లో మాయమవుతుంది.

**జతపరచండి జవాబులు :** 1. సి, 2. హెచ్, 3. బి, 4. ఎఫ్, 5. జి, 6. డి, 7. ఎ, 8. ఇ

# చిట్కాలక్ష్మి



- ★ లోడ్‌కు సరిపడా బట్టలుంటేనే వాషింగ్‌మెషిన్‌ను ఉపయోగించాలి. విద్యుత్తు, సర్ఫ్, నీళ్ళు ఆదా అవుతాయి.
- ★ బాగా మాసిన బట్టలు వాషింగ్‌మెషిన్‌లో ఉతికేపుడు వేడినీళ్లు వాడితే మురికి బాగా వదులుతుంది.
- ★ తడిబట్టలకు డ్రయ్యర్‌లను వాడేటప్పుడు తక్కువ సమయాన్ని మెషిన్‌లో సెట్ చేయడం వల్ల విద్యుత్ ఆదా అవుతుంది.

